# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!

## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు.

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు; సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదారాలు కలవు.
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది. పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు.
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు.
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు.
- దీనిని కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే అవసరం లేదు.

**ఫారెక్స్®–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CLARION/B/GX/15/244/TEL

మనోహరమైన డిజైన్లలో....

# మహబీర్

కాటన్ ప్రింటెడ్ చీరలు






మహబీర్ కాటన్ శారీస్ అన్ని షాపులలో లభించును

HK.INTERNATIONAL/MB/TL

డిస్ట్రిబ్యూటర్లు: విజయవాడ : శ్రీ ఉమా టెక్స్‌టైల్స్*విజయనగరం : ఎమ్. పూనమ్‌చంద్‌జైన్ * చిత్తూరు : ఎస్.ఏ. ఆనందన్&సన్స్ *ప్రొద్దుటూరు : తల్లం వస్త్రాలయం*
నిజామాబాద్ : మోహన్ టెక్స్‌టైల్స్* హిందూపూరు : శ్రీ సత్యసాయి టెక్స్‌టైల్స్ శ్రీ దాస నారాయణయ్య విష్ణయ్య... *చీరాల: రఘురామ టెక్స్‌టైల్స్* సికింద్రాబాద్ :

# సూపర్ కంప్యూటర్ అడిగితే సోడానీళ్ళు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

అమెరికాతో రాజీవ్‌గాంధీ ప్రేమయాత్ర ముగిసింది గత ఏడాది అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఆయనని ఒక గొప్ప కథానాయకుడిగా ఆకాశానికి ఎత్తారు. ఆయనని కీర్తించటంలో అక్కడి వార్తాపత్రికలు ఒకదాన్నిమించి మరొకటిగా పోటీపడ్డాయి. ఆతర్వాతజరిగిన రాజీవ్‌గాంధీ మాస్కో, హవానా పర్యటనలవల్ల వారి అభిమానం అంతరించి ఆయన పట్ల వ్యతిరేకభావం ఏర్పడింది. 'అమెరికన్ నాగరికత విస్తరణ భీతి' ప్రపంచ వ్యాప్తంగా పెరిగిపోతున్నదని ఇటీవల కొత్త ఢిల్లీలో ప్రధానమంత్రి తమ పార్టీవారితో అన్నారు. ఆయన అన్నమాటలలో ఒక్క 'నాగరికత' అన్నది మినహాయిస్తే మిగిలినవన్నీ గోర్బచేవ్ బృందం తప్ప మరెవరూ అననటువంటివి. అమెరికాకి సంబంధించిన ఏ విషయంలోనైనా వాళ్ళ 'నాగరికత' అన్నమాటని ఉపయోగించరు.

ఇదంతా ఏదో తమాషాగానే ఉండవచ్చు. ఎందుకంటే నిన్నకాక మొన్న 'వాల్ స్ట్రీట్ జర్నల్' పత్రిక రాజీవ్‌గాంధీని రాజీవ్ రీగన్‌గా సంబోధించింది. అంతకుమించిన పొగడ్త ఆ పత్రిక నిఘంటువులో ఇప్పటివరకూ లేనేలేదు. అప్పటినుంచే పరిస్థితులు తారుమారైనట్లు కనిపిస్తున్నది. ఎందుకంటే అక్కడ పత్రికలలో ఆ తర్వాత రాజీవ్‌పేరు కనిపించలేదు. ఈమధ్య 'న్యూస్‌వీక్' పత్రిక హరారే సమావేశంమీద ఒక పూర్తిపేజి వ్యాసాన్ని ప్రచురించింది కానీ ఎక్కడా కనీసం రాజీవ్‌గాంధీ పేరుకూడా ఎత్తలేదు.

అంటే దాని అర్థం రాజీవ్ ప్రభుత్వ యంత్రాంగం అమెరికా సంయుక్త రాష్ట్రాలకి దూరం అవుతున్నదనికాదు. పెప్సీ, టాటాలకి సంబంధించిన వార్తలతో మొన్నీమధ్యనే వార్తాపత్రికలు నిండిపోయాయి. భారతదేశంలో పెప్సీ మనిషి ఒక్క రతన్ టాటా తప్ప మరెవరూ కారు. ఇటీవలే ఈయన మరో ప్రముఖ వాణిజ్యవేత్త రాహుల్ బజాజ్‌తోపాటుగా ఎయిర్ ఇండియా ఛైర్మన్‌గా నియమింపబడ్డారు. ఈ రాహుల్ బజాజ్ వాణిజ్యసంస్థ పైనా, మరికొందరు రాజీవ్ ప్రభుత్వ యంత్రాంగానికి సన్నిహితులైన వారి సంస్థలపై ఇటీవల విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ క్రింద పనిచేసే అధికారులు దాడులు జరిపారు. అమెరికాకి రాజీవ్‌గాంధీ అంటే ఇష్టం లేకపోవచ్చు కానీ ఇక్కడ ఉన్న దాని ఖాతాదారులపై మాత్రం అయిష్టం లేదు.

చివరికి రాజీవ్‌గాంధీ బృందం భారతదేశానికి సంబంధించినంతవరకూ అమెరికావారు కోరకరాని కోర్కెలని గ్రహించింది. రష్యన్‌ల సంగతి వేరు. అమెరికాకి చెందిన పత్రికా విలేఖరిని ఒకరిని మాస్కోలో నిర్బంధంలోకి తీసుకున్నప్పుడు రీగన్ కింద ఉన్న అధికారులు అతని విడుదలకీ అంతకుముందు న్యూయార్క్‌లో అరెస్టు అయిన రష్యా గూఢచారి విడుదలకీ బేరంపెట్టే ప్రసక్తే లేదని అన్నారు. అయినా చివరికి జరిగింది దాదాపు అదే. న్యూయార్కులోని తమ మనిషిని విడుదల చేసేవరకూ ఆ విలేఖరిని అప్పగించటానికి రష్యన్‌లు నిరాకరించటంతో బేరానికి ఏర్పాట్లు జరిగాయి కొంతే యిద్దరు ఖైదీలని వదిలిపెట్టటం మాత్రం జరగలేదు. ఇటువంటి విచిత్రమైన అరెస్టులు-విడుదలల నాటకాలు మరెన్నిటినో సృష్టించేందుకు రష్యన్‌లు చూస్తున్నారని అవి అమెరికావారు రష్యన్‌లని నమ్మటానికి వీలులేదనే అభిప్రాయానికి వచ్చేదాకా కొనసాగుతాయని అనిపిస్తున్నది.

అమెరికన్‌లనికూడా మనం నమ్మటానికి వీలులేదు; కానీ రాజీవ్ ప్రభుత్వ యంత్రాంగం అదే చేస్తున్నది. వారి మనిషి వాషింగ్‌టన్‌లో విందులూ, వినోదాలూ మొదలైనవాటిలో పాల్గొన్నారు కాబట్టి అమెరికా సంయుక్త రాష్ట్రాల వ్యవస్థ అంతా ఆయన జేబులోఉన్నట్లు న్యూఢిల్లీ భావించింది. కానీ పరిస్థితులు మరో రకంగా పరిణమించినప్పటినుంచీ అమెరికన్‌లు దాదాపు అన్ని విషయాలలోనూ మనతో నిర్మొహమాటంగా, దృఢంగా వ్యవహరిస్తున్నారు. సూపర్ కంప్యూటర్ మన దేశానికి ఎగుమతి చెయ్యటం నుంచి దక్షిణాఫ్రికాపై ఆంక్షలు విధించటం వరకూ అన్నిటికీ వారు నిరాకరిస్తున్నారు. మనపట్ల కఠినంగా ఉంటున్నారు, హరారే సమావేశంతో నిమిత్తం లేకుండా. ఫలితంగా జింబాబ్వేలో నిస్సారమైన తీర్మానం. అది తటస్థ రాజ్యాలనబడేవాటిని గతంలో కన్నా ఒక్క అడుగుకూడా ముందుకి తీసుకుపోదు. ఇప్పటికీ మనకి సూపర్ కంప్యూటర్ లేదు. అది లేకపోయినా కొంత పర్వాలేదు కానీ అమెరికన్‌లు మనని పెప్సీకోలా ప్రవాహంలో ముంచెత్తటానికి పట్టుదలగా ఉన్నట్లు కనిపిస్తున్నది. రొట్టె అడిగితే రాయి ఇచ్చిన చందంగా ఉన్నదది. అమెరికన్‌లని మనం కంప్యూటర్‌లని, ఇతర ఉన్నత సాంకేతిక పరికరాలని అడుగుతాము. కానీ వాళ్ళు మనకి ఇచ్చేది ఒక క్రేట్‌నిండా కలర్ సోడా నీళ్ళు.

ఈ 'గాట్' (ధరలు—వ్యాపారానికి సంబంధించిన సార్వత్రిక అంగీకారం) వ్యవహారం కూడా దాదాపు అలాంటిదేనని చెప్పవచ్చు ఎల్.కె.ఝా బృందం ఈ 'గాట్' విషయంలో అంత గొడవ ఎందుకు చేస్తున్నారో నాకు తెలియటం లేదు. ఆయన ఇప్పుడు రాజకీయవాది అయినారన్న విషయం మనం మరువకూడదు. ప్రజలని ఆకట్టుకునే విద్యలని ఆయనకూడా ప్రదర్శించాల్సి ఉంటుంది. గత కొన్నేళ్ళగా అమెరికావారు బాంకింగ్, భీమా, పర్యటన మొదలైనవాటిని కూడా సరుకులు, వస్తువుల మార్పిడికి ఉద్దేశింపబడిన 'గాట్' క్రింద చేర్చాలని పట్టుబడుతున్నారు. దానికి మనం వ్యతిరేకించాము. తృతీయ ప్రపంచ దేశాలనబడే ఎన్నో దేశాల మద్దతుకోసం ప్రచారం చెయ్యగలిగాము. ఇప్పుడు మొట్టమొదటిసారిగా సేవలని కూడా చర్చలలో చేర్చవలసి వస్తుంది. 'గాట్' క్రింద కాకపోయినా విడిగా మంత్రివర్గ స్థాయిలోని ఒక సమావేశంలో అది చర్చనీయాంశం కాగలదు. ఇది కేవలం సాంకేతిక పరమైన తమాషా. దానికి అర్థం లేదు. 'గాట్' సమావేశాలలో పాల్గొనేవారు వారి మంత్రిత్వ శాఖలనించి ఆదేశాలు తీసుకోవాల్సి ఉంటుంది కాబట్టి వాస్తవంగా మారినది అంటూ ఏమీ లేదనే చెప్పాలి.

విజయంగా పేర్కొనబడుతున్నా లదికేవలం కాస్త ఊపిరి తీసుకోటం లాంటిది మాత్రమే. అమెరికా సంయుక్త రాష్ట్రాల నాయకత్వంలో ఉన్న అభివృద్ధిచెందిన దేశాలకి మాత్రమే అది విజయం. ఈ సమస్యపై అవి చాలా తీవ్రమైన వైఖరిని ప్రదర్శించాయి. రీగన్ పరిపాలనలోని అమెరికన్‌లు ప్రతిఅంతర్జాతీయ సమస్య విషయంలోనూ తీవ్ర వైఖరిని ప్రదర్శిస్తున్నారు. అది దక్షిణ ఆఫ్రికాపై ఆంక్షలైనా లేక లిబియాపై

(68 వ పేజీ చూడండి)

వంటకాలకు నిజంగా రుచి తెచ్చేది వంట మొదలెట్టక ముందే మీరు చేయవలసిన పని. అంటే–వంటకాలకై సరైన దినుసుల్ని ఎంచుకోవడమన్నమాట. ఒక్కొ–క్క– దినుసూ సరైన రుచీ వాసనా ఉండేలా చూసుకోవాలి. మసాలా దినుసులన్నీ నిండుగానూ, సువాసనా భరితంగానూ ఉండాలి. బియ్యం పొడుగ్గా ఉండాలి. కూరగాయలు పచ్చిగా, తాజాగా, రసం నిండి ఉండాలి. ఈ దినుసులన్నిటికీ సరిజోడుగా వంట నూనె సరైనదిగా ఉండాలి. సన్‌ఫ్లవర్ వనస్పతి లాగానన్నమాట. నాకిష్టమైన వంటకం ఒకటి చెప్తాను దీనితో చేసిచూడండి:

## మలబారీ క్రరీ

### మసాలా

½ కొబ్బరి కాయ తురుమినది, 1 పెద్ద–చెమ్చా ధనియాలు, 1½ చిన్న చెమ్చాలు జీలకర్ర, 3 చెక్క–లు దాల్చిని, 3 లవంగాలు, 3 మిరియాలు, 5 గర్భలు వెల్లుల్లి, 10 కాశ్మీరీ మిరపకాయలు, 3 చిన్న చెమ్చాలు, గసగసాలు 1 పెద్ద ఉల్లిపాయ ముక్క– 1 చిన్న చెమ్చా సన్‌ఫ్లవర్ వనస్పతి.



### చేసే పద్ధతి

1. సన్‌ఫ్లవర్ వనస్పతిని వేడి చేసి దినుసులన్నిటినీ 2 నిముషాలపాటు వేయించండి.
2. కొద్ది నీళ్ల వేసి ముద్దగా నూరండి.

# తరళా దలాల్*
# వివరిస్తున్నారు,



## "వంట మొదలెట్టక మునుపే వంటకాలకు రుచి తేవడమెలా"

## క్రరీ

2 పెద్ద టొమాటోలు 2 కప్పులు ఉడికించిన కూరగాయలు మిశ్రమం (కారట్లు, కాలీఫ్లవర్, బఠాణీలు, బీన్సు, బంగాళాదుంపలు) 1 పెద్ద చెమ్చా తాజా మీగడ ½ చిన్న చెమ్చా పంచదార 3 పెద్ద చెమ్చాలు సన్‌ఫ్లవర్ వనస్పతి (రుచికి తగినంత ఉప్పు)

### చేసే పద్ధతి



1. టొమాటోలను వేడి నీళ్లలో 10 నిముషాలు నానబెట్టండి. గుజ్జుగా తురమండి. 2. సన్‌ఫ్లవర్ వనస్పతిని వేడి చేసి, ముందు చెప్పిన మసాలా ముద్దను ఒక నిముషం పాటు వేయించండి. 3. అందులో టొమాటోలు, కూరగాయలు, ½ కప్పు నీళ్లు వేసి 4 నిముషాల పాటు ఉడకనివ్వండి. 4. అందులో పంచదార, మీగడ, ఉప్పు వేయండి.

మంచి నెయ్యి వాడకుండా దానికి బదులుగా సన్‌ఫ్లవర్ వనస్పతి వాడానేమిటా అని ఆశ్చర్యపోతున్నారా! ఫలితాలు చూశారంటే మరింతగా ఆశ్చర్యపోతారు. మీకై మీరే చూసుకోండి.

*సుప్రసిద్ధ పాకశాస్త్ర నిపుణులు.






Closer to the consumer

WPL 2545

## సన్‌ఫ్లవర్ వనస్పతి–మంచినెయ్యి మాత్రమే దీన్ని మించగలది

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు : (1938-1972)

24–30 అక్టోబరు 1986

శ్రీ అక్షయనామ సం. ఆశ్వయుజ బ. షష్ఠి

**సంపుటము : 79 సంచిక : 8**

సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

విడి ప్రతి వెల రు. 2.75

పోస్టులో 6నెలల చందా రు. 78.00

పోస్టులో 12నెలల చందా రు. 156.00

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి : రాధిక

(ఫోటో : వి. సత్యమూర్తి)






## ముఖచిత్రం

సినిమా నటి రాధయ'ఆ
కనుతీరును బొమలతీరు కలవర పెట్టున్
కనుపించని చిరునగవును
కనుగొనగా, వారపత్రికో సెబాసందున్

– బాపట్ల వెంకటేశ్వరసాయి, చెరువు జమ్ములపాలెం

## సీరియల్స్

అందాల నటి, ఆంధ్రుల అభిమాన తార 'రాధ' ముఖచిత్రంతో వెలువడిన పత్రిక బ్రహ్మాండంగా ఉంది 'పావని' సీరియల్ మంచి రసవత్తరంగా ఉంది

–ఎస్ బిల్వేశ్వరరావు, నౌపడా

★ ★ ★

కొత్త సీరియల్ 'పావని' ఇతివృత్తం బాగుంది ఇంత మంచి ఇతివృత్తంతో కథాగమనాన్ని నడిపిస్తున్న రచయిత్రికి ప్రత్యేక అభినందన కుసుమాలు

–కొల్లి శివరామిరెడ్డి, కె సీతామహాలక్ష్మి, కె సాయిలీల, నందివెలుగు

★ ★ ★

26 సెప్టెంబర్, 2 అక్టోబర్ సంచికపై 'రాధ' ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉంది 'కరిగిన శిల', 'సంకెళ్ళెవరికి?', 'నిశ్శబ్ద సంగీతం' సీరియల్స్ ఆసక్తికరంగా సాగుతున్నాయి

–కొండమూరి శ్యామ, గుత్తినదివి

★ ★ ★

26 సెప్టెంబర్–2 అక్టోబర్ 86 బ్యూటీ క్వీన్ రాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఆకర్షణీయంగా ఉంది కరిగిన శిల సీరియల్ మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకుంది రచయిత్రికి నా ధన్యవాదాలు

–పక్కి సంజీవ్‌కుమార్, విజయనగరం

## కథలు

నటి రాధ 'ముఖచిత్రంతో వెలువడిన 26సెప్టెంబర్-2 అక్టోబర్ 86 మా ఆంధ్రసచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది

'మానవత్వమా' మన్నించు , వాంటెడ్ టెనెంట్' కథలు చాలా బావున్నాయి

- నాగండ్ల వెంకటేశ్వర్రావు, రమేష్, అమ్మాపాలెం

★ ★ ★

"రాధ" ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో మానవత్వమా మన్నించు కథ చాలా బాగుంది రచయిత శేఖర్ పాత్రను చక్కగా వర్ణించినారు

–కె ఎన్ వి రవికుమార్, మైలవరం

## వ్యాసాలు

సెప్టెంబర్ 26 అక్టోబర్ 2 1986 సంచికలో 'చిత్తుచేసే మాదక ద్రవ్యాలు -విజ్ఞానదాయకంగా వుంది

- యన్ కనకారావు పర్లాకిమిడి

## బొమ్మల సీరియల్

26 సెప్టెంబర్-2 అక్టోబర్ 1986 నటి రాధ ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగున్నది బొమ్మల సీరియల్ సీక్రెట్ ఏజంట్ విక్రమ్ చాలా బాగున్నది సినిమా చూసినట్లుగా ఉంది

- చొడాబత్తుల విశ్వనాధన్,
- జి నాగరాజు, కుప్పనపూడి

## అభిమాన తారలపై అభిప్రాయం

ఆంధ్రుల అభిమాన పత్రిక ఆంధ్రసచిత్ర వారపత్రిక లో ప్రచురిస్తున్న అభిమాన తారలపై అభిప్రాయం" శీర్షిక చాల బాగుంది. ఆయా తారలపై ఆయా (పాఠకులు) అభిమానులు వ్యక్తపరుస్తున్న అభిప్రాయాలు సమంజసనీయంగా ఉన్నాయి

–బి మహమ్మద్ సలీమ్, గుత్తి ☐

సీరియల్

# కరిగిన శిల

రాపినూతల సువర్ణకన్నన

(గత సంచిక తరువాయి)

ఆ రోజు ఆపరేషన్స్ అన్నీ అయిపోయాక అత్త గారికెలా వుందో అని అక్కడికి ఫోన్ చేశాడు ప్రభాకర్ ఆవిడ కాస్త కులాసాగానే వుందని చెప్పారు. అప్పుడు సరయు అక్కడే వుంది ఆవిడ కులాసాగానే వుంది అన్న వార్త విని వెళ్ళిపోయింది

ఆమె వెళ్ళిన పది నిముషాలకల్లా సూట్‌కేస్‌తో బైటికి రాబోతున్న ప్రభాకర్‌కి ఆదుర్దాగా పరిగెత్తుకొస్తూ కాంపౌండర్ షరీఫ్ కనిపించాడు

ఏవిఁటీ" అన్నట్టు చూశాడు ప్రభాకర్

'సర్ సరయు అమ్మగార్ని ఓ లారీ గుద్దేసింది చాలా సీరియస్‌గా వున్నారు!' ఒణికిపోతూ చెప్పాడు షరీఫ్

సూట్‌కేస్ అక్కడే పడేసి పరిగెత్తాడు ప్రభాకర్ రక్తం మడుగులో శవాకారంలా పడుంది సరయు చుట్టూ జనం మూగుతున్నారు పక్కనే లారీ కూడా వుంది

సరయును చూశాడతను వూపిరి నీరసంగా పీలుస్తోంది.రక్తం చాలా పోవడం మూలంగా కండిషన్ ఏం బాగాలేదు అందరూ కలిసి అప్పటికే రెడీగా వున్న అంబులెన్స్‌లో సరయుని హాస్పిటల్‌కి తరలించి ఆపరేషన్‌కి సిద్ధం చేశారు క్షణాలమీద

'బ్లడ్ కావాలి' అన్నాడో డాక్టర్

నిమిషాల్లో డోనర్స్ పదిమంది వచ్చారు.

క్షణాల్లో గ్రూపింగ్ జరిగింది

అయితే-ఏ ఒక్కరి బ్లడ్డూ ఆవిడకి సూటవలేదు ఆమెది ఎ. బి గ్రూప్

క్షణక్షణానికీ సరయు పరిస్థితి దిగజారిపోతోంది దాదాపు ఆశ వదులుకున్నారంతా

నా బ్లడ్ సరిపోతుంది చూడండి!" అంతవరకు ఆ ఆలోచన తట్టనందుకు బాధపడుతూ అన్నాడు ప్రభాకర్

మీరిస్తారా?' అన్నారెవరో

'అవును! త్వరగా క్రాస్ మేచ్ చెయ్యండి!'

వెంటనే ప్రభాకర్ బ్లడ్ తీసి సరయు బ్లడ్‌తో క్రాస్ మేచ్ చేశారు

అది సరిపోయింది

క్షణాల మీద ప్రభాకర్ శరీరంలోని బ్లడ్ కొంత సరయు శరీరంలోకి కెళ్ళింది

అయినా ఆమెలో పెద్దగా మార్పు రాలేదు ముఖాలు చూసుకున్నారు డాక్టర్లు

హఠాత్తుగా ప్రబాకర్ ఫోన్ దగ్గరికి పరిగెత్తాడు అరగంటలో అతని తండ్రి కారు హాస్పిటల్ కాంపౌండ్‌లోనికి దూసుకొచ్చింది సుబ్బారావు పరిగెత్తినట్లు వచ్చాడు కొడుకు దగ్గరికి మామూలు పరిక్షలయ్యాయి

"ఓ! కే" అన్నారు డాక్టర్లు

అంతే! సరయు శరీరంలోకి మరో ఫోర్ హండ్రెడ్ సి సి బ్లడ్ వెళ్ళింది.

చుట్టూ చేరి మృత్యుముఖంలోంచి ఆమెని కాపాడాలని శతవిధాల ప్రయత్నిస్తున్న డాక్టర్ల కళ్ళు మెరిశాయి

సరయులో ఇంప్రూవ్‌మెంట్ కనిపించింది. పడిపోయిన బి పి రైజవడం ప్రారభించింది

డాక్టర్ల మొహాల్లో తృప్తి కనిపించింది

సరయుకి తాను బ్లడ్ ఇచ్చిన సంగతి శ్యామలకి తెలియనివ్వవద్దని హెచ్చరించాడు ప్రభాకర్ అక్కడి వాళ్ళకి కారణం శ్యామల డాక్టరే అయినా ఒకోసారి మరీ చిన్న పిల్లలా ప్రవర్తిస్తుంది ముఖ్యంగా ప్రభాకర్ మీద ఈగ వాలకూడదు! అతనికెప్పుడైనా సుస్తీ చేసి ఓ ఇంజక్షన్ చెయ్యాల్సొస్తే ఓ మేజర్ ఆపరేషన్ చేసినంత హడావిడి చేస్తుంది అందుకే ఆ విషయం ఆమెకి తెలియనివ్వవద్దని కోరాడు

మూడు రోజుల తర్వాత సరయు మృత్యుముఖంనించి ఇవతలికొచ్చేసింది

రక్తసిక్తమయిన ఆమె బట్టలు పారేయించి హాస్పిటల్ బట్టలేయించాడు ప్రభాకర్ అయితే సరయుకి తెలివొచ్చాక ఆ బట్టలు వేసుకోలేననీ తన ఇంట్లోంచి ఓ చీర తెచ్చిమ్మనీ కోరింది

ప్రభాకర్ ఇంటికెళ్ళి ఎదురుగా వున్న శ్యామల చీరఒకటి తీసికెళ్ళి సరయు మొహమాటపడుతున్నా వినిపించుకోకుండా ఓ నర్సు చేత ఆమెకి కట్టించాడు

ప్రభాకర్, అతని తండ్రి రక్తదానంతోనూ, పలువురి డాక్టర్స్ కృషి ఫలితంగానూ ఆమె బతికి బయటపడింది.

ఆ కృతజ్ఞత ఆమె నరనరాల్లోనూ వుంది అందుకే తన మూలంగా తన ప్రాణదాత సంసారం విచ్ఛిన్నం అవడం సహించలేని సరయు ఓ వుత్తరం ముక్క రాసిపెట్టి వూరొదిలి వెళ్ళిపోయింది

**జరిగిన కథ-17:** సరయు అడ్రసు కావాలంటూ వనజ ఇంటికి వస్తాడు రమణ సరయుకి వివాహం అయ్యిందని, ఆమె ఇప్పుడు ఎక్కడున్నది తనకి తెలీదని చెపుతుంది వనజ ప్రభాకర్, సరయూలను అనుమానిస్తుంది శ్యామల రమణ చిన్నా పేరిట చిన్నా శాంతి హోమ్" స్థాపిస్తాడు. డా. సుగుణ రమణకి చేరువయి ప్రాణ స్నేహితురాలైంది శ్యామల తల్లి చనిపోయింది డా. సుగుణ బలవంతం వల్ల పెళ్ళికి అంగికరిస్తాడు రమణ. మామగారు అన్న మాటలకు ఆవేశంగా జవాబిస్తాడు ప్రబాకర్ సరయు అడ్రసు డా శ్యామల దగ్గర తీసుకుని డా సుగుణ, రమణ ప్రభాకర్ దగ్గరకు వెళతారు సరయు డా ప్రభాకర్‌కి ఉత్తరం రాసిపెట్టి వెళ్ళిపోయిందని తెలుసుకుని నిరుత్సాహంగా తిరుగుముఖం పట్టారు ప్రభాకర్ వాళ్ళ వంటావిడ కాంతమ్మ శ్యామలకి అసలు జరిగిన విషయం వివరించింది

జరిగిందిది!

*　　*　　*　　*　　*　　*

ఇప్పుడు చెప్పండి! అయ్యగారు చేసింది తప్పుడు పనేనా? ఆ సరయమ్మ విశ్వాస ఘాతకురాలేనా? కంటి నీరు తుడుచుకుంటూ అంది కాంతమ్మ

స్థాణువైపోయింది శ్యామల

ఛ! ఛ! ఎంత పొరపాటు జరిగింది.నా తెలివి తక్కువతనం, తొందరపాటు ఇన్ని అనర్థాలకి దారితీసిందా?

పాపం! సరయు ఇవన్నీ చెప్పడానికే వచ్చింది కాబోలు! ఎక్కడా - నా అహం విననిచ్చిందా? ప్రాణంతో ప్రాణమయిన ప్రభుని అవమానంపాలు చేశాను అమాయకురాలైన సరయుని వీధిపాలు చేశాను ఛ! నా పాపానికి నిష్కృతిలేదు! రెండు చేతుల్లోనూ మొహం దాచుకుని బావురుమంది శ్యామల

కాంతమ్మ ఆమెని ఓదారుస్తున్నట్టు చేతులు పట్టుకుంది

'నేను అంటూనే వున్నానా అబ్బాయి అటువంటివాడు కాడే మీరేదో పొరపడ్డారు అని! నా మాట విన్నారా మీ తండ్రీకూతుళ్ళు మెత్తగా చివాట్లుపెడుతూ వచ్చింది కథంతా విన్న శ్యామల బామ్మగారు

బామ్మా!- ఆయన నన్ను క్షమిస్తారంటావా?' బేలగా అడుగుతున్న మనవరాల్ని చూస్తుంటే జాలేసిందావిడకి

ఇందులో క్షమించడానికేం వుందే పిచ్చిదానా! భార్యాభర్తలన్నాక పొరపొచ్చాలు రాకుండా వుంటాయా? ఎవరో ఒకరు సర్దుకు పోతుండాలిగానీ

నన్నడిగితే ఇందులో అతనిదీ కొంత తప్పుంది లేకపోతే ఇన్నాళ్ళు నువ్విక్కడున్నా అదేవ(ని అడగద్దూ? నువ్వు కాస్త చిన్నతనపు మూర్ఖత్వంతో ప్రవర్తించావనుకో మెల్లగా బుజ్జగించి తెలుసుకొని-

'అసలు సంగతి ఇదీ! సరయుకీ, నాకూ ఎలాంటి అక్రమ సంబంధంలేదు అని అర్థమయ్యేలా చెప్పద్దూ?' ఓ పెద్ద లెక్చరిచ్చింది బామ్మగారు

"విషయం ఇదీ అని చెప్పడానికి అసలు అమ్మగారు అవకాశం ఇస్తేగా? . ప్రభాకర్ని వెనకేసుకొచ్చింది కాంతమ్మ

"సరి! సరి! ఎవరి పొరపాటైతేనేం జరిగిందేదో జరిగిపోయింది ఇంక నీ ఇంటికి నువ్వు పో తల్లీ!' మురిపెంగా విసుక్కుంది బామ్మగారు

"బామ్మా! నసిగింది శ్యామల

'ఏవి(టీ?

ఆయన నన్ను క్షమిస్తారంటావా?" బేలగా అడిగింది శ్యామల.

'పిచ్చి పిల్లా! ఏదొచ్చినా పట్టలేవే( నీకు! అయినా క్షమించకపోవడానికి నువ్వేవంత పెద్ద నేరం చేసావ్! లేకపోతే పద! నేనొచ్చి విషయమంతా వివరంగా చెప్పి, అతన్ని శాంతపరచి, నిన్ను దించొస్తాను!' అంటూ ధైర్యం చెప్పింది బామ్మగారు

శ్యామల హృదయం ఆనందంతో పొంగిపోయింది

'మీరూ మీరూ బానే వుంటారు! పాపం మధ్యన ఆ పిల్లే అన్యాయమైపోయింది! భారంగా అంది బామ్మగారు

అవునమ్మా పిచ్చితల్లి ఎక్కడుందో, ఎన్ని కష్టాలు పడుతోందో అయినవాళ్ళెవరూ లేరు?' కళ్ళొత్తుకుంది కాంతమ్మ

ఇదిగో! కాంతమ్మగారూ! సరయు గు(ంచి మీరేం బాధపడకండి ఆమె సప్త సముద్రాల అవతలున్నా వెతికించి మీ ఎదుట నిల్చోపెడతాను జరిగిందానికి మనస్ఫూర్తిగా క్షమార్పణ కోరుకుంటాను ఆమె వుద్యోగం ఆమెకిప్పిస్తాను! సరేనా?' అంది శ్యామల వుత్సాహంగా

కాంతమ్మ ముఖం వికసించింది భోజనం చేసి, కాసేపు నడుంవాల్చి తిరుగుముఖం పట్టింది

తండ్రి వచ్చాక విషయమంతా వివరంగా చెప్పింది శ్యామల, ఆయనకూడా జరిగిందానికి చాలా సిగ్గుపడ్డాడు తాను వెళ్ళడానికి మొహంచెల్లక తల్లినే దించి రమ్మన్నాడు శ్యామలని

"సారీ" అన్నాననికూడా అల్లుడికి చెప్పమన్నాడు.



## కరిగిన శిల

మూగగా వున్న వంశధార తిరిగి కళకళలాడింది నవ్వుల జల్లులు కురిశాయి

'డేడీ మీరెలాగైనా ప్రయత్నించి ఆ సరయు ఎక్కడున్నదీ తెలుసుకోవాలి! లేకపోతే నాకు మనశ్శాంతి వుండదు అంతేకాదు ఆయన నన్ను పూర్తిగా క్షమించరు కూడా' అప్పటికి అది పదో సారి తండ్రికి శ్యామల చెప్పడం

ఓ! కే శ్యామ్!' ఓకే అంటూ అభయం ఇచ్చేశాడాయన

★ ★ ★ ★ ★ ★

సరయు వనజ దగ్గర్నుంచి సరాసరి మేరీ బసచేసిన హోటల్‌కెళ్ళింది

ఆ సమయంలో మేరి ఎక్కడికో వెళ్ళింది ఆమె కొడుకు జేమ్స్ మాత్రం ఎవరితో నో మాట్లాడుతూ కూర్చున్నాడు

ఆంటీ లేరా? గదంతా కలియజూస్తూ అంది సరయు

"లేదు సరూ! చాలాకాలం తర్వాత ఇండియాకి వచ్చింది కదూ ఓ పట్టాన ఫ్రెండ్స్ ఒదలడంలేదు అసలు ఎవరెక్కడున్నారో తెలుసుకోవడానికే బోల్డు టైమ్‌పట్టింది!" నవ్వుతూ అన్నాడు జేమ్స్

సరయు కూడా నవ్వింది

సరే! మేం వెళ్తాం జేమ్స్! అమ్మగారొస్తే చెప్పి తీసుకురండి! అంటూ ఆ వచ్చినవాళ్ళు వెళ్ళిపోయారు

'అయితే నేనూ వస్తాను జేమ్స్!' కుర్చీలోంచి కదులుతూ అంది సరయు

నువ్వెక్కడికి? ఆశ్చర్యంగా చూశాడు జేమ్స్

'కాస్త షాపింగ్ పనుంది! నువ్వుకూడా రాకూడదూ కాసేపలా తిరిగొద్దాం అంది సరయు

అమ్మ బాబోయ్! నేనా? అమ్మ నన్నీఇండియా ఫ్రెండ్స్ కోసం కాపలా వుంచి మరీ వెళ్ళింది తన ఫ్రెండ్సెవరైనా వచ్చి తిరిగి వెళ్ళిపోతారేమో అని ఆవిడ భయం! ఇంతకీ - నువ్వేం కొనాలి?'

అదీ అదే 'తడబడింది సరయు

పెద్దగా నవ్వాడు జేమ్స్

"మొత్తానికి భారతీయ వనితవనిపించావ్! నిన్ను నేనేం కొరుక్కు తిన్నుగానీ అలా కూర్చుని చక్కగా కబుర్లు చెప్పు!" అన్నాడు

'అబ్బెబ్బె' అదికాదు సిగ్గుపడిపోయింది సరయు

'భలేదానివే! మన చిన్ననాటి స్నేహాన్ని పూర్తిగా మర్చిపోయి నన్నో విలన్ కింద చూస్తున్నావన్న మాట! కానీ సరూ! నేను మాత్రం నిన్ను చిన్నప్పటి సరూలానే భావిస్తున్నాను! కాస్త నిష్ఠూరంగా అన్నాడతను

సారీ జేమ్స్!" మెల్లగా అంది సరయు

సరేలే! దానికేంగానీ ముందు కాస్త మంచి కాఫీ తాగుదాం వుండు!' అంటూ బోయ్‌ని పిల్చాడు జేమ్స్

'ఓ! నువ్వొచ్చేశావా? వెరీ గుడ్! సరయుని వుద్దేశిస్తూ అంది మేరీ లోపలికి అడుగుపెడుతూ

అన్నీ వివరంగా చెప్పింది సరయు

కాఫీలు వచ్చాక తాగుతూ మౌనంగా కూర్చున్నారు ముగ్గురూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు

ఏవిఁటో సరయూ! నిన్ను ఒంటరిదాన్ని చేసిపోయింది మీ అమ్మ! తను నానా ఇబ్బందులు పడుతున్నా మాట వరసకైనా నాకో వుత్తరం ముక్కయినా రాయలేదు పోనీ విషయం ఇది అని నువ్వయినా ఓ వుత్తరం వ్రాయచ్చుగా

అవున్లే! ఎంతైనా మీ మతం వేరు, మా మతంవేరు అందుకే మేం పరాయివాళ్ళంలా కనిపించాం! నిష్ఠూరంగా అంది మేరీ

కంగారుగా చూసింది సరయు

'ఛ! ఛ! అదేం లేదాంటీ! మా బాధలన్నీ ఎక్కడో వున్న మీక్కూడా చెప్పి మిమ్మల్ని కూడా బాధపెట్టడం ఇష్టంలేక రాయలేదే కానీ మీరు పరాయివారని మాత్రం కాదు

మీరే గనక ఆదుకోకపోతే తను ఏనాడో ధూళిలో కలిసి పోయేదాన్నని అమ్మ ఎప్పుడూ అంటూండేది! ఆఖరి క్షణాల్లో కూడా మిమ్మల్ని తల్చుకుంది!'

'మా స్నేహం అలాంటిది! తను మాత్రం మాతో స్నేహం మానుకోమని మీ వాళ్ళు చాలామంది చెప్పారు విందా? ఏవిఁటో! తన మంచితనమే తనని ఆదుకుంది! అంతేకానీ ఇందులో నేను చేసిందేంలేదమ్మా! అంతా ఆ ఏసుప్రభు దయ! కళ్ళు తుడుచుకుంది మేరీ

ఎందుకో మిమ్మల్ని చూస్తుంటే అమ్మే గుర్తొస్తోందాంటీ!' మనస్ఫూర్తిగా అంది సరయు

అందుకే ఇక నుంచి నేనే మీ అమ్మననుకో! అన్ని దిగుళ్ళూ వదిలేసి హాయిగా వుండు అనుకోకుండా వచ్చిన మాకు తమాషాగా కలిసావ్! నీ వీసా గురించి కూడా మాట్లాడాను అందరం కలిసి అక్కడే వుండిపోదాం!'

థాంక్స్ ఆంటీ! కృతజ్ఞతగా అంది సరయు

అన్నట్టు నువ్వీ దేశం వదిలిపోతున్నట్టు మీ స్నేహితులకి చెప్పావా?

'వనజకి మాత్రం చెప్పాను!

వెరీ గుడ్! అన్నట్టు సరయూ! పోనీ ఓ పని చెయ్యకూడదూ?" తమాషాగా అంది మేరీ

'ఏవిఁటాంటీ?'

నువ్వు మా జేమ్స్‌ని పెళ్ళాడెయ్యకూడదూ? హాయిగా మిస్సెస్ జేమ్స్‌లా వెళ్ళిపోవచ్చు!' నవ్వుతూ అన్న ఆవిడ మాటలకి శ్రోతలిద్దరూ త్రుళ్ళిపడ్డారు.

ఏవిటమ్మా సందర్భం లేని మాటలు! కాస్త చిరాగ్గా అన్నాడు జేమ్స్

ఛ! తమాషాకన్నాన్లేరా!' తేలిగ్గా నవ్వేస్తూ అంది మేరీ

అనుకోని ఈ సంఘటనకి సరయు, జేమ్స్ కూడా అదోలా అయిపోయారు ఆ తరువాత ఎవరూ ఫ్రీగా మాట్లాడుకోలేకపోయారు

'అవును తర్వాత మీ మేనమామ ఎప్పుడైనా వచ్చాడా?" మాట మార్చింది మేరీ

'అమ్మ పోయినప్పుడు వచ్చాడాంటీ! నన్ను తనతో రమ్మన్నాడు కానీ నేనే వెళ్ళలేదు!'

'మంచి పని చేసావ్! అంది మేరీ

మర్నాడు ముగ్గురూ వూళ్ళు తిరిగిరావడానికి ప్రయాణమై వెళ్ళిపోయారు

★ ★ ★ ★ ★ ★

శ్యామల బామ్మగారితో సహా ఇల్లు చేరుకొనేసరికి ప్రభాకర్ వూళ్ళో లేడు

'అయ్యగారెక్కడికెళ్ళారు? అంది శ్యామల నౌకరుతో ప్రభాకర్ ఏదో మెడికల్ కాన్ఫరెన్స్‌కెళ్ళాడనీ, మధ్యాహ్నానికల్లా వచ్చేస్తాడనీ చెప్పాడతను

శ్యామల రాక అందర్నీ ఆనందపరిచింది శ్యామలక్కూడా తప్పిపోయిన పాపకి హఠాత్తుగా తన ఇల్లు, తనవారు కనిపించినప్పుడు కలిగే ఆనందమే కలిగింది. వుత్సాహంగా ఇల్లంతా కలియ తిరిగింది

భోజనం చేసి అలా హాస్పిటల్‌కేసి వెళ్ళింది

ఆమె వూహించినట్టు ఎవరూ గుస గుసలు పోలేదు ముఖాలు

## నవీన భేతాళుని సరసమైన పొడుపు కథలు







సింహంమార్కు టపాసులు, మతాబులు ప్రసిద్ధిచెందినవి. లక్షలాది ప్రజలు కోరి, కొని, కాల్చేవి. నిరపాయకరమైనవి. విదేశీ పనితనపు నాణ్యతతో తయారైనవి.

**ది నేషనల్ ఫైర్ వర్క్స్ ఫ్యాక్టరీ**
శివకాశి-626 123,
తపాలా పెట్టె: 13
ఫోన్: 60 & 1205,
తంతి: SPARKLERS




ADWAVE/NFW/3207/TEL

# కరిగిన శిల

చూసుకోలేదు ఆప్యాయంగా పలకరించారు తల్లి పోయినందుకు సానుభూతి వాక్యాలు పలికారు

ఏదేదో వూహించుకొన్న శ్యామల తేలిగ్గా వూపిరి తీసుకుంది కాస్సేపుంది ఇంటికొచ్చేసింది

బామ్మగారు కాంతమ్మతో లోకాభిరామాయణంలోకి దిగితే శ్యామల మాత్రం బెడ్‌రూమ్‌లో పడుకుని ఓ పుస్తకం చేత పట్టుకుని భర్త రాక కోసం ఎదురు చూస్తోంది

వాకిట్లో హారన్ మోగింది

నౌకర్ వీదిలోకి పరిగెత్తాడు బామ్మగారు లేచి నెత్తిన కొంగు సరి చేసుకుని పక్కగా నిల్చుంది కాంతమ్మ సరేసరి శ్యామల గుండె చిత్రంగా స్పందించింది హారన్ వినగానే

ప్రభాకర్ మామూలుగానే పెద్ద పెద్ద అంగలతో లోపలికొచ్చి హాల్లో వున్న బామ్మగార్ని చూసి క్షణం తెల్లబోయాడు వెంటనే తేరుకుని -

ఎప్పుడొచ్చారు? బామ్మగారూ! బావున్నారా?" అన్నాడు అతను కూడా ఆవిణ్ని బామ్మగారు అనే అంటాడు

'ఉదయం వచ్చాం నాయనా!' అందావిడ నవ్వుతూ

వచ్చాం అనగానే తృళ్ళిపడి చూశాడతను

శ్యామలను దించి వెళ్దామని వచ్చాను!' అతని భావాలు కనిపెట్టిన బామ్మగారు మెల్లగా అంది

శ్యామల వచ్చిందనగానే ఎంతో రిలీఫ్ ఫీలయ్యాడు ప్రభాకర్ అయితే సరయు వెళ్ళిందని తెలిసి వచ్చుంటుంది – అనుకున్న వెంటనే అతని మొహం గంభీరంగా అయిపోయింది

ఉహూ!' అన్నాడు నిరాసక్తంగా

తలుపు చాటునించి విన్న శ్యామల మనసు బాదతో మూలిగింది

తప్పదు! తను చేసిన పనికి శిక్ష విధించాల్సిందే! అనుకుంది బాధగా

నిజానికి కాంతమ్మ వాళ్ళింటికొచ్చినట్టు గానీ వివరాలన్నీ ఆమెకి చెప్పినట్టుగానీ ప్రభాకర్‌కి తెలియదు ఆమె ఎక్కడికో బంధువులింటికెళ్తానని చెప్పి రామారావు ఇంటికొచ్చింది




బామ్మగార్ని రెస్ట్ తీసుకోమని చెప్పి భోజనం అయిందనిపించి తన గదిలోకెళ్ళి మంచంమీద వాలి కళ్ళు మూసుకున్నాడు ప్రభాకర్

భోజనం చేస్తున్నంతసేపూ అతని కళ్ళు శ్యామల కోసం వెతికాయి అయితే ఆమె కనిపించలేదు

కళ్ళు మూసుకుని పడుకున్న ప్రభాకర్‌కి ఎవరో ఏడుస్తున్న వెక్కిళ్ళు వినిపించి చటుక్కున కళ్ళు తెరిచాడు

ఎదురుగా కిటికీలోంచి బైటికి చూస్తూ నోట్లో పైట చెంగు కుక్కుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్న శ్యామల కనిపించింది

అతని కళ్ళకి ఆమె తన భార్యగా, ఓ డాక్టరుగా కనిపించలేదు, ఒక పసిపాప తను చేసిన నేరానికి బాధపడుతూ, ఆ నేరాన్ని చెప్పలేక, దాచనూలేక నిస్సహాయంగా రోదిస్తున్నట్టుంది

అతని మనసంతా ఆమె పట్ల జాలితో నిండిపోయింది

శ్యామలా! అన్నాడు దగ్గరగా వచ్చి భుజంమీద చెయ్యి వేస్తూ

అతని స్పర్శ ఆమె దుఃఖాన్ని పెంచింది చివ్వున వెనుతిరిగి అతని ఎదలో మొహం దాచుకుని -

'నన్ను క్షమించండి!' అంది ఏడుస్తూ

'క్షమించడానికేం వుంది గానీ నీ తొందరపాటుకి ఒక అమాయకురాలు బలైపోయింది అసలు జరిగిందేమిటంటే '

ఒద్దు! నాకంతా తెలుసు!' అంటూ తనెలా అపార్థం చేసుకున్నదీ విషయం ఎలా తెలిసిందీ అంతా చెప్పి

ఆమె ఎక్కడున్నా తిరిగి తీసుకొస్తానని డేడీ ప్రామిస్ చేశారు అంది

మీ డేడీకి ఆమెమీద కోపం పోయిందా?'

నా మొహం! ఆయనకేం కోపం లేదు! నేను చెప్పిందాన్ని బట్టి కాస్త తొందరపడ్డారు! మీకు సారీ కూడా చెప్పమన్నారు! అంది శ్యామల అతని ఎదలోకి ఒదిగిపోతూ చాలా రోజుల తర్వాత హాయిగా నవ్వాడు ప్రభాకర్

* * * * * *

ఓ రోజు బజార్లో వనజ కనిపించింది రమణకి సరయు గురించి అడిగితే-

తను అమెరికా వెళ్ళిపోయింది! అంది

వెళ్ళే ముందు మీ దగ్గరికొచ్చిందా?

లేదు రేపు వెళ్ళిపోతున్నాం మనవాళ్ళందరికీ చెప్పు అంటూ ఓ లెటర్ రాసింది తరువాత మేరీగారి బంధువులు కనిపించి వాళ్ళు అమెరికా వెళ్ళిపోయారని చెప్పారు అంది వనజ బాధంగా

అనుకున్నదే అయినా రమణ మొహం వాడిపోయింది

రమణగారూ! ఒక్క మాట చెప్తాను ఏం అనుకోరుగా? అంది అతనికేసి చూస్తూ

ఏమిటి?

మీరు పెళ్ళి చేసుకోండి!

రమణ మాట్లాడలేదు

రత్నాన్ని రాయిగా భ్రమపడి కాలదన్నుకున్న ఓ నిర్భాగ్యురాలి కోసం మీరు జీవితాంతం బాధపడ్డం ఎందుకు? గంభీరంగా అంది వనజ

ఆమెక్కూడా సరయు చేసే అవకతవక పన్లకి చిరాగ్గావుంది రమణ ఆమెని ప్రేమించాడని ఏనాడో అర్థమైందామెకి

రమణ మాట్లాడలేదు

మరి రెండు నిముషాలకి ఆమెకి చెప్పి వెళ్ళిపోయాడు

అతని మనసంతా అల్లకల్లోలంగా వుంది

ఇల్లు చేరినా అతని ఆలోచనలు చెదరలేదు

సరయు ఎంత మొండిది! ప్రాణ స్నేహితురాలిక్కూడా మాట మాత్రం తెలియనీకుండా ఎంత ప్లాన్ తయారు చేసుకుంది! చివరికి జన్మభూమిని కూడా ఒదిలి ఏనాడో ఆదుకున్న ఆ మేరీతో వెళ్ళిపోయింది ఎవరో అనగా విన్నాడతను, సరయు మేరీగారబ్బాయి జేమ్స్‌ని చేసుకుంటుందని

నిజంగా చేసుకుంటుందా? ఏమో!

రమణ నిస్త్రాణగా కూలబడిపోయాడు మంచంమీద

(ఇంకా ఉంది)

# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి. దీన్లో లవంగ నూనె ఉంది! అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పౌచ్‌లో కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బల్సారా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్ టూత్‌పౌడర్





బల్సారా—
టూత్ పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA-B BLS 828 TEL



# సినీ ప్రేక్షకుల మనోరంజని

# 'సినిమారంజని' ఆవిష్కరణోత్సవం

విజయవాడలోని అనుపమ హోటల్లో ఆంధ్ర పత్రిక సంస్థనుంచి వెలువడుతున్న సచిత్ర సినిమా వారపత్రిక "సినిమారంజని" ఆవిష్కరణోత్సవం 1986 అక్టోబరు 6వ తేదీ సాయంత్రం ఆనందోత్సాహాల మధ్య వేడుకగా జరిగింది.

"సినిమారంజని" తొలి సంచికను ఆంధ్ర పత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ సీనియర్ ఏజంటు శ్రీ సి. హెచ్. నారాయణ రావు (ఏలూరు) గారికి అందచేయగా ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర వాణిజ్య మండలి అధ్యక్షుడు శ్రీ కె. జగదీష్ ప్రసాద్, శ్రీ నారాయణరావు వద్ద నుంచి మొదటి కాపీని అందుకొని ఆవిష్కరించారు.

విజయవాడలోని సినిమా రంగానికి చెందిన ప్రముఖులు, ఇతర పెద్దలు "సినిమారంజని" ఆవిష్కరణోత్సవానికి హాజరై అభినందనలు తెలియ చేసారు.

శ్రీ ఈడ్పుగంటి లక్ష్మణరావు ఈ సందర్భంగా ప్రసంగిస్తూ, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు తెలుగువారికి అందించిన తొలిపత్రిక ఆంధ్రపత్రిక సంస్థనుంచి "సినిమా రంజని" వెలువడటం ముదావహమని అన్నారు. ప్రజలను చైతన్యవంతులను చేసేందుకు ఆంధ్ర పత్రికను స్థాపించిన పంతులుగారు నాటకరంగం ఉద్ధరణకు ఎంతో కృషిచేసారని, వ్యాపారం కోసం గాక, కొన్ని విలువలకోసం కట్టుబడిన వ్యక్తి అని గుప్తదాత అని ఆయన శ్లాఘించారు. ఆంధ్ర పత్రిక విలువలను "సినిమా రంజని" కూడా కాపాడగలదన్న ఆశాభావాన్నిఆయన వ్యక్తంచేసారు.

కృష్ణా ఎంటర్‌ప్రయిసెస్ అధిపతి శ్రీ సి. సత్యనారాయణ ప్రసంగిస్తూ, విశిష్టతను సంపాదించుకొన్న ఆంధ్రపత్రిక ప్రచురిస్తున్న సినిమా రంజనికూడా అదే పంథాలో నడువగలదన్న అకాంక్షను వ్యక్తం చేశారు.

సినిమారంజనిని ఆవిష్కరించిన శ్రీ కె. జగదీష్‌ప్రసాద్ అభినందనలు తెలియ చేసారు.

చలనచిత్ర వాణిజ్యమండలి కార్యదర్శి శ్రీ వై. రామచంద్రరావు మాట్లాడుతూ, సినిమా పత్రికా రంగంలో ఇదొక సువర్ణాధ్యాయమని అభివర్ణించారు. ఆంధ్రపత్రిక సినీపత్రికను తీసుకుని రావడం ముదావహమని, సినిమా రంజని కొత్త ఒరవడిని తేగలదన్న ఆకాంక్షను ఆయన వ్యక్తం చేసారు.

ఆంధ్రజ్యోతి సంపాదకుడు శ్రీ నండూరి రామమోహనరావు ప్రసంగిస్తూ ఆంధ్రపత్రిక తనను ఒక జర్నలిస్టుగా తీర్చిదిద్దిందని అన్నారు. సినిమారంజని మిగతా పత్రికలకు గట్టి పోటీ ఇవ్వగలదన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తంచేశారు.

విశాలాంధ్ర సంపాదకుడు శ్రీ సి. రాఘవాచారి ప్రసంగిస్తూ తెలుగువారి సాంస్కృతిక పునరుజ్జీవనంలో ఆంధ్రపత్రిక ప్రముఖపాత్ర వహించిందని అన్నారు. సంఘంలో సినిమా ప్రభావం అనన్యమైనదని, పత్రికా రంగంలో పోటీ వలన ప్రమాణాలు పెరుగుతాయని ఆయన అన్నారు. రాసిలో వాసి కాపాడటం ఆంధ్రపత్రిక వంతు. ఆ ఉన్నత ప్రమాణాలను సినిమారంజని కాపాడగలదన్న ఆశాభావాన్ని ఆయన వెలిబుచ్చారు.

ప్రజాశక్తి సహాయ సంపాదకుడు శ్రీ వి. ఆర్. బొమ్మారెడ్డి ప్రసంగిస్తూ నాగేశ్వరరావు పంతులుగారు పెట్టిన ఒరవడిలో సంస్కార యుతంగా సినిమారంజని చిరకాలం వర్ధిల్లాలని అభినందనలు తెలియజేసారు.

జ్యోతిచిత్ర సంపాదకుడు శ్రీ తుర్లపాటి కుటుంబరావు మాట్లాడుతూ, తెలుగు సినిమా పత్రికా రంగంలో సినిమారంజని నిజంగా సినీ జనరంజని కావాలని శుభాకాంక్షలు తెలియజేసారు.

విజయవాడ ప్రథమ మేయరు శ్రీ టి. వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ పత్రికారంగంలో ఆంధ్రపత్రిక అనుభవం సినిమారంజనికి ఊతం కావాలని, ఆంధ్రపత్రిక సంప్రదాయాలను కొత్త పత్రిక నిలుపుతుందన్న నమ్మకాన్ని వ్యక్తం చేసారు.

ఆంధ్రప్రభ సహాయ సంపాదకుడు శ్రీ పుల్లయ్య ప్రసంగిస్తూ, తెలుగు పత్రికల్లో తొలి పత్రిక ఆంధ్రపత్రిక, కొత్తపత్రిక "సినిమా రంజని"ని తెచ్చినందుకు అభినందనలు తెలియ జేసారు.

న్యూస్ టు డే డైరెక్టరు శ్రీ మోటూరి వెంకటేశ్వరరావు మాట్లాడుతూ, సత్సంప్రదాయాలలో అందరి చేత ఔరానిపించుకొన్న ఆంధ్రపత్రిక సినీపత్రిక "సినిమా రంజని" ఎన్నో విజయాలను సాధించాలని అభినందనలు తెలియజేసారు.

ఉదయం పత్రిక ప్రతినిధి శ్రీ కె. అంకబాబు ప్రసంగిస్తూ, ఆంధ్రపత్రిక విశిష్టస్థానం సినిమారంజని నిలుపుకోవాలని తారక ప్రభు ప్రచురణ సంస్థల తరఫున అభినందనలు తెలిపారు.

డా. యలమంచిలి శివాజీ నమ్మకమైన వార్తలకు, నిజాయితీగల వ్యాఖ్యలకు కట్టుబడి ఉన్న ఆంధ్ర పత్రికనుంచి వెలువడే "సినిమా రంజని" సమాజ విలువలను కాపాడగలిగాలని అన్నారు.

ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణ ప్రసంగిస్తూ, సినిమారంజని అనుకొన్న సమయానికి వెలువరించడంలో సహాయ పడిన వారందరికీ ధన్యవాదాలు తెలియ జేసారు.

ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు శ్రీ పి. వెంకట్రావు స్వాగతం పలికి సభా కార్యక్రమాన్ని నిర్వహించగా, సీనియర్ అడ్వర్‌టయిజ్‌మెంటు మేనేజరు శ్రీ కె. రామచంద్రయ్య వందన సమర్పణ చేశారు.

సినిమారంజని ఆవిష్కరణోత్సవం అనంతరం అతిథులకు విందు జరిగింది.

-[ఒ.వి]

# పాత్రోచితం

మురారి సుబ్బారావు

విశాఖపట్నం వచ్చి మూడేళ్ళవుతోంది.

ఈ మూడేళ్ళలోనూ మూడు విషయాల్లో ఒక స్పష్టమైన అభిప్రాయానికి రాగలిగాను.

మొదటిది విశాఖ బీచ్.

బీచ్‌లో సముద్రం వైపు చూస్తూ వంటరిగా కూర్చునే వ్యక్తి ఎవరికయినా తారస పడితే అది నేనే అని చెబుతారు. ఒంటరిగా బీచ్‌కి వెళ్ళడం అక్కడి వాతావరణంలో నైనా తృప్తి పొందాలను కోవడం, అక్కడి కొచ్చే మనుషుల్ని చూస్తూ ఏదో గొణుక్కోవడం, ఎప్పటికో బుద్ధి పుట్టేక బాగా చీకటి పడే వేళకు ఇంటికి చేరుకోవడం నాకు అలవాటయింది. ఎవరికీ చెప్పుకోలేని విషయాలు సముద్రానికి చెప్పుకుంటాను. అందుకే విశాఖ బీచ్ అంటే నాకు చాలా ఇష్టం.

ఇక రెండో విషయం చెబుతాను.

విశాఖపట్నంలో మేము అద్దెకుండే ఇల్లు రామనగర్‌లో వుంది. కాస్త ఎత్తయిన ప్రదేశంలో వున్న డాబా ఇల్లది. సాయంత్రం చీకటి పడ్డాక బీచ్ నుండి ఇంటికి వచ్చేక డాబా ఎక్కి కూర్చుంటాను. ఆ చీకట్లో మా ఇంటికి దక్షిణంగా కాస్త దూరంగా డాబా గార్డెన్స్‌లోని పద్నాలుగంతస్తుల ఎల్. ఐ. సి. బిల్డింగ్ మీంచి కనబడే ఎర్రటి లైటంటే నాకెంతో ఇష్టం. జీవితాన్ని భీమా చేయమంటూ ఎత్తయిన ఎల్. ఐ. సి. బిల్డింగ్ ఒక ప్రక్క, దానికి ముందు రోడ్డు కివతలగా చేసిన నేరాలకు శిక్ష అనుభవిస్తున్న ఖైదీలతో సెంట్రల్ జైలు, దానికి ముందు మరో రోడ్డు కివతలగా క్రైస్తవుల సిమెట్రీ – ఇవి మూడూ ఇష్టం నాకు.

ఇక మూడవ విషయం.

ప్రభాకరం అంటే నాకు చాలా ఇష్టం.



# పాత్రోచితం

సుమారు ఇరవై ఐదేళ్ళ వయసున్న ప్రభాకరం ఆంధ్రా యూనివర్శిటీలో ఒకానొక సెక్షన్‌లో క్లర్క్ జీవితాన్ని ప్రారంభించాడు

ప్రభాకరాన్ని ఇష్టపడటం వెనుక ఇద్దరున్నారు వాళ్ళు వనజ, కాంతమ్మ

వనజ, కాంతమ్మల గురించి చెబితే చాలు ప్రభాకరం గురించి తెలుస్తుంది

ఏదో పోగొట్టుకున్న వాడి మాదిరి బీచ్‌లో కూర్చుని ఆలోచించేది వనజ, కాంతమ్మల గురించే' అందుకే బీచ్‌కి ఒక్కణ్ణీ వెళుతుంటాను

రామ్‌నగర్‌లోని మా ఇంటి డాబా మీద నుండి కనబడే ఎత్తయిన ఎల్ ఐ సి బిల్డింగ్‌తో వనజను పోలిస్తే, దాని ముందున్న సెంట్రల్ జైలు లాంటిది కాంతమ్మ సెంట్రల్ జైలుకు ముందున్న శ్మశాన వాటిక లాంటివాడు ప్రభాకరం

ఈ రెండు అంశాలకు కారణమైన ప్రభాకరం నాకు నచ్చిన వాడు

ప్రభాకరం గురించి చెప్పాలంటే వనజ కాంతమ్మల గురించి చెబితే చాలు

* * * * *

ఎవరి గురించి చెప్పాలి?

వనజ, కాంతమ్మ పోటీగా నా కళ్ళముందు నిలుచున్నారు

సీనియార్టీ, చాయిస్, రిజర్వేషన్, ఏజ్ రిలాక్సేషన్ లేవు కాబట్టి ఎవరి గురించి చెప్పినా పర్వాలేదు

కాబట్టి కాంతమ్మ గురించి చెబుతాను కాంతమ్మ ప్రభాకరం తల్లి.

కాంతమ్మ ఏభై ఏళ్ళావిడ భర్త పోయాక కొడుకు ప్రభాకరం దగ్గర బ్రతుకు వెళ్ళ బుచ్చుతోంది. నోటి దురుసు మనిషి ప్రతిక్షణం చికాకు పడి పోతున్నట్టు వ్యవహరిస్తుంది ఉన్నదేదో తిని కృష్ణా రామా అంటూ కాలం గడిపితే కాంతమ్మ గురించి చెప్పుకోవడానికి ఏమీ వుండదు

అటువంటి కాంతమ్మ మూడేళ్ల క్రితం ఆంధ్రదేశమంతా అమ్మాయిల కోసం తెగ తిరిగింది ఆ ప్రయత్నంలో తనకు నచ్చిన అమ్మాయిని తెచ్చి కొడుకు ప్రభాకరానికి పెళ్ళి చేసింది ఆ అమ్మాయి. వనజ. అప్పటి నుండి ప్రభాకరం వనజ మొగుడయ్యాడు . ఎంతో కష్టపడి అందరికీ వంకలుపెట్టి ఏరికోరి తెచ్చుకున్న కోడలుపిల్ల కాంతమ్మకు ఏం తీసిపోదు పెళ్ళిచూపుల్లో పైపై మెరుగులు, లాంఛనాలు తప్ప అమ్మాయి మనస్తత్వం అఖ్ఖర్లేని అత్తగార్లకు తగ్గ కోడల్లాంటిది వనజ. కాంతమ్మకు, వనజకు ఒక్క క్షణం పడదు. ఏ ఒక్కరూ సర్దుకుపోరు ఫలితం వాళ్ళిద్దరి మధ్యా, అంటే అత్తాకోడళ్ల మధ్యనన్న మాట, చిర్రుబుర్రులు, చీదరింపులు, 'ముక్కు చీదుకోడాలు, కళ్ళు తుడుచుకోడాలు, అత్తరికం, కోడంటికం లాంటి మాటలు, వాదోపవాదాలు, గొడవలు వగైరా, వగైరా ఈ రకంగా ఇద్దరి మధ్య జరిగిన రగడనుకాంతమ్మ ప్రభాకరందగ్గరచేరి ఈ చెవిలో ఏకరువుపెడితే, అదే గొడవను వనజ ప్రభాకరానికి ఆ చెవి దగ్గర చెప్పి ముద్దు ముద్దుగా వగలుపోతుంది, గునుస్తుంది, మెటికలు విరుస్తుంది ఫలితం రెండు చెవుల్లోంచి ఇద్దరు చెప్పిన మాటలు ప్రభాకరం గుండెల్లో దిగబడి ఎవరిని సమర్థించాలో తెలీక, ఎవరిని తప్పు పడితే ఎటు దారితీస్తుందో అర్థంకాక మౌనంగా వుండి పోతాడు ప్రభాకరం ఆ మౌనంలో తననుతానే తిట్టుకుంటాడు ఇటువంటి సందర్భాల్లోని మగవాడిని అశక్తత చూపించడానికి కాబోలు 'వెధవ' అనే తిట్టు పుట్టి వుంటుంది 'నాలాంటి వెధవ ఇంకెవ్వడు వుండడు' అనుకుంటాడు ప్రభాకరం అందుకే ప్రభాకరం అంటేఇష్టం

ఒక మధ్యాహ్నం వేళ -

గదిలో కిటికీ దగ్గర కూర్చుని జడ వేసుకుంటూంది వనజ ఆ సమయాన్న కాంతమ్మ కూడా అదే గదిలో గచ్చుమీద కూర్చుని కొప్పు చుట్టుకుంటోంది ఇద్దరూ ఏవో కబుర్లాడుకుంటూ తలకు నూనె రాసుకుని జడ వేసుకునే కార్యక్రమంలో ఇద్దరికీ ఒకేసారి దువ్వెనఅవసరమైంది ఇంట్లో వున్నది ఒక్కటే దువ్వెన, ఒక్కటే అద్దం

పెద్దదాన్ని కొప్పు ముడి వేసుకోవడం ఎంతో సేపుపట్టదు దువ్వెన ఇవ్వు అన్నది కాంతమ్మ "వు(ం)డండి అత్తగారూ! జడ పాయలుగా విప్పేశాను జడ అల్లుకుని ఇచ్చేస్తాను, ఒక్క నిమిషం అంది వనజ

కాంతమ్మ మాట్లాడలేదు విప్పిన జుట్టు భుజాల మించి పొడుగ్గా పడుతోంది ఏభై ఏళ్ళు వయసయినా జుట్టు నల్లగా నిగనిగలాడుతోంది తన జుట్టును పరిశీలించుకుంటున్న కాంతమ్మ ఎంత సేపటికీ దువ్వెన ఇవ్వకపోయేసరికి వనజ వైపు చూసింది కిటికీ దగ్గర నిలబడి జుట్టు పాయలు కలుపుతూ ఒక కాలు వయ్యారంగా ఆడిస్తూ కూని రాగాలు తీస్తూ జడ వేసుకుంటోంది వనజ వనజనే చూస్తున్న కాంతమ్మకు తన పాత్ర పోషణను వెక్కిరిస్తున్నట్టనిపించింది. 'దువ్వెన ఇవ్వకపోగా కూనిరాగాలు" కూడాను అనుకుంది మనసులో ఆ మాట పైకి అనేసింది కాంతమ్మ ఇంకేముంది? ఇద్దరి మధ్యా యుద్ధం. చివరికి -

"నువ్వు దువ్వెన ఇస్తావా? లేక వాడొచ్చే వరకు ఇలాగే వుండమంటావా?' అన్నది కాంతమ్మ ఇక్కడ "వాడు అంటే ప్రభాకరం

"మీ ఇష్టం మీరలా వుంటేనే నాకిష్టం అంది వనజ.

ఇద్దరికీ మాటా మాటా పెరిగింది

సాయంత్రం ప్రభాకరం ఆఫీసు నుండి వచ్చేసరికి వనజ, కాంతమ్మ మొహాలు ముడుచుక్కూర్చున్నారు ఇద్దర్ని చూస్తూనే యుద్ధం జరిగిందనుకున్నాడు ప్రభాకరం

వనజ గబగబ వచ్చి చూసారా! మీ అమ్మనన్ను ఎంతలేసి మాటలంటున్నారో? ఆవిడ అడిగిన వెంటనే దువ్వెన ఇవ్వలేదట మా పుట్టింటి వాళ్ళందర్ని తిడుతున్నారు'.

# మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
# సూపర్ రిన్‌తో తళతళలాడే
# ఆ తెల్లదనం




**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

AS RIN 99 2720 TL

అంతలో కాంతమ్మ అన్నది. "నాకు ముందుగాదువ్వేన ఇస్తే ఏం? ముసలిదాన్ని ఎంతసేపని జుట్టు విరబోసుకుని కూర్చుని ఉండగలను. దీంతో అన్నీ కష్టాలే. ఇది ఇంట్లో అడుగుపెట్టింది. నాకు బి. పి. వచ్చింది."

ఇలా ప్రభాకరానికి ఇద్దరూ చెరో రకంగా చెప్పారు. ఇలాంటి విషయాలు చెప్పినప్పుడల్లా ఇద్దరితోనూ విడిగా మాట్లాడి రాజీ మార్గాలకు ప్రయత్నించాడు. తల్లికి ఒకటి రెండుసార్లు నచ్చచెప్పాడు. పెళ్లాన్ని కూడా మందలించి చూసాడు. అక్కడకూడా బెడిసికొట్టింది. 'పెళ్లాంచాటు వాజమ్మవి' అన్నది కాంతమ్మ. 'ఇంత వయసొచ్చినా తల్లి చాటు బిడ్డ' అని ఎత్తిపొడిచింది వనజ. ఇప్పుడూ అదే గతి పడుతుంది వాళ్లిద్దరి మధ్యకు వెళితే. అందుకని మౌనంగా వుండిపోయాడు ప్రభాకరం.

ఇక్కడ మరో ముఖ్యమైన విషయం చెప్పాలి. కాంతమ్మకు పెళ్లయిన రోజుల్లో సంగతి. కాంతమ్మ అత్తగారు కాంతమ్మ దగ్గరే వుండేది. ఇప్పుడు కాంతమ్మ వనజ దగ్గరున్నట్టు. ఆ రోజుల్లో కాంతమ్మకూ వాళ్ల అత్తగారికీ మధ్యకూడా 'పవర్ వార్' జరిగేది. ఆ నేపథ్యంలో ప్రభాకరం తండ్రిని తను చెప్పినట్లు వినేలా చేసుకుంది కాంతమ్మ. ఆ రకంగా అత్తగారు అజమాయిషీ చెలాయించకుండా కుక్కిన పేనులా పడి వుండేలా చేయగలిగింది కాంతమ్మ. మొగుడు బ్రతికున్నన్నాళ్లు తన మాట విన్నాడు. ఇప్పుడు అదే

## పాత్రో చితం

రకంగా ప్రభాకరం వనజ మాట వింటే! అమ్మో! ...ఇంకేమయినా వుందా? తను అత్తగారికి పట్టించిన గతి పడుతుంది తనకి. నా బ్రతుకు కూడా కుక్కిన పేనయిపోతుంది. అలా జరగడానికి వీల్లేదు". ఇదీ కాంతమ్మ మనసు.

ఇక వనజ సంగతి. పెళ్లయి కాపురానికొచ్చింది. మొదటి పండక్కి పుట్టింటికి వెళ్లేలోగానే అత్తగారి పద్ధతి గ్రహించింది వనజ. తల్లి నోటికి భయపడి ప్రభాకరం తనకి దూరం అవుతాడేమోనని ఆ రకంగా తన బ్రతుకు 'బుగ్గి' అవుతుందేమోనని భయపడింది వనజ. ఆ క్షణాన ఒక నిర్ణయానికి వచ్చేసింది. అప్పటినుండి భర్తను ఆకట్టుకోవడం మొదలుపెట్టింది. భార్యగా అన్ని రకాలుగాను ప్రయత్నించి ప్రభాకరాన్ని తన వైపుకి తిప్పుకుందుకి ప్రయత్నించింది. "ఈ ప్రపంచం మొత్తంమీద పెళ్లాం మాట వినని వాడు ఒక్కడూ వుండడు. అధవా వున్నా వాడు వచ్చే జన్మలో అట్లకాడగానో, గరిటగానో పుట్టడం ఖాయం. వచ్చే జన్మలో మీరలాగే పుడతారు. అప్పుడు మిమ్మల్నివేడి వేడి పులుసు గిన్నెలో ముంచుతాను' అనేది వనజ.

ఈ సిద్ధాంతాల మధ్య, నిర్ణయాలు, రాద్ధాంతాల మధ్య సంసారం గడిచిపోతోంది. ఒక పిల్లాడు పుట్టుకొచ్చాడు. వాడి పనులు చేయడంలో కూడా కీచులాటలు. పిల్లాడు ఏడుస్తుంటే ఎత్తుకోకుండా తనకు పట్టనట్టుగా వుండిపోయిందని వనజ కాంతమ్మ మీద ప్రభాకరానికి రిపోర్టు చేస్తే పిల్లాడు ఏడుస్తున్నా కూడా పట్టించుకోకుండా పక్కింట్లో కబుర్లాడుతూ కూర్చుందని వనజ మీద కాంతమ్మ పిర్యాదు.

ఇద్దరి మధ్యా ప్రభాకరం పంటికింద వక్కలా నలిగిపోతున్నాడు.

ఒక సినిమాలో ఒక నటుడు రెండు రకాల పాత్రలు వెయ్యవచ్చు. రెండు పాత్రలకీ న్యాయం చేయవచ్చు, చేయలేకపోవచ్చు. ఆ పాత్రధారణలో అనేకమంది సమిష్టి కృషి వుంటుంది. కానీ నిజ జీవితంలో ఒకే చోట ఒక వ్యక్తి రెండు రకాల పాత్ర పోషణ చేయాల్సి వచ్చినప్పుడు సమిష్టి జీవనంలో లోపాలవల్ల ఆ పాత్ర పోషణ దెబ్బతింటుంది. తద్వారా ఆ వ్యక్తి మానసికంగా కృంగిపోతాడు. అప్పుడు మరో రకమైన కీలకమైన పాత్రగా జీవించాల్సి వస్తుంది. ప్రభాకరం బ్రతుకు ఇలాగే వుంది.

వనజ, కాంతమ్మల మధ్య ప్రభాకరం పాత్ర పోషణ అతడికే ఎబ్బెట్టుగా వుంది. ఇద్దరి మాటలు వింటూ ఏం చెయ్యాలో తోచక, ఎవర్ని సమర్థించాలో అర్థంకాక, అనుక్షణం భయంతో బ్రతుకుతున్నాడు ప్రభాకరం. ఆ భయంలోంచి ఒక్కోసారి కోపంపుట్టుకొస్తుంది. ఆగ్రహంతో ఇద్దరిమీద విరుచుకుపడదామనుకుంటాడు. ఆ రకంగా వాళ్లిద్దరూ నోరు మెదపకుండా కూర్చుంటే, తన

## ఈ·వేమన·పద్యాలు




గాలి ఫణికి జేసె కసవుబసికి జేసె
మన్ను నెరకు జేసె మఖవదిలను
పుడమిలో జనులకు బువ్వాట్లు జేసెరా
విశ్వదాభిరామ వినురవేమ.

మాట వింటూ ప్రవర్తిస్తే బాగుణ్ణనుకుంటాడు ప్రభాకరం. కానీ ఓర్పు వహిస్తున్నాడు ఆ సహనాన్ని పరీక్షిస్తున్నారు వనజ, కాంతమ్మ.

ఇదంతా మూడేళ్ల చరిత్ర. నాలుగు రోజుల క్రితం జరిగిన విషయం చూస్తే అయోమయంగా వుంటుంది.

నాలుగు రోజుల క్రితం వనజ బావిలోంచి నీళ్లు తోడుతోంది. బకెట్‌కు కట్టిన తాడు తెగిపోయింది. అప్పటికే చాలాసార్లు ముళ్లు వేసి నీళ్లు తోడటం జరుగుతోంది. ఇప్పుడు తెగిన తాడు ముడివేసినా పట్టువుండదు. అందుకని బజారుకు వెళ్లి కొత్త తాడు తెచ్చింది వనజ. బకెట్‌కు కొత్త తాడు కడుతూ బావి దగ్గర నిలబడ్డది. అప్పుడు కాంతమ్మకూడా బావి దగ్గరకొచ్చింది. ఇద్దరి మధ్యమాటలు మామూలుగా మొదలయి పెద్ద గొడవగా మారింది. అప్పుడు కొత్త తాడు కట్టబోతున్న బకెట్‌ను వనజ చేతిలోంచి లాక్కొని బావిలో పడేసింది కాంతమ్మ. వట్టి బకెట్, పిసరంతయినా తాడు లేదు.

సాయంత్రం ప్రభాకరం ఆఫీసు నుండి రాగానే వనజ, కాంతమ్మ, ప్రభాకరానికి చెరో వైపు 'చేరి' దీనికంతటికీ కారణం నువ్వంటే నువ్వు అని వాదించుకున్నారు. కాస్సేపటికి తుఫాను చల్లబడింది. బావిలోంచి బకెట్ తీసే పని ప్రభాకరం మీద పడింది. నీళ్లు తోడడానికి బకెట్ లేదు. బావిలోంచి బకెట్ తీసే ప్రయత్నం చేసాడు ప్రభాకరం. ఎవర్నో అడిగి గేలం తెచ్చారు. గట్టి తాడు కట్టాడు. బావిలో వేసాడు. అనేక రకాలుగా శ్రమించాడు. బకెట్ గేలానికి చిక్కలేదు. వట్టి బకెట్ గేలానికి చిక్కాలంటే చాలా కష్టం.బకెట్ బావిలో పడి అడుగున బురదలో కూరుకుపోయి వుండవచ్చు. బావిలోకి వంగుని గేలాన్ని తిప్పుతూ బకెట్‌కోసం ప్రయత్నిస్తుంటే చేతులు లాగేస్తున్నాయి. మేడ పట్టేస్తోంది. కాళ్లు తిమ్మిర్లెక్కిపోతున్నాయి. నడుము పడిపోతోంది. చికాకనిపిస్తోంది. ఓపిక తగ్గిపోతోంది. సహనం చచ్చిపోతోంది. దొరకని ఆ బకెట్ కోసం ప్రయత్నించడం వృధా ప్రయాస అనిపిస్తోంది. బావిలో నీళ్లు బురద రంగులోకి మారిపోతున్నాయి. బకెట్ దొరకదు. తర్వాత నీళ్లుకూడా తాగడానికి వీల్లేకుండా బురదనీళ్లయిపోతాయి. బావిలోంచి బకెట్ తీసే ప్రయత్నం విఫలమయింది.

అప్పుడే 'బావిలో పడ్డ బకెట్‌లాంటిది తన బ్రతుకు' అనిపించింది ప్రభాకరానికి. ఏ ఆధారంలేని బకెట్ మాదిరిగా వున్నాడు. ఓర్పుగా, సహనంతో బకెట్ తీయడానికి ఎంతగా శ్రమించాడో వనజ కాంతమ్మల విషయంలో అంత ఓర్పుగానూ మానసికంగా శ్రమించాడు. అయినా ... ఇంకా దోచుకోవాలనే చూస్తున్నారు. సహనం చచ్చిపోతోంది. కోపం ముంచు కొస్తోంది. ఎదురుతిరగాలని పిస్తోంది. కానీ ఆ తిరుగు బాటు ఫలితం మరొక మాదిరిగా మారితే! బావిలో నీళ్లలా బ్రతుకు బురదగా మారుతుంది. కాబట్టి ఈ ఆగ్రహం నుండి, కోపతాపాల నుండి విముక్తుడయి మనోస్థైర్యాన్ని అలవరచుకుంటే బ్రతుకులోని అసంతృప్తి నుండి బయటపడగలుగుతాడు.

ఒక నిశ్చయానికి వచ్చాడు ప్రభాకరం.

బావిలోంచి గేలం తీసి గట్టున పడవేసాడు. ఆ గేలంతో పాటు తన మనసులోని వివిధ భావనల చిక్కు ముడుల్ని కూడా గట్టునపడవేసాడు. ఇంట్లోకి నడిచాడు.

"ఏరా బకెట్‌రాలేదా?" అంది కాంతమ్మ. రాలేదన్నట్లు తలాడించాడు ప్రభాకరం.

"బకెట్ పోయినట్లేనా?" అంది వనజ.

ఆ మాటకు ప్రభాకరం చిన్నగా నవ్వేడు.

"ఎందుకా నవ్వు?" అంది వనజ.

"ఎంత శ్రమించినా చేజేతులా జారవిడుచుకున్నది దొరకడం కష్టం వనజా! అయినవాళ్ల ప్రేమ, ఆప్యాయత లభించనప్పుడు వక్తి తనను తాను ప్రేమించుకుని తనకంటూ ఒక పరిధిని నిర్ణయించుకుంటే ఆ వ్యక్తి జీవిత నాటకరంగం నుండి పారిపోలేడు వనజా! ఒకరి ప్రేమ, అనురాగం కోసం పాకులాడేకన్నా మనో నిబ్బరంతో బ్రతకడం నేర్చుకోవాలి. నేనుఆ నిర్ణయానికే వచ్చాను. బకెట్ బావిలోనే వుండనీ! అది ఏ గేలానికీ చిక్కదు. దాన్ని నన్ను ఇలాగే వుండనీ" అన్నాడు ప్రభాకరం.

ప్రభాకరం మాటలు అర్థంకాక వనజ, కాంతమ్మ మొహాలు చూసుకున్నారు. అలా ఇద్దర్ని చూస్తూ ప్రభాకరం నవ్వుకున్నాడు.

★ ★ ★ ★ ★ ★

అలా నవ్వినందుకే ప్రభాకరం అంటే ఇష్టం.

విశాఖ బీచ్ ఇష్టం.

వనజ, కాంతమ్మ ఇష్టం.

ప్రభాకరం మరీ ఇష్టం.

ఎందుకంటే - నేనే ఆ ప్రభాకరాన్ని. □

సీరియల్

# పావని



సి. విమలాగణేశ్

(గత సంచిక తరువాయి)

ఇంటి ముందు కారు ఆగడం వినిపించి కుతూహలంతో బయటి కొచ్చింది పావని డోర్ తెరచుకొని దిగుతున్న వ్యక్తినిచూచి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది

'రోజీ అంటూ ఒక్కసారిగా వెళ్ళి కౌగలించుకొంది

పావనీ ఏమిటీ యిలా చిక్కిపోయావు యిద్దరి కన్నుల్లోనూ నీళ్ళు, బహుశా ఆనందబాష్పాలు కావచ్చు లోపలికి రాగానే-

రా బాబూ, పాపా" దగ్గరకు తీసికొని ముద్దాడి తాను తెచ్చిన స్వీట్సు యిచ్చింది

రా కూర్చో పావని కుర్చీ చూపింది

మీ ఆయన లేరా?

కాలేజీ కెళ్ళారు వచ్చేస్తారు వుండు కాపీ తెస్తాను వెడుతున్న పావని చేయి పట్టుకొని ఆపుతూ

'వెధవకాపీ యెప్పుడయినా యెక్కడయినా దొరుకుతుంది అయిదేళ్ళ తర్వాత కలుసుకొన్నాం మాట్లాడుకోవలసినవి చాలా వున్నాయి రా ముందుకు వెళ్ళనివ్వలేదు కూర్చోక తప్పలేదు

పావనీ ఏమిటీ యిలా తయారయ్యావు? ఆ అందం కాస్తయినా కనుపించడంలేదు. యేమయిందే ఆ అందం? యెందుకిలా చిక్కిపోయావ్?

పోవే అంతా నీభ్రమ నేనేం మారలేదు

ముఖం అద్దంలో చూసుకో తెలుస్తుంది రోజీ అదోలా అంది అంతలో లోనికి వచ్చిన విజయ్ ఆశ్చర్యంగా-

హలో రోజీ హటాత్తుగా వచ్చావ్, వచ్చేముందు లెటర్ రాస్తానని చెప్పి

అనుకోకుండా బయలుదేరాను ఎలా వున్నారు?

ఫైన్

జరిగిన కథ-6: విజయ్,పావనిలు రిజిస్టర్ మేరేజి చేసుకున్నారు. విజయ్ ట్యూటర్‌గా ఒక కాలేజీలో ఉద్యోగంలో చేరుతాడు రోజీ ఒక హోటల్ ప్రొప్రయిటర్ అయిన మాజీ మినిస్టర్‌కి సెక్రటరిగా చేరింది అత్తెసరు మార్కులతో పాసయిన దినేష్ తండ్రి పలుకుబడితో పోలీసు శాఖలో ఉన్నతోద్యోగంలో చేరాడు మదన్ పూర్తిగా స్మగలింగ్‌లో కూరుకుపోయాడు ఆనందరావు ఒక వేశ్యతో చేయి కలిపి రాత్రి చీకటి వ్యాపారం ప్రారంబించాడు పావనికి కవల పిల్లలు పుట్టారు బాబు పేరు వినోద్, పాప పేరు సునంద విజయ్ తనకు లెక్చరర్ పోస్ట్ రాలేదని కృంగిపోతుంటే భర్తకి ధైర్యం చెపుతుంది పావని కానీ మనసులో ఆమె కుళ్ళి కుళ్ళి ఏడ్చింది రోజీ రెకమెండేషన్‌తో విజయ్‌కి రిజర్వ్‌బాంకులో జాబ్ వచ్చింది

కాఫీ అయినా యిచ్చావా మిత్రుండ్‌కి' భార్యవంక చూస్తూ అన్నాడు

ఎక్కడండీ వచ్చిన దగ్గరనుండి నన్ను కదలనిస్తేనా?

ఏమిటీ మీ ఆయన కాఫీతోనే పంపాలని చూస్తున్నాడు అదేం కుదరదు అన్నీ యిక్కడే తెలుసా?

రా వంటింట్లో కూర్చుని మాట్లాడుకుందాం అంది పావని లేస్తూ "

ఒక పనిచేస్తే విజయ్ చిరునవ్వుతో అన్నాడు

ఏమిటి?

మీరిద్దరూ మాట్లాడుకోండి పాపం చాలా కాలానికి కలిశారు నే వంటచేస్తా"

పర్వాలేదే' ముగ్గురూ నవ్వుకున్నారు

అన్నట్టు విజయ్ ఆర్డర్సు వచ్చాయా?' రోజీ ప్రశ్న

వచ్చాయి అంతా నీదయ ఆర్డరు అందించాడు

ఇందలో నాదయ ఏమిటి విజయ్? వాళ్ళడిగిన క్వాలిపికేషన్‌లు నీకున్నాయి వచ్చింది అంతే'

కాదు కానేకాదు యిదివరలో నా క్వాలిఫికేషన్సుకన్నా తక్కువ జాబ్‌లకే వెళ్ళాను కాని ఫలితం దక్కలేదు యిదంతా నీ చలవే

అలా అనుకోవటం చాలా పొరపాటు

రోజీ నీ గొప్ప నీ వెప్పుడూ ఒప్పుకోవే పావని రోజీ చేయి వదలుతూ అంది

చాల్లే నోరుముయ్యవే

సరేరా వంటచేస్తూ మాట్లాడుకుందాం

అలాగే, విజయ్ ప్రయాణ మెప్పుడు?

రేపు రాత్రి'

మరి ఫేమిలీ?

యిల్లు అదీ చూడొద్దూ? అసలే మద్రాసులో యిల్లు దొరకడం కష్టమని అంటున్నారు"

ఆ భయం నీ కొద్దు నీకు క్వార్టరు యాడ్ చేస్తారు'

నిజంగా"

నిజం ఈవేళే ఫోన్‌చేసి అన్ని యేర్పాట్లు చెయ్యమని చెబుతాను

చాలా థాంక్సు రోజీ నీ సహాయం జన్మలో మర్చిపోను

'అదే వద్దనేది ఆ పావనీ త్వరగా వంట కానీ నే వెళ్ళిపోవాలి

యెక్కడికి? కనీసం పదిరోజులయినా వుండాలి" పావని చిరునవ్వుతో అంది

తప్పకుండా వచ్చివుంటానే నీదగ్గరున్న సంతోషం నాకింకెక్కడా వుండదు కానీ యిప్పుడు కాదు '

'అవేం కుదరవ్

అన్నట్టు చెప్పడం మరిచాను.

నేనింత షడన్‌గా యెందుకొచ్చానో తెలుసా? పావని ముఖంలోకి చూస్తూ అంది రోజీ

నేను రెండు రోజుల్లో అమెరికా వెళ్ళిపోతున్నాను ఓ అమెరికా బృందం యిండియా పర్యటన కొచ్చింది స్కార్ అనే వ్యక్తి నాకు దగ్గరయ్యాడు అతనే యీ యేర్పాటు చేశాడు ఓ సంవత్సరం అక్కడే వుంటాను

"ఏంటిలా సడన్‌గా నిర్ణయం?"

'అలా తిరిగి రావాలనిపించింది, అవకాశమూ వచ్చింది అంతే

"మళ్ళీ వచ్చేస్తావా లేకక్కడే పావని కాస్త భయంగా అంది

'భయపడకు తప్పకుండా వచ్చేస్తా' వంటలో సాయం చేసింది రోజీ.

ఫర్వాలేదే మా రోజీ అన్నీ నేర్చేసుకుంది

'ఏమే నే నాడదాన్ని కాదా?"

"ఛీ పోవే భోజనాలయాయి రోజీ ప్రయాణానికి సిద్ధమయింది.

"రోజీ అంటూ బొట్టుపెట్టి చీరందించింది

ఎందుకే య్యివన్నీ?

నీ యంత డబ్బుగలదాన్ని కాదు యేదో నాశక్తి కొలది

ఆ మాటలే అనొద్దన్నాను ఆప్యాయంగా అందుకొంది

"రోజీ నన్ను మర్చిపోవుగా పావని కన్నీటితో అంది

పావనీ! ప్రపంచంలో నాకున్న ఒకేఒక మంచి స్నేహితురాలివి నువ్వు మనసు విప్పి నీతో యెన్నెన్నో చెప్పాలనీ, ఓదార్పు పొందాలనీ వచ్చాను కానీ యేమీ చెప్పడానికి వీలులేని మూగదాన్నయాను నా జీవితం నీవూహించుకున్నట్లు పూలబాటకాదు ముళ్ళతోట అదొక్కటే చెప్పగలను వస్తా పావనీ' కన్నీరు జలజలా రాలుతుండగా అన్నది రోజీ

రోజీ" ఆప్యాయంగా కౌగలించుకుంది పావని కన్నీటితో నే



## పావని

వస్తాను అంటూ అంతలోనే చిరునవ్వు తెచ్చుకుని కన్నీరు తుడుచుకొంటూ వెళ్ళి కారులో కూర్చుంది రోజీ చేయి వూపుతుండగానే కారు కదిలింది కన్నీరు తుడుచుకుంటూ లోని కడుగుపెట్టింది పావని

* * * *

రోజీవల్లనే వుద్యోగం వూడిపోయి నిలుపుకున్న తరువాత దినేష్‌లో చాలా మార్పు వచ్చిందనే చెప్పాలి ఏ పని చేయాలి ఏది చెయ్యకూడదు అనే తారతమ్యం అతనికి సరిగ్గాఅర్థంకాలేదు తన డిపార్టుమెంట్ తనకు శత్రువులుగా కన్పించారు అందుకేఏ విషయంలోనూ శ్రద్ధ వహించటంలేదు

అనుకోని విధంగా రైడింగ్ జరిగింది ఆరైడింగ్‌లో వ్యభిచారం చేసినందుకుగాను నలుగురమ్మాయిలూ, చేయించినందుకుగానూ ఆనందరావూ పట్టుబడి పోలీసు స్టేషనుకు తీసుకరాబడ్డారు యిదేమీ తెలియని దినేష్ వుదయం డ్యూటీకి టైం ప్రకారం వచ్చాడు అందరూ దినేష్‌ను చూడగానే గౌరవ సూచకంగా లేచినిలబడ్డారు. యూనిఫారంలో లోనికడుగుబెట్టిన దినేష్‌ను చూడగానే ఆనందరావు నిలువునా కంపించిపోయినాడు కాళ్ళక్రింద అదిరి భూకంపం వచ్చినట్లు అయింది భగవాన్ యేమిటీ పరీక్ష. తన సీటులో కూర్చున్న దినేష్ టేబుల్‌మీది లెటరందుకొని చదివి ఆనందరావన్న పేరు చూడగానే తనతో చదివిన ఆనందరావు జ్ఞాపకానికొచ్చి ఏం చేస్తున్నాడో? ఏం ఉద్యోగమో? ఎప్పుడు నవ్వుతూ నవ్వించే ఆనందరావు ఆనందంగానే వుండియుంటాడు అలా ఆలోచిస్తూనే రోజీ మంచితనం, తనతో కూడా చదివిన వారిపై ఆమెకున్న ఆప్యాయత గుర్తుకురాగా వళ్లంతా జలదరించింది

'రైడింగ్ ఎప్పుడు జరిగింది? యిన్‌స్పెక్టర్ని ప్రశ్నించాడు దినేష్

'రాత్రి రెండు గంటలకు సార్'

ఆనందరావును యెందుకు అరెస్టు చేశారు?'

ఆ గృహాన్ని నిర్వహిస్తున్న సుందరి అనే అమ్మాయికి అండదండలుగా నిలబడి వ్యాపారం నడపటంలో యితని పాత్ర చాలా వున్నది సార్'

'అలాగా?

అతను చూస్తే చదువుకున్న వాడిలా కనిపిస్తున్నాడు యిలాంటి పనులుచేసి బ్రతకటంకన్న అయిదు నిమిషాలు ముక్కు మూసుకుంటే చాలు ఛీ వెధవ బ్రతుకు' గొణుగుతున్నాడు రైటర్ వింటున్న ఆనందరావు గుండెల్లో పెనుతుఫాను యేనాడూ రాని కన్నీరు జలజలా రాలింది ఛీ వెధవబ్రతుకు తనపై తనకే అసహ్యం కలిగింది యింకొక్క క్షణం కూడా తాను బ్రతకకూడదు ఆత్మహత్య చేసుకోవాలి. తనకదే పరిష్కారం.

వాళ్లందర్నీ కోర్టుకు తీసుకువెళ్లడానికి అన్నీ రెడీ అవుతున్నాయి వారితో కూడా సబ్ ఇన్‌స్పెక్టరు రంజిత్ వెళ్లటానికి నిర్ణయమయింది. కటకటాల వెనుకనుండి బయటకు తీసుకుని వచ్చిన ఆనందరావును చూచిన దినేష్ నిజంగా పిచ్చివాడయాడు ఆనందరావు తలవంచుకొని నిలబడ్డాడు తన కళ్ళు తనని మోసం చెయ్యడం లేదుకదా' మరి మరి చూశాడు అనుమానంలేదు అతను నిజంగా తన సహపాఠి ఆనందరావే

'రంజిత్ ఒక్క నిముషం' అంటూ సీటులోనుంచి లేచి తిన్నగా ఆనందరావును సమీపించాడు ఆనంద్ నువ్వు నువ్వు' అతని ముఖంలో యేదో చెప్పలేనిబాధ

'ఆనంద్ మాట్లాడరా నువ్వు నిజంగా

" "

నేను నీ గురించి ఇప్పుడే గొప్పగా వూహించాను కాని కాని నా వూహ యిలా. యిలా తారుమారవుతుందనే నా కలలు కల్లలుగా గాలిమేడలై కూలిపోతాయనీ ఒక్కనాడూ తలచలేదు' దినేష్ కంఠంలో ఏదో మార్పు

దినేష్ అంటూ బోరున యేడ్చాడు ఆనందరావు.

ఎప్పుడూ నవ్వుతూ నవ్వించే ఆనందేనాయిలా జాలిగా యేడుస్తున్నది"

'దినేష్ నన్ను చిత్రహింస చెయ్యకు'

'ఒరేయ్' కన్నీరాపుకుంటూ దినేష్—

"రంజిత్ ఒక్కక్షణం ఆగు' అంటూ గబగబా పై అధికారి గదికెళ్లాడు ఆనందరావు విషయం యెంతో చెప్పాడు గౌరవమయిన కుటుంబమనీ చదువుకున్నవాడనీ, అతని భవిష్యత్‌ను పాడుచేసినట్లవుతుందనీ విన్నవించుకున్నాడు అంతా విన్నపైఅధికారి—

'దినేష్ యిది చట్టం దీనిని ధిక్కరించే అధికారం యెవరికీలేదు తప్పుచేసిన వ్యక్తి శిక్ష అనుభవించక తప్పదు. చివరికి కన్న తలిదండ్రులయినా సరే మన కర్తవ్యం నిర్వహించక తప్పదు'

'సార్ వాడు"

సారీ నేనేం చెయ్యలేను చెయ్యకూడదు"

దినేష్ కడుపు తరుక్కుపోయింది ఆనంద్ ముఖంలోకి చూడలేకపోయాడు.

'బాధపడకు దినేష్ విధి నన్ను ఘోరంగా దెబ్బతీసి అనేక అవమానాలపాలు చేసింది అందులో యిదొకటి కన్నీరు.

ఆనంద్ నాకన్నీ తెలుసురా నిన్నెలా బయటకు తేవాలో కూడ తెలుసు ఒకె రంజిత్ మీరెళ్లండి' కన్నీరు తుడుచుకున్నాడు

ఒకే యూనివర్సిటీలో ఒకే సబ్జక్టుతో ఆనందంగా చదివిన యిద్దరు ఒకరు చట్టాన్ని కాపలికాసే అధికారి, మరొకరు విధి చేతిలో ఘోరంగా ఓడిపోయి దోషిలా బోనులో నిలబడ్డ ముద్దాయి భగవాన్ నువ్వున్నావా? వుంటే యేమిటీ ఘోరం? ఎందుకీ అన్యాయం?

కోర్టులో మేజిస్ట్రేటు ముందు దోషిగా తలవంచుకొని నిలబడ్డాడు ఆనందరావు అంతా విన్న మేజిస్ట్రేట్ అతని ముఖంలోకి అదోలా చూశాడు అంతలో దినేష్ లాయరుతో సహా బెయిల్ యివ్వటానికి వచ్చాడు ఎలాగయితేం బెయిల్‌మీద ఆనందరావు బయటికొచ్చాడు ఆనంద్ ముఖంలో గూడుకట్టుకుంది విషాదమూ ఆవేదనా

'ఆనంద్ రా' టాక్సీలో యెక్కించుకొన్న దినేష్ హోటల్ ముందు ఆపి "రా ఆనంద్ కాఫీ తాగి వెడదాం. యెప్పుడు తిన్నావో యేమో?'

"దినేష్ కన్నీరు కార్చాడు ఆనందరావు.

ఏమిటిరా యిది రా, దిగు దిగాడు యిద్దరూ హోటల్లోకి అడుగుపెట్టారు

'ఆనంద్ నువ్వు తప్పుచేసినట్లు బాధపడతావెందుకు? యిది జీవితం మనం వూహించని అనేక ఎత్తుపల్లాలు యెన్నోవస్తాయి ధైర్యం ముఖ్యం' దినేష్ ఓదార్పుగా అన్నాడు

"దినేష్ నా బ్రతుకు యిలా అవుతుందని"

అదే వద్దన్నా

దినేష్ నేచేసింది తప్పో ఒప్పో అది నువ్వే నిర్ణయించాలి"

"నో యిప్పుడేం వద్దు టిఫిన్ తిను, తర్వాత మాట్లాడుకుందాం" టిఫిన్ అయ్యాక ఇద్దరూ టాక్సీ ఎక్కారు

'నిన్ను యింటి దగ్గర దింపి వెళతాను

నో నే వెళ్ళగలను

'వద్దు నన్నూ రానీ ఆనందరావు యిల్లు వచ్చింది యిద్దరూ దిగారు

"వస్తా ఆనంద్ రేపు వుదయం వస్తాను ధైర్యంగా వుండు

'చాలా థాంక్సు నీ స్నేహం చాలా గొప్పది ఎన్ని జన్మలకయినా మరువలేనిది' దినేష్ చేతులు కండ్లకద్దుకుని ఏడ్చాడు

'ఛా ఏమిటిది? నాడ్యూటీ రేపొస్తా, ప్లీజ్ బాధపడకు టాక్సీ కదిలింది

మరు రోజు ఉదయం సెలవు పెట్టి దినేష్ ఆనందరావు యింటికి బయలుదేరాడు అతని మనసులో అవ్యక్తమయిన ఆరాటం స్కూటర్ వచ్చి ఆనందరావు ఇంటి ముందాగింది ఇంట్లో చాలామంది జనం యెక్కు సందడిని చీల్చుకుంటూ లోపలి నుండి ఏడుపులు హృదయవిదారకంగా విన్పిస్తున్నాయి. ఇదంతా చూడగానే దినేష్ కాళ్లాడలేదు నీరసం ముంచుకొచ్చింది నెమ్మదిగా స్థిమితపడి ఎలాగో లోపలి కడుగుపెట్టగలిగాడు లోపలి దృశ్యం కంటపడగానే మొదలు నరికిన వృక్షంలా కూలిపోయాడు

"ఆనంద్ ఎంత పనిచేశావ్‌రా' అంటూ కుమిలి కుమిలి ఏడ్చాడు. చనిపోయిన ఆనందరావు శవంపై పడి ముసలి తల్లీ, వయసు వచ్చిన ఇద్దరు చెల్లెళ్ళూ గగ్గోలుగా ఏడుస్తున్నారు

"ఆనంద్ నీవిలా చేస్తావని కలలో కూడా అనుకోలేదురా? ఎందుకురా ఇలా చేశావ్? యీ దినేష్ ముఖం చూడకూడదనుకున్నావా?" అతని మాటలు వినగానే ఆనంద్ చెల్లెలు–

"దినేష్‌గారా! ఇదిగోండి మీ పేరుతో ఈ ఉత్తరం రాసిపెట్టాడు" అంటూ అందించింది. వణుకుతున్న చేతుల్తో అందుకున్నాడు.

మరపురాని దినేష్

ఇలా వుత్తరం రాయవలసి వస్తుందని కానీ, ఇంత చిన్న వయసులోనే జీవితంతో రాజీ పడలేక శాశ్వతంగావెళ్ళిపోతాననిగాని కలనైనా వూహించలేదు. ఎప్పుడూ నవ్విస్తూ, నవ్వుతూ జీవితయాత్ర సాగించాలనే నా ధ్యేయం. మరి అది నా దురదృష్టమో విధియో తెలియదుగాని నాలాంటి జాతకం పగవాడికి కూడా వద్దు. తండ్రి పోయి బాధ్యతలు నాపైన బడ్డాయి. అందులో తప్పేంలేదు. ఉద్యోగాన్వేషణలో నే పొందిన కష్టం, అవమానాలు అబ్బా ఏమని చెప్పను! ఎక్కడా విజయాన్ని సాధించలేకపోయాను. కనీసం పదిమంది పిల్లలకు ట్యూషన్ చెప్పయినా పదిరూపాయలు సంపాదించాలనుకున్నాను. కాని అక్కడా నాకెదురు దెబ్బే తగిలింది. కన్నతల్లికీ, రక్తం పంచుకు పుట్టిన చెల్లెళ్ళకూ అధమం అర్థాకలి తీరేలాగయినా అన్నం పెట్టలేని అసమర్థుడినయాను. మరి మంచికో చెడ్డకో అనుకోని విధంగా యీ చీకటి వ్యాపారంలో కూరుకుపోయాను.

నాకు తెలుసు ఇదెంత నీచమయిన పనో! కాని ఏం చెయ్యను? తప్పని పరిస్థితులలో నా ఆశయాలకు సమాధి కట్టినాను. నిన్న జరిగిన ఘటన రీత్యా నేను ఇలా ఆత్మహత్య చేసుకున్నానని అనుకోకు. నేను ప్రపంచం పోయే పోకడలలో రాణించలేనని తెలుసుకున్నాను. పెండ్లి కావలసిన చెల్లెళ్ళు కంటి ముందు జీవచ్ఛవాల్లా తిరుగుతుంటే, కన్నతల్లి అనారోగ్యంతో కుములుతూంటే, భవిష్యత్ కోరలు తెరిచిన కాల నాగులా కనపడుతూ వుంది. ఇక భరించలేక ఇలాంటి నిర్ణయానికొచ్చాను. నేను చేస్తున్నది తప్పనీ పిరికితనమనీ తెలుసు. కానీ తప్పదు. దినేష్ నాకొరకు బాధపడకు. కనీసం నీవల్లనయినా మా కుటుంబానికో దారి దొరికితే నాకదే పదివేలు. నా చెల్లెళ్ళు కొద్దో గొప్పో చదువుకొన్నారు. వారి పాదాలపై వాళ్ళు నిలబడేటట్లు చేయడానికి ప్రయత్నించు. జన్మ జన్మాలకు నీ మేలు మరిచిపోను.

ఇట్లు

ఆనందరావు

ఉత్తరం చివరి వరకూ ఒకే బిగువున చదివిన దినేష్ "ఆనంద్" అంటూ అతని శవంపై పడి పిచ్చివానిలా ఏడ్చాడు. అంతకంటే అతనేం చేయగలడు? స్నేహితుని అంత్యక్రియలన్నీ దగ్గరుండి జరిపించాడు.

★ ★ ★ ★ ★

రోజీ అమెరికా ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి. స్కార్ రోజీని వదలి క్షణం గూడా వుండలేకపోతున్నాడు. రోజీకి కూడా అతనిపై ఎంతో మక్కువ ఏర్పడింది. అతనితో తను జీవితం పంచుకుంటే ... ఛా అతన్ని మోసం చేస్తుందా? తన గత జీవితం? పీడ కలగా మర్చిపోలేదా? ఆమె మనసులో అనేక ఆలోచనలు సముద్రంలోని కెరటాలలా పరుగులు తీస్తున్నాయి. ఎలాంటి నిర్ణయానికీ రాలేకపోతోంది. రోజీ అతనితో అమెరికా వెళ్ళటం తమ ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు.

"రోజీ! తల్లిగా నేనో మాట చెప్పాలనుకుంటున్నాను. నా మాట అంగీకరిస్తావనే నమ్మకంతో నే చెబుతున్నాను. కాదనువుగా?" తల్లి ప్రశ్న.

"చెప్పు మమ్మీ"

"కన్నతల్లి బిడ్డ బాగును కోరుతుందంటావా?"

"ఆఫ్‌కోర్స్! కొందరు కోరకపోవచ్చు".

"నా విషయంలో నీ వుద్దేశ్యం?"

"అంటే?"

"నేను నీ బాగు కోరే తల్లినా? కాదా?"

"చెప్పటం కాస్త కష్టం".

"అంటే" తల్లి కంఠం కాస్త వణికింది.

"అవన్నీ యిప్పుడెందుకు మమ్మీ, విషయం చెప్పు. నాకసలే టైంలేదు. అవతల బోలెడు పనులున్నాయి".

"నువ్వు అమెరికా వెళ్ళడం నాకిష్టంలేదు".

"ఆ విషయం నాకు ముందే తెలుసు. ఏం ఎందుకని?" రోజీ ప్రశ్న.

"రీజన్ చెప్పి తీరాలా?" తల్లి తీవ్రంగా చూచింది.

"అనేగా అర్థం. రీజన్ సరైనదయితే ఆ విషయం గురించి ఆలోచిస్తాను".

"నీకిప్పుడు అమెరికా వెళ్ళవలసిన అవసరం ఏమొచ్చింది?"

"అవసరం వుంటేనే వెళ్ళాలా?"

"ప్రశ్నకు ప్రశ్నే సమాధానం కాదు రోజీ".

"నిజమే!"

"చదువుకో, ఉద్యోగానికో అయితే వెళ్ళవచ్చుకాని".

"అనవసరంగా దేనికంటావ్ అంతేనా?"

"ఔను".

"అయితే విను. కన్నతల్లివి. నా బాగోగులు కోరే తల్లివి. ఔనా?"

"షైనాట్"

"అని పైకి అంటే సరిపోయిందా? అన్నెం పున్నెం ఎరుగని నన్ను ఆ హోటలుకు పంపావు. ఛా ఎన్నో షాషాలు చెప్పడానికే అసహ్యమయిన

## గడుసులోకం

–బాబు






## పావని

పనులెన్నో చేశాను. డబ్బు చూసి మురిసిపోయావు గాని నా గతేమవుతుందో ఆలోచించావా? నా పెండ్లి సంగతి ఏమయినా పట్టించుకున్నావా? నో. లేదు. ఎందుకు తలుస్తావ్. నా సంపాదన పోదూ? నీలా నేను పెళ్ళి చేసుకొని ఆనందంగా బిడ్డల తల్లిని కావాలని వుండదా?"

"....."

"ప్రేమిస్తే పెళ్ళి చేసుకోవద్దనా అంటావ్. మరి స్కార్ విషయంలో ఎందుకంత విముఖత్వం. అతనితో తిరగొద్దని ఎన్నోసార్లు చెప్పావ్. అతను మోసం చేస్తాడని నీ భయమా? కాదు నా సంపాదన మీద తీపి -ఎవరికిష్టమున్నా లేకున్నా ఈ రోజీ ఒక నిర్ణయానికొచ్చిందంటే అలానే చేస్తుంది. నేను అమెరికా వెళ్ళే తీరుతాను. తరువాత యిష్టమయితే ఇండియా తిరిగివస్తాను. లేకపోతే లేదు".

"రోజీ ఏమిటా మాటలు?" కన్నీటితో అంది తల్లి.

"మాటలు కావు మమ్మీ పచ్చి నిజం. నాకు చాలా పనులున్నాయి. అనవసర ప్రసంగంతో నా కాలం చాలా వేస్టు చేశావు. ఇష్టమయితే ఏర్‌పోర్టుకు రా. లేకుంటే మానుకో. వస్తా" వేగంగా వెళ్ళిపోయింది.

"జీసెస్ ఏమిటిది?" అంటూ వాపోయింది తల్లి విక్టోరియా.

★ ★ ★ ★ ★

ఆ రాత్రి పడుకున్నదన్న మాటేగాని పావనికి నిద్ర పట్టలేదు. తెల్లవారితే ఉద్యోగ నిమిత్తం భర్త మద్రాసు వెళ్ళిపోతాడు. తాను ఎన్నాళ్ళనుంచో కలలు కనిన, ఎంతమంది దేవుళ్ళకో మొక్కులిడిన ఫలితంగా మంచి కాలం వచ్చింది ... కాని ఆమె మనసు సంతోషంతో పరవళ్ళు తొక్కటంలేదు. ఏదో చెప్పలేని బాధ, అంతర్గతంగా వేదన. ఏమిటో అవ్యక్తమయిన ఆవేదన.

"పావనీ! ఇంకా నిద్రపోలేదా?" అర్ధరాత్రి మెలకువ వచ్చి అడిగాడు విజయ్.

"ఏమిటో నండి నాకు ఈవేళ నిద్ర రావటంలేదు".

"ఎందుకని?"

"నాకే తెలియదు".

"నాకు తెలుసు. చెప్పనా".

"చెప్పండి".

"పది రోజులపాటు ఈ కౌగిలి విడిచి ఎలా వుండనా అని" అంటూ తన బలమయిన కౌగిలిలో పావన్ని బంధించాడు.

"ఛ! అదేంకాదు".

"మరి ఇంక దేన్ని గురించబ్బా?"

"అదే చెప్పానుగా తెలియటంలేదని" కాసేపు మౌనం.

"పావనీ! యిప్పటివరకూ నానా కష్టాలు పడి నాలుగు వందలతో కాలం గడిపాము. మరి రేపటి నుండి పదిహేను వందలు ... పైగా ఇంటద్దెలేదు. ఏం చేస్తావ్?"

"ఏం చెయ్యాలో మీరే చెప్పండి".

"చెప్పనా?" ఆమె ముంగురులు సరిచేస్తూ అన్నాడు.

"చెప్పండి" అతని వక్షంపై చేతితో రాస్తూ అంది.

"బాబు పేర, పాప పేర చెరో రెండువందలు బ్యాంకులో వేద్దాం. వాళ్ళ చదువులకు పనికివస్తుంది. వాళ్ళను బాగా చదివించి విదేశాలకు పంపాలిగా మరి! నీ పేర ఒక వంద. మిగిలింది నీ యిష్టం".

"బాగున్నాయి మీ వూహలు".

"వూహలు కాదు. జరుగబోయే నిజాలు".

"సరే అలాగే చేద్దాం పడుకోండి".

"ఇప్పుడు నాకూ నిద్ర రావటంలేదు".

"ఏమండీ! నేనో విషయం అడుగుతాను. మీకు కోపం రాదుగా?"

"అదేంలేదు. అడుగు".

"రోజీ మాటలు, చేష్టలు అదో మాదిరిగా వున్నాయి. ముందు మాదిరిగా లేనేలేదు. కారణం ఏమిటంటారు?"

"బాగుంది ప్రశ్న. నాకు మాత్రం ఏం తెలుసు?"

"నాకొకటనిపిస్తుందండి".

"ఏమిటి?"

"ఉదాహరణకు మీరు వెళ్లబోతున్న వుద్యోగమే తీసుకోండి. చాలా పెద్ద సిఫారసుతో సంపాదించింది కదూ?"

"మినిష్టర్ లెవల్లో".

"అదే వాళ్ల లెవల్లో రోజీ ..." కన్నీరు.

"ఆ ... రోజీ" విజయ్ అదోలా చూశాడు.

"ఎందుకు దాని జీవితాన్నిలా బలిచేసుకుంది? కొవ్వొత్తిలా తను కాలిపోతూ అందరికి వెలిగిస్తున్నది. కానీ ... కానీ ... దానికి మిగిలేదేమిటి? మాడి మసి కావటం తప్ప. భగవాన్! దాన్నెందుకిలా చేశావ్?" కన్నీరు కారిపోతోంది.

"ఇక అది పెళ్లిచేసుకోదా? ఇలాగే దాని జీవితాన్ని ఇంకా నరకం చేసుకుంటుందా?" పావని మాటలు అదోలా వింతగా వున్నాయి.

"నరకమని ఎందుకనుకోవాలి."

"కాక స్వర్గమని అనుకోమంటారా? ఇలా శీలాన్ని బలిచేసుకుంటూ, తాగుడూ, ఇంకా ఇంకా ఎన్నో అలవాట్లు దాని చుట్టూ చేరాయి. దాని మాటలనుబట్టి నేను గ్రహించాను. అదే నా మనసులో కుమ్మరి పురుగులా తొలుస్తోందండీ" కన్నీరు ఆగడంలేదు పావనికి.

"రోజీ గురించి చాలా తప్పు అంచనావేశావు. ఆమె మనసు చాలా మంచిది".

"కాదనలేను. దాని మనసూ స్నేహానికదిచ్చే విలువా మీకంటే నాకే బాగా తెలుసు. పవిత్రమైన శీలాన్ని బలిపెట్టి ఆడతనాన్ని పూర్తిగా మరిచిపోయి చివరి కది సాధించేదేమిటి? ఇవాళ ఎవరెవరి కోసం ఎన్నెన్ని తప్పులు చేసిందో రేపు వాళ్లంతా దాన్ని కడతేరుస్తారా? 'ఛీ! అని ముఖాన వుమ్మేస్తారు".

"అదే తప్పు".

"తప్పుకాదండి.పచ్చి నిజం. ఈ సంఘమే అటువంటిది. అంతే!"

"అనవసరమయిన ఆలోచనలతో సతమతమవుతున్నావ్".

"అనవసరం!" చిన్నగా నవ్వింది.

"నాకు నిద్రొస్తోంది".

"పడుకోండి". భర్త నిద్రలో మునిగిపోయినా పావనికి నిద్రరాలేదు. రోజీ రూపమే కళ్ల ముందు తిరుగుతూ వుంది. ఏదో బాధ. ఎందుకో భయం చుట్టుముట్టి నీరసించిపోయింది.

* * * * * * * * *

సాయంత్రం నాలుగు గంటలయింది. విజయ్ మద్రాసు బయలుదేరటానికి మరొక నాలుగుగంటలు మాత్రమే వ్యవధి వుంది. విజయ్ మనసులో సంతోషం నిండుగా తాండవమాడుతూ వుంటే పావని మనసులో దిగులుతో కూడిన విచారం గూడు కట్టుకొనిపోయింది. అంతకుముందెప్పుడూ విజయ్ తన బిడ్డలనంతగా గారాబం చెయ్యలేదు. ఆ రోజు ఇద్దరికీ స్వీట్లూ, బొమ్మలూ తెచ్చి ఇచ్చి వారిదేలోకంగా గడిపాడు.

"నాన్నా యిది బాగుంది అన్నయ్యది బాగా లేదు" పాప అందంగా నవ్వుతూ అంది.

"నా బొమ్మే బాగుంది నీ బొమ్మే బాగోలేదు." బాబు కోపంగా అన్నాడు.

"చెప్పు నాన్నా నువ్వే" అంటూ యిద్దరూ ఒకేసారి అన్నారు. వారి ముద్దు మాటలకు ముచ్చటపడ్డ విజయ్—

"ఇద్దరి బొమ్మలూ బాగానే వున్నయ్. యిలా ఒకరినొకరు యేదో ఒకటి అనుకుంటూ అల్లరి చేయడం, గొడవ పడడం చేయకుండా చక్కగా ఆడుకుంటూ వుండాలి తెలిసిందా" అంటూ యిద్దర్నీ దగ్గరకు తీసికొని ముద్దులాడేడు.

"అలాగయితే అప్పుడు మంచి పాప కదూ నేను." బుంగ మూతి పెట్టి చక్రాల్లా కళ్లు తిప్పుతూ అంది.

"అదేం కాదు నేనే మంచి బాబును."

"అదే అలా కజ్జా లేసుకోకూడదు. మీరిద్దరూ మంచి పిల్లలే. నేను యీ రోజు ఊరెడుతున్నాను. మళ్లీ తొందరలో వచ్చి మిమ్మల్నందర్నీ తీసికెడతాను."

"కూ...... రైల్లోనా మరి అమ్మనో?"

"అందర్నీ. మీరెళ్లి వరాండాలో ఆడుకోండి" యిద్దరినీ ముద్దు పెట్టుకొని బైటకు పంపాడు విజయ్. యిద్దరూ బైట ఆడుకుంటున్నారు. పావని కాఫీ అందించింది.

"కూర్చో పావనీ."

"పని చాలా వుందండి."

"తరువాత తీరిగ్గా చేసుకుందువు గాని కూర్చో" చేయి పట్టుకొని కూర్చో పెట్టాడు. "ఏంటో అదోలా వున్నావ్." ఆమె ముఖం మీది ముంగురులు సరిచేస్తూ భుజం మీద చేయి వేసి తన వైపుకు తిప్పుకున్నాడు.

"ఛీ వదలండి అవతల పిల్లలు."

"యివన్నీ వాళ్లకు తెలియవు అయినా బయట ఆడుకుంటున్నారు. యింద కాఫీ తాగి యివ్వు."

"అబ్బా యింకా పెళ్లయిన కొత్తలోని అలవాట్లు పోలేదు. పెళ్లయి అయిదేళ్లయింది, యిద్దరు పిల్లలున్నారు."

"వుంటే అలవాట్లు మార్చుకోవాలా? నీవు సగం త్రాగి యిచ్చిన కాఫీ కున్న రుచి మరి దేనికీ రాదు."

"నిజంగా!"

"అబ్బా నవ్వకూడదా? ఏమిటా సీరియస్" కాఫీ కప్పందుకుంటూ అన్నాడు.




"ఏమిటో నండీ నా మనసేం బాగా లేదు."

"ఏం యెందుకని నిన్నటి నుండీ యిదే వరస."

"అదే చెబుతూనే వుంటినిగా. యెందుకో నాకే తెలియటం లేదు."

"భలే దానివే ఇంత కాలానికి మనకు మంచి రోజులొచ్చాయి. గతించిన కష్ట కాలానికి వీడ్కోలిచ్చి రాబోయే సుఖ సంతోషాలను ఆహ్వానించక అలా వుండడ మెందుకు? యిన్ని ఏండ్లు గడిచినా నీకు కాస్త మంచి చీరలూ, చిన్నమెత్తు బంగారమూ కొనిపెట్టలేకపోయాను. యిక నా ఆశలూ నీ ఆశలూ తీరే అవకాశం వచ్చింది."

"అలాగా యిక కావలసివన్నీ కొనేస్తారా?"

"ఓ యిక నా దేవిని పువ్వులలో పెట్టి పూజించనూ?"

"అంటే నేను దేవతలా కూర్చోవాలి అంతేనా?"

"అంతే."

"మరి పని పాటలో?"

"అన్నీ పనివాళ్లే."

"నేనేమీ చెయ్యనవసరం లేదన్న మాట?"

"అవును."

"మరయితే....." నవ్వింది.

"యెందుకా నవ్వు నాకు చెప్పకూడదా?"




**ఎస్. కె. ఆర్. – దొనకొండ**

పొడుగు పెరగాలంటే ఏమి చెయ్యాలి?

ఏమీ చెయ్యనక్కర లేదు.

**పి.ఎ. – యాళ్ళూరు**

నా ఎత్తు 5.5 అంగుళములు. నాకు ఇద్దరు కుమారులు. వాళ్ళ వయస్సు 6 సం., 4 సం.లు. వాళ్ళని పెద్దయ్యాక డిఫెన్స్‌లో చేర్చాలనుకుంటున్నాను. వాళ్ళ ఎత్తు నా కంటె 2 అంగుళాలు పెంచే వీలుంటుందా? స్పెషలిస్టుల కెవరికైనా చూపించాలా? ఏవి మందులు వాడాలి?

ఎత్తు పెంచటానికి స్వాభావికంగా మాత్రమే సాధ్యం. మందుల వల్ల జరిగే పని కాదు.

**యస్. ఎమ్. – విలసగ్రామము**

మా వదినకు మొదటి కాన్పుకి సిజేరియన్ జరిగింది. ఇప్పుడు మరల 5వ నెల గర్భిణి. ఈసారి ఆపరేషన్ అవుసరంలేకుండా సుఖప్రసవం అయ్యే అవకాశం వుందా? అలా సుఖప్రసవం జరగటానికి ఇప్పటి నుండి తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమైనా వున్నాయా?

మళ్ళీ ఆపరేషన్ అవసరమా అనేది ఎన్నో కారణాలమీద ఆధారపడి ఉంటుంది. అవసరం అయ్యేదీ లేనిదీ లేడీ డాక్టర్లు పిండ పెరుగుదల, తల్లి తుంటి ఎముకల నిర్మాణము, వయస్సు, ఇతర అవాంతరాలు మొదలయిన వాటిని పరీక్షించి నిర్ణయిస్తారు. తీసుకోవలసిన జాగ్రత్తలంటూ మామూలు ఆహార నియమాలు తప్ప ప్రత్యేకమైనవి లేవు. అప్పుడప్పుడు లేడీ డాక్టర్లు పరీక్షించటం చాలా అవసరం.

**యన్. ఎమ్. – రావిగుంట చెఱువు**

నా వయస్సు 28 సంవత్సరములు. నా ఎడమ చేయి మోచేతి దగ్గర బయటివేపు ఎముక దగ్గర 6 నెలల నుండి నెప్పిగా వున్నది. దీనికి ఏ మందులు వాడాలి?

మీరు ఆర్థోపీడిక్ వైద్యులను కలసి అవసరం అయితే ఎక్స్‌రే తీసి ఫలితాన్ననుసరించి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది. నెప్పి ఏ కారణం వల్ల వచ్చిందీ తెలుసుకోకుండా మందుల వాడకం నిర్ణయించలేము.

**కె. ఆర్. ఆర్. – సిరిపూర్ కాగజ్‌నగర్**

నా వయస్సు 56 సంవత్సరములు. నేను 15 సంవత్సరముల నుండి కడుపు నెప్పితో బాధపడు తున్నాను. డాక్టర్‌కి చూపిస్తే "అమీబియాసిస్" అని మందులు వ్రాసిచ్చారు. "బేరియంమీల్ ఎక్స్‌రే" గూడా తీయించి మందులు వాడాను. ఏమి ప్రయోజనం కనిపించలేదు.

కడుపు నెప్పి రావటానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. అమీబియాసిస్ అని తీర్మానించినప్పుడు పూర్తిగా పోయేదాకా మందులు వాడటం చాలా అవసరం. మలపరీక్ష వల్ల ఈ లక్షణం పూర్తిగా తగ్గిందీ లేనిదీ తెలుస్తుంది. దీర్ఘకాలంగా ఉన్న మీ లక్షణానికి పరీక్ష చేసేగాని మందులు చెప్పటం కష్టం. □

## పావని

"మరి ...: మరి ... యింకేమీ ... నాతో పని మీకు."

"అబ్బ సస్పెన్సులో చంపక వెంటనే చెబుదూ."

"అహ ఏం లేదు, రాత్రిళ్ళు పడక మీద పడుకోవచ్చా? కూడదా అని."

"చంపావు పో దేవిగారు యే శిక్ష విధించినా అనుభవిస్తాను కానీ యీ శిక్ష మాత్రం విధించకు. నే బ్రతకలేను."

"అబ్బా! యింకా యేమిటండీ అన్నీ ముగిసి పోతే."

"వ్వా...ట్ అన్నీ ముగిశాయా? అసలే జీవిత కాలం సగటున చాలా తక్కువ. యింత తక్కువ వ్యవధిలో యెలారా యింత అందాన్ని అనుభవించడం అని నేను బాధ పడుతూంటే ..." ఆమె పెదవులు వేలితో స్పృశిస్తూ అన్నాడు.

"యింకా నాలో అందాలేం మిగల్చ లేదే మీరు."

"అని నువ్వంటే సరిపోదు."

"మరెవరనాలి?"

"నా మనసు" అంటూ పావన్ని కౌగిలిలోకి తీసికొని, "పావనీ నీవు లేకుండా యీ పది రోజులూ యెలా వుండగలనో?"

"మరేం ఫర్వాలేదు. వుండొచ్చు" అంటూ అతని చేతుల్ని బలవంతాన తొలగించింది.

"నన్ను బాధిస్తున్నావ్ పాపం నీకే."

"అలా అనకున్నానంటే పగలూ రాత్రీ బేధం తెలియదు మీకు."

"తెలుసుకోవలసిన అవసరం యేముందో?"

"అలాగా, అయితే ట్రెయిన్ వెళ్ళిపోతుంది."

పావన్నీ, పిల్లలనీ విడిచి వెళ్ళటం ఓ విధంగా విజయ్‌కి చాలా బాధనిపించింది. వెళ్ళి డ్యూటీలో చేరి ఎలాగయినా రెండు రోజుల్లోనే వచ్చి కుటుంబాన్ని తీసుకుపోవాలని నిర్ణయించుకున్నాడు దృఢంగా...

విజయవాడ స్టేషన్ నుంచి రైలు కదిలింది. భారంగా వెళ్ళి కూర్చున్నాడు విజయ్. అది రిజర్వేషన్ కంపార్టుమెంటవటం వల్ల అధికంగా జనం లేరు. బెర్తుపై దిండూ దుప్పటి పరచి ఆలోచనలో పడ్డాడు. మనసు పరిపరి విధాల పరుగులు పెడుతున్నది. లాభం లేదని సూట్‌కేస్ తెరిచి నవల బైటకు తీశాడు. అది అడవి బాపిరాజు గారి "తుఫాన్" పేజీలు తిరగవేస్తున్నాడు. సాహిత్యంలో యిప్పటికీ అప్పటికీ చాలా తేడా కన్పించింది. ఆ నవలలోని యెన్నో విషయాలు ఆశ్చర్యంగా కన్పించాయి, వింతగా తోచాయి. యివన్నీ నిజాలా? అనే సందేహం మనసులో ప్రశ్నగా యెదురయింది. ఏమయినా తనకు తెలియని విషయాలు చాలా వున్నాయి.

"ఎక్స్‌క్యూజ్ మీ యిఫ్ యూ హేవ్ నో అబ్జక్షన్ షల్ ఐ ఆఫ్ ద లైట్."

తనకుచదవాలని ఆసక్తి వున్నా ప్రక్క వారికి ట్రబుల్ యివ్వటం మంచిది కాదని అలాగే నన్నాడు. లైటారిపోయింది. విజయ్‌కి నిద్ర రాలేదు. అతని కన్నుల్లో పావని నిలిచింది. నిజంగా తానెంతటి అదృష్టవంతుడు! డబ్బు యివాళుంటుంది రేపు పోతుంది. అణకువగలిగిన భాగస్వామి దొరకటం పూర్వజన్మ సుకృతమే. అంత చదివింది తనతో సమానంగా. కానీ అలా కన్పించనే కన్పించదు. తన యిష్టానికి ఒక్కసారయినా ఎదురు చెప్పదు. వ్యతిరేకించదు. కన్నీరు కార్చదు. యీ కష్టాలు నేను భరించలేను అని అనలేదు. అబ్బా నిజంగా యెంత వుత్తమురాలో! యికపై పావన్ని దేవతలా ఆరాధించాలి. పిల్లల్ని మంచి కాన్వెంటులో చేర్చాలి. వాళ్ళ భవిష్యత్తుకు మంచి మార్గాలాలోచించాలి. పిల్లల పనులూ, యింటి పనులూ చూడ్డానికి ఒక మనిషిని యేర్పాటు చేయాలి. రోజూ తన దేవిని సాయంత్రమయితే బీచికో, సినిమాకో, షికారుకో తీసికెళ్ళాలి. వూహలపై వూహలు. టైం రెండు కావచ్చింది. ఆ కంపార్టుమెంటులో తను తప్ప మరెవ్వరూ మేలుకొనిలేరు. చిన్నగా నవ్వుకున్నాడు. అంతే! అంతలో ఏదో భయంకరమయిన శబ్దం! చెవులు చిల్లులు పడేటట్లు!! కన్నుమూసి తెరిచేలోగా విజయ్ మెదడు మొద్దుబారి స్థంబించిపోయింది.

(ఇంకా ఉంది)

రూపురంగులనిచ్చే పసుపు బంగరు
యాత్రలకు కారణం ఆయుర్వేద మూలికలే.

# హిమానీ గోల్డ్

## టర్మరిక్ సబ్బు మరియు క్రీమ్.

ఎవరికి తెలియదు చర్మ సౌందర్యాలకు పసుపు ఎంత సహాయ కారిణి అని. కానీ యీ తొందర రోజులలో శనగపిండితో కలిపి ప్రతి దినం ఎవరు వాడతారు... శనగపిండి లేకుండా కేవలం పసుపు మాత్రం కలసి ఉన్న చర్మ సౌందర్య సాధనాలు ఎలా చర్మాన్ని కాపాడగలవు ?

సంవత్సరాల తరువాత యీ సమస్యకు సమాధానంగా కనిపెట్టారు భారత విఖ్యాత రవీంద్ర పురస్కార విజేత శ్రీ శివకాళీ భట్టాచార్యగారు సౌందర్య సాధనాలలో కలిపేందుకు గాను పసుపుతో సహా తులసీ, గోరింట వట్టి వేళ్ళు, చందనం మరియు పద్మకముతో వనమూలికల గుణములు కలిసినట్లయితే చర్మ సౌందర్యాలకు పసుపు ఇస్తుంది ఒక ప్రత్యేకతను. శనగపిండి లేదే అన్న సమస్య మరి లేదు. సంపూర్ణ బంగరు ఛాయలు అలా నిలుస్తాయి.

కాను—ఆయుర్వేదపు యీ అమూల్య అన్వేషణా ఫలితం లభిస్తోంది పూర్తిగా హిమానీ గోల్డ్ టర్మరిక్ సబ్బు లేక హిమానీ గోల్డ్ టర్మరిక్ క్రీమ్‌లో సదా. ఇతే భారత దేశంలో ప్రప్రథమం.

ఇప్పుడు మీ చర్మంలో క్రీమ్ మరియు సబ్బుల యొక్క ఆయుర్వేద గుణం అతి సహజ సౌందర్యాలతో మిళితమై శరీరం బంగరు ఛాయలతో మిరిమిట్లు గొలుస్తోంది.

కాను — అందరు అందాలను రెప్ప వేయకుండా చూస్తారు.

శాస్త్రాలలో వర్ణించబడిన వన ఔషధాల శ్రేష్ఠగుణములు:


పసుపు : ముఖావికిస్తుంది అందాల ఆహ్లాదాలను.


గోరింట : రంసరూపాలను అధిక కాంతివంతం చేస్తుంది.


తులసి : చర్మంపైన మరకలను నిర్మూలిస్తుంది


చందనం : ఆరిన చర్మాలకు అందాల నిస్తుంది.


పద్మకము: చర్మ రోగాలను నిర్మూలించి జీవాణువులను నాశనం చేస్తుంది.


★కొబ్బరినూనె : చర్మానికి కోమలత్వాన్నిచ్చి సహజ సౌందర్యాన్నందిస్తుంది.


★వేపనూనె : జీవాణువులను నష్టపరచి చర్మ రోగాలను నిర్మూలించేందుకు దోహదాన్నిస్తుంది.
★సబ్బులో మాత్రమే.




హిమానీ గోల్డ్ సబ్బు మరియు క్రీమ్

బంగరు సుదినాల సౌందర్యాన్ని తిరిగి తీసుకొస్తోంది

9580A/1TEL

# వాల్మీకి ఆశ్రమం

వాల్మీకి మొదటి పేరు 'ఋక్కుడు.' ఈ మహర్షి భృగు వంశీయుడు. ప్రచేతసుని కుమారుడుగా చెప్పబడుతున్నాడు. (బ్రహ్మ-పుత్రుడు అనే వాదన కూడ ఉంది.) బోయకాంతను వివాహమాడి, దోపిడి దొంగలతో కలిసి మార్గస్థులను కొట్టి, వారి ధన మపహరించి ఆలు బిడ్డలను పోషించేవాడు.

ఒకసారి సప్త మహర్షులను అడ్డగించి వారి కమండలములను లాగుకొనబోగా, వారు "నీ వార్జించిన ధనంతో పాటు నీకు వచ్చు పాపం కూడ నీ ఆలు బిడ్డలు పంచుకొందురా?" అని అడిగారు. వెంటనే వాల్మీకి (ఋక్కుడు) యింటికిపోయి తన భార్యను అడిగాడు. "మమ్మల్ని పోషించటం నీ విధి. అందులోగల పాప పుణ్యాలకు బాధ్యత నీదే! మాకు నిమిత్తంలేదు!" అని ఆమె సమాధాన మిచ్చింది.

భార్య మాటలకు వాల్మీకి విరక్తి చెంది సప్త మహర్షుల వద్దకు వచ్చి తనకు తరుణోపాయం చెప్పవలసిందిగా వేడుకొన్నాడు. వారిచే 'రామనామం' ఉపదేశం పొంది తపస్సు ప్రారంభించాడు. తన శరీరంమీద పుట్టలు కూడ పెరిగి వాల్మీకిగా ఖ్యాతి గాంచాడు.

నారద మహర్షి ద్వార రామాయణ కథ వినిన వాల్మీకి ఒకరోజు భరద్వాజాది శిష్యులతో కలిసి ఆశ్రమం ప్రక్కనేగల నదిలో స్నానం చేసి వస్తుండగా, మార్గంలో క్రౌంచపక్షి మిథునములో ఒకదానిని బోయవాడు చంపుట గాంచి–

మా నిషాద ప్రతిష్ఠాం త్వం
అగమ శ్శాశ్వతీస్సమాః।
యత్క్రౌంచ మిథునాదేకం
అవధీః కామమోహితం॥

అన్న శ్లోకం వాల్మీకి నోట వెలువడింది. ఛందోబద్ధమైన ఆ వచనంలో రామాయణార్థం కూడ స్ఫురించింది. పిమ్మట బ్రహ్మ వచ్చి పుణ్య ప్రదము, మనోరమము అయి శాశ్వతమైన 'రామ కథ'ను రచింపమంటాడు–

కురు రామకథాం పుణ్యాం
శ్లోకపద్ధాం మనోరమామ్।
యావత్ స్థాస్యంతి గిరయః
సరితశ్చ మహీతలే.॥

రామాయణం మొదటగా వాల్మీకి మహర్షి తన శిష్యులయిన కుశలవులకు ఉపదేశించాడు. అశ్వమేధయాగ సమయంలో అయోధ్యా నగరి వీధులలో కుశలవులు–

పరం కవీనా మాధారం
సమాప్తంచ యథాక్రమం।
అభిగీత మిదం గీతం
సర్వ గీతిషుకోవిదౌ॥

అంటూ రామాయణ గానం చేస్తూ వెళుతూ ఉంటే, ప్రజలంతా మైమరచి వెంట నడిచారు. రాజసభలోని శ్రీరాముడు, సింహాసనం నుండి దిగి మరీ విని, కన్నీరు కార్చి, "ఇదంతా నా కథే!" అన్నాడు. కుశలవుల విద్వత్తుకు మహర్షులంతా ప్రశంసించారు.

సీతా మహాసాధ్వి భూమాతలో కలిసి పోయాక, వాల్మీకి మహర్షి కుశలవులను రామున కప్పగించి, తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.



ధ్యాన నిమగ్నుడైన వాల్మీకి మహర్షి

వాల్మీకి ఆశ్రమం



## ఆశ్రమం

వాల్మీకి మహర్షి తపోధార, కవితా ధారగా ప్రవహించి, రామాయణంగ రూపొందింది. ఆయన ఆశ్రమం సాగర్, అలహాబాదు మార్గంలో చిత్రకూటానికి మొగదల (తూర్పున 39 కి. మీ.) 'లాలాపుర్' అనే గ్రామం వద్ద 300 మీ. ఎత్తు గల కొండపై ఉంది.

మొదటి నుండి ఈ ప్రాంతం దొంగలకు, బందిపోటులకు, దారిదోపిడులకు నిలయంగా ఉంది. ఇక్కడ ఒకవైపు తాపసిక ప్రశాంతత, మరోవైపు గుండెదడ పుట్టించేంత భయంకర వాతావరణం చోటు చేసుకున్నాయి.

## వ్యాసకర్త అనుభవాలు

వాల్మీకి ఆశ్రమాన్ని గూర్చి ఈ ప్రాంతం వారిని ఎవరిని అడిగినా "అక్కడ కొండపై చూడటానికేం లేదు!" అని సమాధానమిస్తారు. "ఏమీ లేదా?" అని తిరిగి ప్రశ్నిస్తే "ఏమంత క్షేమకరమైన ప్రాంతంకాదు. అక్కడకు వెళ్ళటం ప్రమాదకరమైన ప్రయత్నం!" అంటారు.

"వాల్మీకి ఆశ్రమం విధిగా దర్శించుకోవాలి!" అన్న మీదట ఒక టూరిస్టు బస్సువారు, కొండ మలుపులో బస్సు ఆపి త్వరగా చూచి క్రిందికి వచ్చేయండి! వెంటనే ఏదో ఒక బస్సు ఆపి వెళ్ళి పొండి! ఇక్కడ ఎక్కువకాలం సంచరిస్తే, ప్రాణానికే ముప్పు కలుగవచ్చు! ఈ మెట్లెక్కి పైకి వెళ్ళండి!" అని చెప్పి బస్సుచార్జీ కూడ తీసికొనకుండ వెళ్ళిపోయారు.

పది మెట్లెక్కేసరికి–



అతులిత బలధాముడైన హనుమంతుడు

అతులిత బలధామం,
స్వర్ణ శైలభదేహం

అని స్ఫురించేట్లు హనుమద్దర్శనం అయింది. మరి పాతిక మెట్లు గడిచేసరికి–

అభయం సర్వభూతేభ్యో,
దదామి ఏ తద్వ్రతం మమ

అభయప్రదానం చేస్తున్నట్లు సీతాలక్ష్మణ సహిత శ్రీరాముడు మందిరంలో ప్రత్యక్షమయ్యాడు.

మరో వంద మెట్లు ఎక్కాక చెమటలు పట్టసాగాయి. అలసట కంటే భయం ఎక్కువగ ఆవరించింది శ్రీరాముడు వనవాస సమయమున లక్ష్మణునితో ఈ ఆశ్రమాన్ని–

మనోజ్ఞోయం గిరి స్సౌమ్య
నానాద్రుమ లతాయుతః ॥
బహుమూల ఫలో రమ్యస్స్వా
జీవః ప్రతిభాతి మే ।
మునయశ్చ మహాత్మానో,
వసన్త్య స్మిన్ శిలోచ్చయే॥

అంటూ వర్ణించాడు. సీతారామ లక్ష్మణులు మహర్షికి ప్రణమిల్లగా, వాల్మీకి ప్రముదితుడై వారిని అర్చించాడు.

ఎన్నో రకాల వృక్షాలు, పొదలు ప్రాకృతికంగ శోభిస్తున్నా, అదొక కీకారణ్యం, ముఖ్యంగా వెదురు పొదలు అల్లుకొని ఉంటాయి. ఎప్పుడు ఏ పొద చాటు నుండి ఏ క్రూరమృగం వస్తుందో, ఏ బందిపోటు వస్తాడో చెప్పలేని స్థితి.

500 మెట్లు ఎక్కాక వెనుదిరిగి పోదామా అనిపిస్తుంది భయం మూలాన. కాని రామనామమే శరణ్యంగా ముందుకు సాగాను. వేయిమెట్లు ఎక్కాక వెడల్పాటి కొండపై పెనవేసుకొని పెరిగిన వృక్షాలు, వాని నల్లుకొనిన వివిధ లతా వితానాలు కన్పిస్తాయి. పెద్ద పెద్ద శిలలు, "వాటి వెనుక ప్రమాదాన్ని కొలిపే జంతువులు లేక బందిపోటు దొంగలు లేరుకదా!" అనే భ్రాంతిని కలుగ చేస్తాయి.

కొండ మధ్యలో శిథిలావస్థలోనున్న, వాల్మీకి ఆశ్రమం ఉంది. భయపడుతూనే మెల్లగ లోనకు వెళ్లాను. ఏవిధమైన ఆదరణకు, అర్చనకు నోచుకోని, ధ్యానంలోనున్న వాల్మీకిమూర్తి దర్శనమయింది. ప్రణమిల్లాను.

పరుగులాంటి నడకతో 'జయము, భయమును, విస్మయము గదురా!' అనుకుంటూ కొండ క్రింద పడ్డాను. "నా కోసమే!" అన్నట్లు అలహాబాదు వెళ్ళే బస్సు వచ్చింది. జీవితంలో ఇదొక అద్భుతమైన అనుభూతి.

## వాల్మీకి ప్రాశస్త్యం

విశ్వసాహిత్యంలో రామాయణానికి వచ్చిన ప్రచారం, మరియే యితర కావ్యానికి రాలేదు. వాల్మీకి మహర్షి 'నారాయణ తత్వాన్ని చరిత్రగ మనకు అందించాడు. రామాయణం ఆధిదైవికం. మహర్షులు దాని మీద ఆధిభౌతిక తత్వాన్ని ఆచ్ఛాదన చేశాడు. 'రామ' శబ్దము గాయత్రీ స్థితము, వేద సంజ్ఞాయుక్తము బీజాక్షర సంయుతమైనది. అందుకే వివిధ ధర్మాలలో కూడ రామకథ వ్యాప్తి చెందింది.

24 త్రేతాయుగాలనాడు రామచరిత్ర సంభవించినట్లు అనేక పురాణాలు చెప్తున్నాయి. త్రేతాయుగంలో 8,72,640 సంవత్సరాల నాడు 'శ్రీరామకథ' జరిగినట్లు ఐతిహాసికుల కథనం. క్రీ. పూ. 8వ శతాబ్దిలో రామాయణం జరిగినట్లు మరికొందరు ఐతిహాసికులు భావిస్తున్నారు.

ఏదైనా మహాసందేశాన్నిచ్చే సమయంలో వ్యాసమహర్షి, ఆ మహా విషయప్రామాణికతను సమర్థిస్తూ 'పురా వాల్మీకినా గీతం' (పూర్వం వాల్మీకి మహర్షి చేత యిదియే చెప్పబడినది.) అని మహాభారత గ్రంథమునందు చాల పర్యాయములు ఉద్ఘోషించి యున్నాడు. కాళిదాస భవభూతులు వాల్మీకిని తమ కవితా గురువుగా భావించారు. కాళిదాసు రఘువంశ ప్రారంభంలో వాల్మీకి ముందు తాను చాల చిన్నవాడుగ చెప్పుకుంటాడు –

మందః కవి యశః ప్రార్థీ
గమిష్యామ్య పహాస్యతామ్!
ప్రాంశు లభ్యే ఫలే లోభాత్
ఉద్బాహురివ వామనః॥

శ్రీ విశ్వనాథవారు తమ 'కల్పవృక్షము'లో –
"ఒక్క వాల్మీకి గాక వేరొక్కడెవడు సుకవి శబ్దవాచ్యుడు?" అంటారు.

ఇట్టి మహనీయుని ఆశ్రమం, ఎటువంటి ఆదరణకు నోచుకోకపోవటం శోచనీయం. ప్రపంచంలోని చాల దేశాలలో ప్రాచీనకవుల స్మారకమందిరాలు, నివాస అవశేషాలు భద్రపరచి, వానిని విహార స్థలాలుగ మార్చారు. విశ్వసాహిత్యంలో ప్రథమ కావ్యం రామాయణం. తద్కర్తయైన వాల్మీకి ఆశ్రమాన్ని ఒక యాత్రాస్థలంగ రూపొందించటం మన కర్తవ్యం.

ఫోటోలు, వ్యాసం : కెప్టెన్ షేక్‌మౌలాలీ



శ్రీరామ మందిరం

# రాకుమారుని నగ్న నృత్యం !

బ్రిటిష రాణిగారి ద్వితీయ కుమారుడు ప్రిన్స్ ఆంద్రూ స్నేహితులంతా కలిసి ఆయన వివాహ సందర్భంగా వో పార్టీ యిచ్చారట. అందులో బాగా తప్పతాగిన ఆ అంద్రూగారు బట్టలు విప్పేసి, దిసమొలతో టేబులుఎక్కి, నృత్యం ఆరంభించారట. అక్కడికి ఆడపోలీసుల వేషంలో ఆయన వదినగారు డయానా, భార్య సారాకూడా వెళ్లారట. పత్రికా విలేఖరులను తప్పించుకోడానికివారు ఆ ప్రదేశం విడిలిన కాస్సేపటికీయనగారు నగ్న నృత్యం ఆరంభించారట–

## కష్టాలలో పడేసిన కోరిక!

న్యూయార్క్‌కు చెందిన ఫ్రాంక్ సెర్పికో అనే వో రిటైరు పోలీసు అధికారి కామక్రీడ మీద కోర్కె పుట్టి ఒక హోటల్లో రూము తీసుకొని, వో అమ్మడును తెచ్చుకున్నాడట. ఆ అమ్మడు తాను కుటుంబ నియంత్రణ ఆపరేషను చేయించుకున్నానని, అందుకు భయపడ పని లేదనీ చెప్పిందట. ఈ ఆఫీసరు కచ్చితంగా ఆమెకు గర్భం రాదని ఆమె చెప్పాక, తన కామ వాంఛ తీర్చుకున్నాడట. ఆ అమ్మడు నెల తప్పిందట. నెల తప్పి తనను గర్భవతిని చేసిన ఆ ఫ్రాంకుగారే తనకు పుట్టబోయే శిశువుకు తండ్రి అనీ, కనుక ఆ శిశువు పోషణ భారం ఆయనదేననీ తనను ఆ ఫ్రాంకు కామక్రీడలో కలిసిన ఆధారాలు కోర్టుకు నివేదించిందట. ఆమె తనకు గర్భం రాదని చెప్పాకే ఆమెతో తాను కలిశానని ఫ్రాంకు వాదించి, నమ్మకద్రోహం అనే చర్య వల్ల




తానామె బిడ్డ ఆలనాపాలనాకు బాధ్యుణ్ని కానని ప్రకటించాడట. ఈ కేసు విచారించిన ఆడ మేజిస్ట్రేటు కనికరించి ఏదో వో నెలసరి ఆదాయం ఆమెకు నువ్వు కలుగజేయి" అన్నదటా ఫ్రాంకుగారిని.




## చెప్పుదెబ్బతిన్న కామాంధుడు!

ఊసిలంపట్టి మల్లపురానికి చెందిన 30 ఏళ్ళ మూకమ్మ అనే వివాహిత తన యింటి తలుపు




వోరవాకిలిగావేసి, లోపల నిద్రపోతోందట. చాలా కాలంగా ఆమె మీద వో కన్నేసి వుంచిన అదే వూరుకు చెందిన చెల్లకణ్ను అనే అతనామె యింటిలోకి ప్రవేసించి, లోపలకు తలుపువేసి, యకాయకి ఆమె మీదపడి, బలాత్కరించ ప్రయత్నించాడట. మూకమ్మ పెద్దగా అరుస్తూ అతన్ని తోసేసి, చేతికి దొరికిన చెప్పుతో వొళ్ళు వాయగొట్టూ తలుపు తీసేసిందట. ఆమె కేకలకు పోగయిన జనం అతన్ని పట్టుకుని, పంచాయితికి నిలబెట్టారట. పంచాయితిలో ఆమె చెప్పుతో కొట్టడాన్ని సమర్థించటంతో చెల్లకణ్ను పార్టీవారు ఆగ్రహంతో తాము సిద్ధంగా తెచ్చుకున్న ఆయుధాలతో తిరగబడ్డారట. ఫలితంగా రెండు పార్టీలలోనూ వో పుంజెడు మంది బాగా గాయపడేసరికి పోలీసులొచ్చి ఆ పని తాము తీసుకున్నారట– శుభం భూయాత్!

## కదిలే పర్వతాలు!

సోవియట్ రష్యాకు చెందిన పామిర్స్ అనే చోట వో రెండు పర్వతాలు గత మూడు వందలఏళ్లలో ఓ అర్థమిటరు జరిగాయట. సోవియట్ భూగోళ విజ్ఞాన నిపుణులు ఆ రెండు పర్వతాల ఉనికిని విశదపరుస్తూ కరటిజింగ్స్ అనే పర్వతం, పీటర్‌ది గ్రేట్ అనే పర్వతాల మధ్యనున్న దూరం వో అర్థమిటరు తగ్గిందని, ఈ పర్వతాల చలనం యిపుడు మరి కొంచెం వేగం పుంజుకున్నదనీ అన్నారట– పర్వతాలు కదులుతాయని మన పురాణాల్చెప్పలా!

## విదేశ పర్యటనలకు రు. 20 కోట్లు!

రాజీవ్‌గాంధీ మొన్న హరారే వెళ్లివచ్చిన ట్రిప్పుతో కలుపుకుని ప్రపంచ దేశాల సందర్శనం అనే విషయంలో జరిపిన పన్నెండు విదేశయానాలలో మొత్తం ఒక లక్షా ఎనభై వేల కిలోమీటర్లు ప్రయాణం చేశారట. ఆయన పరివారం గత 559 రోజులలో 77 రోజులు విదేశాలలో వున్నట్టు లెక్కలు తేలాయట. మాస్కోతో ఆరంభమయిన ఆయన ప్రపంచదేశ పర్యటనలోని పదకొండు వారాలు విదేశాల్లో గడిపి మొత్తం 25 దేశాలు సందర్శించారట. ఈ పర్యటనలకు 20 కోట్ల రూపాయలు ఖర్చయిందట.

## ప్రాణాలు తీసేందుకు అనుమతి!

వళ్లు బాగా కాలిపోయినవారు, ఎముకలు విరిగి, కాళ్లూ, చేతులూ తెగిపోయినవారు, కళ్ళు, నోరు, పడిపోయినవారు బ్రతికి ప్రయోజనం వుండదు గనుక వారిని చంపేందుకు ప్రభుత్వం అనుమతించాలని ఇంగ్లండ్‌లో డాక్టర్ విలియమ్స్ అనే ఆయన **ప్రభుత్వాన్ని కోరారట.**

## హడలి పోయిన అందాల నటి!

అలనాటి బెంగాలీ నటి సుచిత్రాసేన్ కూతురు, ఈనాటి అందాలనటి మూన్‌మూన్‌సేన్‌ను తమ సినిమాలో నటింప చేయాలని నిర్ణయించుకున్న నిర్మాత వేరే గత్యంతరం లేక ఆమె స్టుడియో నుంచి




యింటికి వెళ్తూండగా ఆ కారుని అటకాయించి, వారిమళ్ళించి తీసుకు పోబోయాడట. ఈ సంఘటనకు భయపడిన ఆమె అసలు పాయింటు వినిబ్రతుకుజీవుడా అనుకున్నదట.

## సరికొత్త బొమ్మల సీరియల్






























# కోటయ్య అనుభవం- ఆయన నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు. ఎన్నాళ్ళనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు ...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి. లేదా ఏజెంటును కలవండి.



**న్యూ ఇండియా ఎష్యూరెన్స్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

# అండమానీయుల వింత ఆచారాలు- అలవాట్లు

అండమాన్ దీవుల్లో నాలుగు తెగల ఆదిమ జాతులవారున్నారు. వారు అండమానీయులు, ఓంగిలు, జారవా వారు, సెంటినలు జాతివారు. ఈ నాలుగు జాతుల్లో అందరి కంటె తక్కువ జనాభా గలవారు అండమానీయులు.

ఈ జాతివారి ఆచార వ్యవహారాలూ, సాంప్రదాయాలూ చాలా వింతగా ఉంటాయి. వీరి ఆరాధ్య దైవం ప్రకృతి. సముద్రానికో అధిపతి, ఆకాశానికో అధిపతి- అట్లా ప్రకృతిలోని ఒక్కో భాగానికి, ఒక్కో అధిపతి ఉంటాడని వీరి నమ్మిక, అట్లాగే ఒక్కో రకమైన జబ్బు ఒక్కో రకమైన- శక్తి వలన వస్తుందని అంటారు. అందుకనే ఈ శక్తులంటే వీరికి భయం. అలా అని శక్తుల్ని కొలవటం కానీ,గుళ్లను కట్టడం కానీ లేదు.

"పులుగ" అన్న శక్తిని విపరీతంగా నమ్ముతారు. ఆయనే భగవంతుడనీ, ఆయన ఆజ్ఞానుసారం ఈ సృష్టి అంతా నడుస్తుందనీ అంటారు. ఈ దేవుడు పూర్వం "సాడిల్ పీక్" అన్న పర్వతం మీద నివసించేవాడనీ, ఇప్పుడు స్వర్గంలో ఉన్నాడనీ, ఆయనకు భార్య, కొడుకు, చాలామంది కూతుళ్లు ఉన్నారని, ఆయన తన కొడుకు ద్వారా కూతుళ్లకు సందేశాల్ని పంపిస్తే వారు ఆ సందేశాల్ని కార్య రూపంలో పెడ్తారని వీరి నమ్మిక.

చంద్రుడి భార్య సూర్యుడనీ, నక్షత్రాలు పిల్లలనీ వీరి భావన. దుష్ట శక్తులంటే వీరికి తగని భయం. వీరు ముఖ్యంగా భయపడేది మూడు శక్తులకు. అవి "ఏంచొంగా" (ఆటవిక శక్తి) "జమయిన్" (నీటిలోని దుష్టశక్తి) "నీలా" (జబ్బుల్ని సృష్టించే శక్తి). ఈ దుష్టశక్తులకు నిప్పు అంటే భయమని, వీరు ఎప్పుడూ నిప్పును తమ గుడిసెల్లో ఉంచుకుంటారు.

అండమానీయుల పెళ్లిళ్ల తంతు చాలా తమాషాగా ఉంటుంది. తల్లి తండ్రులే పెళ్లికి అన్ని ఏర్పాట్లు చేస్తారు. ప్రేమ వివాహాలు ఎక్కువ. కానీ ప్రేమికులు ముందుకు రారు. పెళ్లి కొడుకు తాలూకు స్నేహితులు, బంధువులు పెళ్లి నాటి రాత్రి ఆ గ్రామ పెద్ద ఇంటి వద్దకు చేరుకుంటారు. పెళ్లి సమయానికి పెళ్లి కొడుకును పెళ్లి కూతురు దగ్గరకు పొమ్మంటారు. వధువు కొంచెం దూరంలోని మరో గుడిసెలో ఉంటుంది. పెళ్లి కొడుకు సిగ్గును అభినయిస్తాడు. అప్పుడు అతణ్ని బలవంతాన వధువు దగ్గరకు లాక్కొని వెళ్తారు. పెళ్లి కూతురు అప్పుడు మొహాన్ని చేతుల్తో కప్పుకుని ఏడుస్తుంది. పక్కనున్న ఆడపెళ్లివారు ఆ అమ్మాయిని సరిగ్గా కూచోపెట్టి, ముఖాన్ని పైకెత్తి కాగడాని వెలిగించి, పెళ్లి కొడుకుని పెళ్లికూతురు తొడమీద కూర్చోపెడతారు. ఆ గ్రామ పెద్ద వారిద్దరికీ వివాహమైనట్లు ప్రకటిస్తాడు. ఆ తర్వాత ఆ వధూవరుల్ని వారికోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గుడిసెలోకి పంపిస్తారు.

ఆ మర్నాడు పెళ్లికొడుకు తల్లి కానీ, బంధువులు కానీ, మట్టితో రంగులు కలిపి అతని శరీరమంతా పూస్తారు. అది వారికి ఒక రకమైన అలంకరణ. పెళ్లి కూతురికూడా అట్లాగే అలంకరణ చేస్తారు. కొన్ని రోజులు ఇద్దరూ కలిసి మెలిసి తిరగడం ప్రారంభించాక ఒక రోజు ముహూర్తం నిర్ణయించి



అండమానీయుల నాయకుడు 'బీయా'

ఆ రోజు గ్రామంలోని వారంతా ఆ రాత్రి నాట్యం చేసి, విందు జరుపుకుంటారు. ఆ నాట్యంలో వధూవరులు మాత్రం పాల్గొనరు.

మనిషి చనిపోయింతర్వాత వీరు చేసే తతంగం కూడా వింతగా ఉంటుంది. ఎవరైనా మరణిస్తే మరణించిన 18 గంటలలోపు ఆ శవాన్ని పాతి పెడ్తారు. పిల్లలు చనిపోతే వారిని గుడిసెలోనే నిప్పుకు పక్కగా పాతి పెడ్తారు. పెద్ద వారైతే గుడిసె బయట అడవిలో పాతి పెడ్తారు. ఈ పని అయింతర్వాత వారు ఉంటున్న గుడిసెను వదిలేసి రెండు మూడు మైళ్ల దూరంగా మరో గుడిసె కట్టుకుని ఆ గుడిసెలో మూడు నెలలుంటారు. ఆ తర్వాత శవాన్ని పూడ్చిన చోటికి వెళ్లి, గొయ్యిని తవ్వి, అస్థి పంజరాన్ని బయటికి తీసి, దాన్ని పగులగొట్టి, ఆ ఎముకలతో- ముఖ్యంగా పుర్రె ఎముకలతో గొలుసులు తయారు చేసుకొని మెడలో వేసుకుంటారు. ఆ తర్వాత వదిలివేసిన గుడిసె దగ్గరకు వెళ్లి ఏడుస్తారు. ఆ తతంగాన్ని వారు "టి-టో- లహుంగా" అని అంటారు. పాటలు పాడుతూ, డాన్సు చేస్తారు. ఇట్లా కొన్ని గంటలసేపు ఈ కర్మను పాటిస్తారు.

ఎవరైనా పరదేశీయులుకానీ, వారి శత్రువులు కానీ మరణిస్తే ఆ శవాల్ని పాతిపెట్టరు. శవాల్ని సముద్రంలో విసిరి వేస్తారు. ఎందుకంటే వారి ఎముకల్ని వీరు హారాలుగా అలంకరించుకోరు.

మనలాగే వారికి పునర్జన్మపై నమ్మకం ఉన్నది. స్వప్నాలను నమ్ముతారు. కలల్లో జరిగే సంఘటల్ని నమ్మి ఆ ప్రకారం నడుచుకుంటారు. చాలామంది ఆదిమ వాసుల్లాగే వీరు కూడా మూఢాచారాలకు ప్రాధాన్యత ఇస్తారు.

వీరిలో చదువుకున్న వారు తక్కువ. ఇప్పుడిప్పుడే నాగరిక ప్రపంచంలోకి అడుగుపెడుతున్నా పెళ్లి, చావు మొదలైన విషయాలలో ఇప్పటికీ వారి ఆచారాలనే పాటిస్తారు.

—ఎస్. వి. ప్రసాద్



# పంటినొప్పి వచ్చిందంటే గుర్తొచ్చేది భగవంతుడు, లేదంటే లవంగ నూనె.

సందేహం లేదు. పంటి నొప్పి తగ్గించడంలో తరతరాలుగా ఇంటింటా లవంగ నూనె ప్రధాన పాత్ర వహిస్తూనే ఉంది. లవంగం నిజంగా ఒక గొప్ప దినుసు. దీనిలో ఔషధ గుణాలే కాదు, ఆరోగ్యాన్ని చురుగ్గా ఉంచే ఆ తాజాదనాన్నిచ్చే సద్గుణం కూడా ఉంది. ఇందుచేత నిత్య జీవితంలో దీనికెంతో ఆదరణ ఉంది. పాక శాస్త్రంలోనేమి, ఔషధ శాస్త్రంలోనేమి, ఆఖరుకు ప్రామిస్ టూత్‌పేస్టులో కూడా దీని సద్గుణాల వినియోగం జరుగుతూనే ఉంది.

ప్రామిస్ టూత్‌పేస్టు ద్వారా లవంగ నూనెలోని ఔషధ గుణం, మీ పళ్లలో మూల మూలలా చేరి, మీ పళ్ల మొదళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులతో పోరాడుతుంది. తత్ఫలితంగా మీ పళ్లు సదా ఆరోగ్యవంతంగానూ, దృఢంగానూ ఉంటాయి. ఇంకా ప్రామిస్‌లోని ఇతర దినుసులు, మీ పళ్లను మంచి ముత్యాల్లా మెరిసిపోయేలా చేస్తాయి. ప్రామిస్‌తో పళ్లు తోముకున్న తర్వాత మీ పలుకులు సువాసనలు వెదజల్లుతాయి. ఎందుకంటే, నోటి దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూడా ఈ లవంగ నూనె కూల్చి వేస్తుంది, మీ శ్వాసలో తాజాదనం నింపి తెస్తుంది.

ప్రామిస్ టూత్‌పేస్టు, లవంగ నూనె...టూత్‌పేస్టుల ప్రపంచంలో ఇది నిజంగా ఒక అద్భుత మిశ్రమం. దీన్ని మీరు క్రమం తప్పకుండా వాడితే బహుశ: మీకు లవంగ నూనె గుర్తు రాకపోవచ్చు, మీకు దాని అవసరమూ కలగకపోవచ్చు. మీ పళ్లు మెరిసిపోతుంటాయి, మీ శ్వాస సువాసనా భరితంగా ఉంటుంది.




**Promise**



లవంగ నూనెతో అద్భుత సృష్టి - ప్రామిస్ టూత్‌పేస్టు

బల్సారా —
టూత్‌పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA - B BLS 820 TEL

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు సినీ నీలాకాశంలో తన ప్రతిభతో ప్రజల మనసును దోచుకొని చుక్కల్లో చంద్రుని వలె తారాపథానికి దూసుకు పోతున్న సూపర్ రాకెట్ "సుప్రీమ్ స్టార్" చిరంజీవి.

"పునాదిరాళ్ళు" చిత్రం నుండి "చంటబ్బాయ్" చిత్రం వరకు అనేక పాత్రలు ధరించి ఎన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించి మరెందర్నో ఆకట్టుకున్న



చిరంజీవి అభినందనీయుడు.

కోటి రూపాయలతో చారిటబుల్ ట్రస్ట్ నిర్మించి సినీ పరిశ్రమలో కోటికి పడగెత్తిన చిరంజీవి ఇక ముందు "కిరాతకుడు" "నేట" వంటి చిత్రాల్లో నటించ వద్దని ఆయన అభిమానిగా కోరుకుంటున్నాను.

-వి. వి. రమణాచార్యులు,
కార్యదర్శి, చిరంజీవి ఫాన్స్;
శ్రీకాకుళం

* * *

నటన – అందం– చిలిపితనం – అన్న పదాలకు అర్థం ఏర్పడినది మా అందాలతార శ్రీదేవి ద్వారానే. 'పదహారేళ్ల వయసు'–– సినిమా లోని ఆమె నటనకు ముగ్ధురాలినై ఆమె అభిమానినయ్యాను. మా అభిమాన తార ప్రతీ సినిమాను తప్పక చూస్తాను. 'కంచుకాగడా'లో ఒక విప్లవ కారిణిగా – వజ్రాయుధం లోను, పచ్చని కాపురం లోను– ఒక ధనవంతుని బిడ్డగా, తాను మనసిచ్చిన మనిషికి (పచ్చని కాపురంలో) ఒక చిలిపి శ్రీమతిగా ఆమె నటన



అత్యద్భుతం. మొన్న విడుదలయిన 'జయం మనదే' సినిమాలో ఆమె అందంతో పాటు ఆమె నటన కూడా పోటీ పడిందని చెప్పవచ్చు. 'ఖైదీ రుద్రయ్య' ఆమె నటన బావుంది. అయితే శ్రీదేవి అభిమానిగా నా విన్నపమేమంటే – ఆమెను ఆదరించిన ఈ తెలుగు ప్రేక్షకులను మరచి వారికి అన్యాయం చెయ్యక, హిందీ చిత్రాలలో ఆమె నటనకు అందానికి ప్రాధాన్యత ఉన్నప్పటికీ – సినీ పరిశ్రమలో తన అభిమానానికి పాత్రులవుతున్న అభిమానులకు ఆనందాన్ని కలిగించేలా వుండి తన ఇమేజ్ పెంచుకోవాలంటే – మా నటి – తెలుగు యువతి గానే వుండి – పరభాషా ప్రయోగాన్ని చేసి నటించ వద్దని పాటలలో నిస్సెస్‌కి ఆమెకు ప్రాధాన్యత ఉన్నప్పటికీ, కథాబలం వున్న పాత్రలో (ఒక 'న్యాయవాది'గా) చూడాలని – ప్రప్రథమంగా ఉన్నత స్థాయికి చేర్చి ఆదరించిన ఈ తెలుగు ప్రేక్షకులను మరచి పోరని ఆశిస్తూ – ఆమె నటిస్తున్న 'ఒక రాధ – ఇద్దరు కృష్ణులు' రాకకై ఎదురు చూస్తూ ....

-ఎన్. సరోజ, గాంధీనగర్
కాకినాడ

* * *

నా అభిమాన నటి "నట విశారద" ఊర్వశి శారద. మనుషులు మారాలి చిత్రంలో ఆమె ప్రదర్శించిన అపూర్వ నటన నన్ను శారద అభిమానిగా చేసింది. అప్పటి నుండి ఆమె నటించిన ప్రతి చిత్రం తప్పకుండా చూస్తున్నాను. మూడుసార్లు జాతీయ స్థాయిలో "ఊర్వశి" అవార్డు పొందటం శారద



అభిమానిగా నా కెంతో గర్వకారణం.

"స్వయంవరం" (మళయాళం) "నిమజ్జనం" మొదలైన చిత్రాలు జాతీయ స్థాయిలో, అమాయకురాలు (1971) "కాలం మారింది" (1972) "శారద" (1973) "స్వాతి" (1984) రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డులు పొందటం ఎంతో అపూర్వమైన విషయం. అన్ని రకాల పాత్రలు పోషించి("న్యాయం కావాలి"లో లాయర్‌గా, "ప్రతిధ్వని"లో పోలీస్ ఇన్స్‌పెక్టర్‌గా) మెప్పించటం శారద ప్రత్యేకత. శారద అభిమానిగా నేను కోరుకునేది ఏమంటే, ఎక్కువగా కథాబలం వున్న చిత్రాలలో నటించమని.

– యం.డి. నజీర్, ములకలపల్లి
(ఖమ్మం)

* * *

నా అభిమాన నటుడు అరున్నర కోట్ల ఆంధ్రులు నాలుగుసార్లు ఎన్నుకొన్న సూపర్‌స్టార్, తెలుగు చలన చిత్ర సామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించిన మహానటుడు. డేరింగ్, డాషింగ్ హీరో నటశేఖర కృష్ణకున్న లక్షలాది అభిమానుల్లో నేను ఒక్కడినని చెప్పుకోవడానికి గర్విస్తాను.

మా కృష్ణ నిర్మాతల పాలిటి కల్పతరువు, సాటి నటుల ఆత్మబంధువు, బీదల పెన్నిధి, అభిమానుల ఆరాధ్య దైవం, సినీ జీవితంలో కాక నిజ జీవితములో కూడా మహామనిషి.

యావద్భారతానికి గర్వకారణమైన తన పద్మాలయా సంస్థ నుండి "సింహాసనం" వంటి వినూత్న, విశిష్ట, విభిన్న చిత్రాలను నిర్మించి



అంతర్జాతీయ స్థాయిలో నటునిగా, దర్శకునిగా, నిర్మాతగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోవాలని మనసారా కోరుకుంటున్నాను.

అగ్నిపర్వతం, ఖైదీరుద్రయ్య, కృష్ణపరమాత్మ వంటి మంచి ఇతివృత్తం గల చిత్రాలలో మాత్రమే నటించి చిరకాలం వర్ధిల్లాలని ఆశిస్తూ–

– పి. శ్రీనివాస్, చింతగట్టు క్యాంపు,
హన్మకొండ

* * *

"నేటి భారతం" చిత్రం చూసి సుమన్ అభిమానిగా మారాను. సుమన్ నా అభిమాన నటుడే కాదు, అభిమాన అన్నయ్య కూడా. ఈ చెల్లెమ్మకు ఆప్యాయంగా ఉత్తరాలు వ్రాసే మంచి అన్నయ్య కూడా. చిలిపి నవ్వులు చిందించే ఆ ముఖారవిందాన్ని ఎన్నిసార్లు చూసినా విసుగు పుట్టదు. మంచి ఒడ్డు పొడుగుతో, చక్కని హావభావ నటనతో, మధురమయిన డైలాగ్ ఉచ్చారణతో అతి సహజంగా నటించే నటుడు సుమన్. నటనకు



ప్రాధాన్యమున్న పాత్రలలో సుమన్ ఎక్కువగా నటించాలి. పాత్రల విషయంలో జాగ్రత్త వహించి మంచి కథా చిత్రాలలో వెరైటీ పాత్రలు ధరించాలని నా అభిప్రాయం. పరిశ్రమలో మంచిని పెంచుకుని నటుడిగా పరిశ్రమలో ఉన్నత స్థానాన్ని మా సుమన్ పొందాలని నా ఆకాంక్ష.

– వి. సరళ, కాలూరు (చిత్తూరు)



# ఉత్సాహంతో
# ఎంత పనయినా
# చేసే మిమ్మల్ని
# నిరుత్సాహ పర్చాలా
# ఈ పాడు జలుబు?



జలుబు మహా చిరాకు కలిస్తుంది.
మీ ఉత్సాహాన్ని చప్పగా చల్లార్చి వేస్తుంది.
ముక్కు కారడం. తలనొప్పి.
జ్వరం వచ్చినట్లు వుండడం. ఒళ్లు నొప్పులు. ఇవన్నీ చాలవన్నట్లు మధ్య మధ్యలో తుమ్ముల పరంపర.

అన్నిటికంటే చిరాకు కల్గించేదేమిటంటే మీతోపాటు మీ పనికీ ఇబ్బందే.

కాని, ఈ బాధల నుండి తప్పించుకోడానికి మార్గం వుంది ఒకటి. అదే కోల్డరిన్‌లో పూర్తి నమ్మకం.

జలుబు బాధలను తొలగించడానికి ప్రత్యేక ఫార్ములా కల్గినది కోల్డరిన్. ఇది మూడు విధాలుగా పని చేస్తుంది:

కారే ముక్కును శుభ్రం చేస్తుంది
తలనొప్పిని తగ్గిస్తుంది. జలుబుతోపాటు వచ్చే జ్వరాన్ని తగ్గించడానికి సహాయం చేస్తుంది.

ఈ మారు జలుబు మీపై దెబ్బ తీసినపుడు కోల్డరిన్‌తో మీరూ దానిపై ఎదురుదెబ్బ తీయండి.

మీలాంటి ఉత్సాహవంతులు వెధవ జలుబుతో నీరసపడి పోకూడదు మరి.




## కోల్డరిన్

జలుబు-నివారక టాబ్లెట్

ప్యాకెట్‌పైన సూచించినట్లు వాడండి.

CLARION/B/B/13/154 TEL

# సినిమా



"ఉమ్మడి మొగుడు"లో శోభన్‌బాబు, రాధిక

## "అష్టలక్ష్మీ వైభవము"లో పార్వతీ దేవి విచారము

విచార, వినోద, విలాసాలు మానవులకు మాత్రమే 'కాదు, దేవతలకు కూడా సహజమని కొన్ని కొన్ని సంఘటనలు తెల్పుతున్నాయి. కేవలం కొండలు, రాళ్ళు రప్పలు మయమైన కైలాసాన్ని విడిచి పెట్టి, ఒక మహానగరం నిర్మాణం గావించుకుని, అందులో నివసించాలన్న పార్వతీదేవి కోరిక మేరకు అత్యంత వైభవోపేతమైన నగరాన్ని నిర్మించమని మయుడికి ఆజ్ఞాపించాడు పరమశివుడు. మయుడు తన వాస్తు శాస్త్రాన్నంతా సముద్రం పైన పరచినట్టుగా సుందర సుమధుర మంజుల మనోహర విలాసాలతో, బంగారపు ప్రాకారాలతో, నందనోద్యానాలతో నిండిన మహానగరాన్ని సృష్టించి ఇస్తే, దాన్ని కాస్తా మాట తప్పని ఆదిదంపతులు, రావణబ్రహ్మకు ధారాదత్తం చేయవలసిన అగత్యం ఏర్పడింది. ఆ సంఘటన అనంతరం విచారంగా ఉన్న పార్వతి (నళిని)ని చూసి "దేవీ, ఇంకనూ నిన్ను విచారము వీడనంటున్నదా? ఒక్క సారి విశాల హృదయంతో ఆలోచింపుము, దేవీ! మన అవాసస్థానమే శవాలను కాల్చేటి వల్లకాడు కానే కాదు, కోరికలను దహించెడి మనస్సే పరమ పావనమైన స్మశానము కాదా? అదే మన నివాసస్థానము", అన్నాడు మహేశ్వరుడు (జె. ఎల్. శ్రీనివాస్).

చెంతనే ఉన్న ఆదిలక్ష్మి (కె. ఆర్. విజయ)"వదినా! అన్నయ్య మాటల్లోని పరార్ధమును, పరమార్ధమును గుర్తించితివా?" అని నచ్చజెప్పింది.

"సకల భక్తజన హృదయములు మన మందిరములే గదా? మనకు వేరే మందిరములేల?" అన్నాడు శివుడు.

"ఈ విషయమును లోకమునకు చాటనెంచియే ఇంత నాటకమూ ఆడవలసి వచ్చింది. ఇక మనమిరువురమూ క్షీరభవానీ క్షేత్రాధిదేవతలమై భక్త జనాభీష్టములను నెరవేర్చుచూ ముదమందెదము రమ్ము!" అంది ఆదిలక్ష్మి.

"ధన్యురాలను", అంటూ బయలుదేరింది పార్వతి.

భక్తి భావాన్ని అణువణువునా రేకెత్తిస్తూ, ఎన్నో మహత్తరమైన విషయాలను అడుగడుగునా ప్రేరేపించే శ్రీ గణపతి సచ్చిదానంద స్వామిజీ వారిచే విరచితమైన "అష్టలక్ష్మీ వైభవము" చిత్రాన్ని సి. ఎస్. రావు దర్శకత్వంలో వల్లభనేని లక్ష్మీదాసు నిర్మిస్తున్నారు.

## జంధ్యాల దర్శకత్వంలో అమెరికాలో "పడమటి సంధ్యారాగం"

"అమెరికాలోని తెలుగు వారి సంస్కృతికి అద్దంపట్టే చిత్రం", అన్నారు దర్శక రచయిత జంధ్యాల అమెరికాకు వెళ్లేముందు. ఈ చిత్రంలో విజయశాంతి సరసన అమెరికన్ యువకుడు

"మౌన రాగం"లో వె



# సినీ షోలు

_జి.వి.జి.

నాయకుడు. ఈ పాత్రను టామ్ అనే అతను ధరించాడు. నాయిక తండ్రిగా అమెరికాలో స్థిరపడిన తెలుగు ఇంజినీర్ గుమ్మలూరి శాస్త్రి, తల్లిగా ఆశాజ్యోతి, బాబాయ్‌గా అమెరికాలోని ప్రముఖ తెలుగు రంగస్థల నటుడు మీర్ అబ్దుల్లా, ఈయన సతిగా సుధేష్ణ, తండ్రీ కొడుకులుగా శేషగిరిరావు, విజయ్, వాద్య బృందంలో 'డ్రమ్మర్'గా పేర్గాంచిన శివమణి 'బ్లాక్ అమెరికన్'గా, ఇతర పాత్రలలో అమెరికాలో స్థిరనివాస మేర్పరచుకున్న రంగస్థల కళాకారులు పాల్గొన్నారు. వాషింగ్టన్‌లో ఉదయం 9 గంటల నుంచి రాత్రి 9 గంటల వరకు సూర్యకాంతి ఉన్నందు వల్ల రోజుకి 14 గంటల చొప్పున షూట్ చెయ్య గలిగారట. ప్రవాసాంధ్ర చిత్ర పతాకంలో పై చిత్రం షూటింగ్ వాషింగ్టన్‌లోనే కాక డెట్రాయిట్, పిట్స్‌బర్గ్, సెయింట్ లూయిస్ వగైరా ప్రాంతాలలో కూడా సెప్టెంబర్ మొదటి వారంలో చిత్రీకరణ పూర్తి చేసుకుంది. వేటూరి గీతాలు, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం సంగీతం, దివాకర్ ఛాయ, పాణి సంయుక్త దర్శకత్వం, శాస్త్రి సహకార దర్శకత్వం,



"కోనసీమ కుర్రోడు"లో రాళ్ళపల్లి, వై. విజయ

...హన్, రేవతి



యోగానంద్ ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పు, గుమ్మలూరి శాస్త్రి సహకారంతో ప్రముఖ పంపిణీదారుడు జి. సుబ్బారావు నిర్మాత.

## కల్యాణ చక్రవర్తితో సౌభాగ్యలక్ష్మి క్రియేషన్స్ చిత్రం

"సెప్టెంబర్ చివరి వారం నుంచి అక్టోబర్ ఆఖరి వారం వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు కెల్ల రామస్వామి. ఈయన నిర్మిస్తున్న సౌభాగ్యలక్ష్మి క్రియేషన్స్ వారి పై చిత్రంలో కల్యాణ చక్రవర్తి, రమ్య, శుభలేఖ సుధాకర్, రాళ్ళపల్లి, వేలు, ఏలేశ్వరం రంగా, శివాజీ, రాగిణి, శైలజ పాల్గొంటున్నారు. భట్టాచార్య మాటలు, కె. వి. మహదేవన్ స్వరకల్పనలో గోపి, చిరంజీవి గీతాలు రాశారు. పి. లక్ష్మణ్ ఛాయ, హరి శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, శివాల ప్రభాకర్ సంయుక్త దర్శకత్వం, రావూరు నాగేశ్వరరావు సహకార దర్శకత్వం, సత్యకనకరాజు నిర్వహణ, గౌతంరాజు కూర్పుతో కె. రాంబాబు సహనిర్మాత. మౌళి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

## గాయత్రి ఆర్ట్ మూవీస్ తొలి చిత్రం'

రాఘవ కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో జి. వి. ఆర్. రాజు నిర్మించే చిత్రంలో అర్జున్ తొలిసారిగా ద్విపాత్రలు నిర్వహిస్తున్నారు. ఖుష్బూ, రజని నాయికలు. వీరభద్రరావు, ప్రభాకర్, సంయుక్త, మమత ఇతర పాత్రధారులు. పైడిపల్లి రవీంద్రబాబు మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, శివశంకర్ నృత్యాలు, సాహుల్ సాహసాలు, గౌతంరాజు కూర్పు, దిలీప్ సహకార దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

కలిగించాలని ఓ మహత్తర చరిత్రను దైవ భావంతో అందించటం ఈ చిత్ర నిర్మాతలు చేసిన అపూర్వ సాహసం.

మయూరి సుధ ఈ చిత్రానికి నాయిక. తన అచంచల మైన భక్తికి ఎన్నటికీ ముప్పులేదని, ఆ స్వామిని నమ్మిన వారికి మంచి మార్గం తప్పక కనిపిస్తుందని నమ్మిన ఓ అయ్యప్ప భక్తురాలి గాథ. ఏది జరిగినా మన మంచికే అని మనసా వాచా విశ్వసించిన ఓ భక్తుని కథే ఈ చిత్ర కథాంశం.

మయూరి సుధ, జయశ్రీ, అనుపమ, విజయకాంత్, రాజీవ్, రాజశేఖరరెడ్డి, ప్రభు ముఖ్య తారాగణం.

ప్రముఖ దర్శకులు కె. శంకర్ దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రానికి మాటలు– పాటలు: గోపి వ్రాయగా సంగీతం: ఎమ్. ఎస్. విశ్వనాథం సమకూర్చారు. ఎడిటింగ్: నరసింహారావు. లక్ష్మీకాంత్ సమర్పిస్తున్న నీలిమా ఫిలింస్ వారి ఈ చిత్రానికి నిర్మాత వి. వెంకటరావు.

## కె. ఎల్. ఎన్. శాస్త్రి సారథ్యంలో "కదిలింది మహిళాలోకం"

"మహిళలను విశేషంగా ఆకర్షించే ఇతివృత్తం", అన్నారు కె. ఎల్. ఎన్. శాస్త్రి. ఈయన సారథ్యం వహించే అభ్యుదయా ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో రాజేంద్రప్రసాద్, రజని, చంద్రమోహన్, పవిత్ర, నూతన్‌ప్రసాద్, జయంతి, సత్యనారాయణ, సాక్షి రంగారావు, బాలాజీ, రాళ్ళపల్లి, చలపతిరావు, జీవా, సాంబశివరావు, జనార్థన్ నటిస్తున్నారు. కావ్యశ్రీ మాటలు, నరహరి సంగీత దర్శకత్వంలో వేటూరి, గోపి, ఎం. ఆర్. ఎస్. శాస్త్రి పాటలు రాశారు. సలీం నృత్యాలు, కళాధర్ శిల్పంతో జె. సుశీల ప్రొడక్షన్ కంట్రోలర్. ఎం. వి. నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. ఎస్. జ్యోతి నిర్మాత.



"స్వామి అయ్యప్ప దర్శనం" లో సుధ

# సినిమా

## "స్వామి అయ్యప్ప దర్శనము"

ప్రస్తుతం ఆంధ్ర దేశమంతటా దిగ్విజయంగా ప్రదర్శింపబడుతున్న "దేవీపూజ"ను అందించిన లక్ష్మీకాంత్ సమర్పణలో మరో భక్తిరస కుటుంబ కథా చిత్రం నీలిమా ఫిలింస్ వారి "స్వామి అయ్యప్ప దర్శనము" నిర్మాణ కార్యక్రమాలు జరుగుతున్నాయి.

కలియుగ ప్రత్యక్ష దైవంగా కొనియాడబడుతూ బహుళ ప్రజాదరణ పొందిన "అయ్యప్ప స్వామి" కథా వస్తువుగా తయారవుతున్న ఈ చిత్రం హరిహర తనయుని మహిమలను తెల్పుటమేకాక ఆ స్వామి వెలసిన "శబరిమల" క్షేత్రాన్ని అచ్చటి స్థలపురాణ ప్రాశస్త్యాన్ని తెలుపుతూ "స్వామి భక్తులకు" కనుల విందూ, వీనుల విందూ చేస్తూ యాత్రీకులకు కష్టసుఖాలలో మార్గదర్శిగా కూడా నిలిచే విధంగా ఈ చిత్రం నిర్మిత మవుతుంది.

అత్యధిక వ్యయప్రయాసలకోర్చి "పంపానది" "అళుదానది" తీర ప్రాంతాలలో కారడవుల గుండా భక్త బృందంతో కల్సి, అతి నిష్ఠతో నటీనట బృందం సాంకేతిక నిపుణులు బయలుదేరి, మానవముక్తికి మూలమైన "పదునెనిమిది సోపానాల" ముంగిట నిలిచి ఆ దివ్య సుందర రూపుడు స్వామి అయ్యప్పను దర్శించి, ప్రేక్షకులకు ఆ భాగ్యాన్ని

నేను వెయ్యాల్సిన పాత్ర బాగా భక్తి రస ప్రధానం అంటున్నారు కదా– భక్తి అంటే ఏంటి?




సత్యనారాయణ
సమర్పించు
RAMAA FILMS
రమాఫిలింస్
అడవిరాజా
దర్శకత్వం
కె.మురళీమోహనరావు
నిర్మాత
కె.నాగేశ్వరరావు B.Sc.,
Bhaskar




వంశీ ఆర్ట్ థియేటర్స్ వారి 14వ వార్షికోత్సవ సందర్భములో బి.వి. సత్యమూర్తికి కార్టూనిస్ట్ అవార్డును డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావుగారు ఇస్తున్న దృశ్యం. ప్రక్కన శ్రీ వంశీ రామరాజుని కూడా చూడవచ్చు.

## "శివరంజని" సహకారంతో "కళాసాగర్"- తెలుగు చలనచిత్ర పరిశ్రమ మద్రాసులో నిర్వహించే "నాటక సప్తాహం"

"ప్రతిభ ఉన్న కళాకారులకు తగు ప్రోత్సాహమివ్వడమే ఈ "నాటక సప్తాహం" లక్ష్యం. మద్రాసులోని స్వామి శంకరదాస్ ఆడిటోరియంలో నవంబర్ 24 నుంచి 30 వరకు ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేశాం. కాలపరిమితి నాటకానికి రెండు గంటలు, నాటికకు ముప్పావు గంట. మొత్తం 6 నాటకాలు, 12 నాటికలు ప్రదర్శించబడుతాయి. ఈ ఏడు మాత్రం పలు పరిషత్తులలో ఉత్తమ నాటకాలుగా, నాటికలుగా గెలుపొందిన వాటినే ఎంపిక చేస్తాం", అని తెలిపారు అధ్యక్షులు దాసరి నారాయణరావు.

"కళాకారులకు రాను పోను ఖర్చుల నిమిత్తం నాటకానికి రు. 1,500, నాటికకు రు.750 చొప్పున ఇస్తాం. భోజన వసతి సదుపాయాలు మేమే సమకూరుస్తాం. ఉత్తమ నాటకానికి మొదటి బహుమతి ఐదు వేలు, రెండవ బహుమతి రెండు వేలు. ఉత్తమ నాటక రచనకు వెయ్యిన్నూట పదహార్లు. నాటికలలో ప్రథమ బహుమతి రెండున్నర వేలు, ద్వితీయ బహుమతి 1,250, ఉత్తమ నాటిక రచనకు 558 రూపాయల బహుమతులు ఇవ్వబడుతాయి. ఇవికాక జ్యూరీ అవార్డులతో కలుపుకుని నాటకాలకు 15 షీల్డులు, నాటికకు 15 షీల్డులు ఉంటాయి", అని తెలిపారు 'శివరంజని' సహకారంతో కళాసాగర్ - తెలుగు చలనచిత్ర పరిశ్రమ నిర్వహించే నాటక సప్తాహానికి నిర్వాహక ఉపాధ్యక్షులైన మురళీమోహన్.

"ప్రతిరోజూ ఒక నిర్మాత, దర్శకుడు, సినీ ఆర్టిసు ముఖ్య అతిథులుగా విచ్చేస్తారు", అన్నారు గౌరవ కార్యదర్శి ఎం. ఎ. సుభాన్.

ఇటీవల నెల్లూరులో నెఫ్జా నిర్వహించిన అక్కినేని జన్మదినోత్సవ వేడుకలలో ఎక్సైజ్ కమిషనర్ శ్రీ రాజగోపాలనాయుడు నుండి 'మధురగాయని' అవార్డు నందుకుంటున్న కుమారి షమేనాతాజ్. అడిషనల్ ఎస్. పి. శ్రీ కాశీనాథ్ నుండి 'నాట్యరాణి' అవార్డుని అందుకుంటున్న కుమారి వి. భవానిలను. సినీ తారలు స్వప్నప్రియ, విజయవాణి, నెఫ్జా సుందరరామిరెడ్డి గార్లను చిత్రంలో చూడవచ్చు.



## చిరంజీవి, మోహన్‌బాబులతో "చక్రవర్తి"

"చాలాకాలం తర్వాత చిరంజీవి, మోహన్‌బాబు కలిసి నటిస్తున్న చిత్రం, 'చక్రవర్తి' పాత్రలో చిరంజీవి తన అభిమానులను విశేషంగా రంజింపజేస్తారు. సెప్టెంబర్ 10 నుంచి 30 వరకు మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం. అక్టోబర్ 20 నుంచి 30 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయిపోతుంది", అన్నారు రవిరాజా పినిశెట్టి. ఈయన దర్శకత్వంలో జయకృష్ణ సమర్పించే వసంత ఆర్ట్సువారి పై చిత్రంలో భానుప్రియ, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, జె. వి. సోమయాజులు, వేలు ప్రభృతులు పాల్గొంటున్నారు. గణేశ్‌పాత్రో మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, లోక్‌సింగ్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, వెల్లిస్వామి కూర్పు, బాబూరావు నిర్వహణతో మోహన్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. డాక్టర్ కె. వెంకటేశ్వరరావు నిర్మాత.



'ఉక్కు సంకెళ్ళు'లో సుమన్, పవిత్ర



"లేడీస్ టైలర్"లో సంధ్య, రాజేంద్రప్రసాద్, దీప





చలనచిత్ర రంగంలో విశిష్టవ్యక్తిగా శ్రీ అక్కినేని నాగేశ్వరరావు నుండి వంశీ అవార్డు పొందుతున్న శ్రీ యీడ్పుగంటి లక్ష్మణరావు

## "బందిపోటు బ్రహ్మన్న"

"ఒక బొంబాయి నాట్య తార కూడా నటిస్తుంది" అన్నారు ఇ. వి. ఆర్. చౌదరి. ఈయన దర్శకత్వంలో ఈడ్పుగంటి రాజేశ్వరి నిర్మిస్తున్న స్వర్ణ చిత్రవారి పై చిత్రంలో చరణ్‌రాజ్, రంగనాథ్, నూతన్‌ప్రసాద్, త్యాగరాజ్, జీవా, జయమాలిని, అనూరాధ వగైరా నటవర్గం. యడవల్లి కథ, మాటలు రాశారు. సత్యం సంగీతం, బి. ఎస్. వసంత్ ఛాయ, ప్రసాద్ సహకార దర్శకత్వం, మూర్తి ప్రొడక్షన్, ఈడ్పుగంటి నాగేశ్వరరావు సంకలనం, నిర్వహణతో డాక్టర్ ఎం. డి. జమీర్ అహ్మద్ సమర్పణ.

## కె. వి. ఎం. ఎంటర్‌ప్రైసెస్ చిత్రానికి కోడి రామకృష్ణ

"అర్జున్ పక్కన ఓ బొంబాయి తార నాయిక. నవంబర్‌లో సాంగ్స్ రికార్డింగ్. డిసెంబర్‌లో షూటింగ్ మొదలెట్టి, జనవరిలో ముగిస్తాం", అన్నారు కోడి రామకృష్ణ. ఈయన దర్శకత్వం వహించే పై సంస్థ చిత్రంలో వేలు, ఏలేశ్వరం రంగా, వై. విజయ, తతిమా పాత్రధారులు. కలైమణి కథ, కె. వి. మహదేవన్ సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, సి. నారాయణరెడ్డి గీతాలు, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు. సాహుల్ సాహసాలు, తాతా సురేష్ కూర్పు నిర్వహిస్తారు.



''స్త్రీ సాహసం''లో స్మిత

## తాతినేని రామారావు, పి. ఎ. పి. చిత్రంలో బాలకృష్ణ "ప్రెసిడెంటుగారబ్బాయి"

"అక్టోబర్ 16 నుంచి షూటింగ్", అన్నారు అనుమోలు వెంకటసుబ్బారావు. ఈయన నిర్మించే ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ సరసన సుహాసిని నాయిక. పరుచూరి సోదరుల మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతంలో తాతినేని రామారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## కోదండరామిరెడ్డి, కృష్ణంరాజుల చిత్రం

"డిసెంబర్ 21న ప్రారంభోత్సవం", అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో జి. సత్యనారాయణ నిర్మించే చిత్రాన్ని వడ్డే సుబ్బారావు సమర్పిస్తారు. □

"తలంబ్రాలు"లో కల్యాణచక్రవర్తి, జీవిత



''బ్రహ్మరుద్రులు''లో వెంకటేశ్, రంజని



# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



యస్. రఫియాసుల్తానా, ఉరవకొండ

ప్రతి సినిమాతారకూ గర్వమూ... అహంకారం ఉంటాయని విన్నాను. మరి మీకు వుందా...?

కన్నవన్నీ కలలు కావు- విన్నవన్నీ నిజాలుకావు. అవునంటారా!

వై. ఇందిర, ఏలూరు

అక్కా! ఆడదాన్ని బానిసగా చూసే మగవారికి బుద్ధివచ్చేలా వుంది మీ "అరుణ" పాత్ర. మీరేమంటారు?

మీరు అన్నదానితో ఏకీభవిస్తాను. కానీ లోకంలో అందరూ 'శ్రీరామ్' లాంటి మగవారే వుంటారని అనుకోను. డా. కుమార్‌వంటి మంచి మనుషులు వుంటారు.

కె. ఉమశ్రీ, శ్రీకాకుళం

అక్కా! మా ప్రశ్నలకు జవాబులివ్వడానికి మీకు రికమెండేషన్ అవసరమా? మీ ఫొటో ఒకటి పంపరూ.....

మీ ప్రశ్నకు నా దగ్గర్నించి జవాబు పొందాలంటే ఏ రికమెండేషనూ అవసరంలేదు.. చక్కని ప్రశ్నను పంపితే చాలు. లేదా ఫొటో కోసం మా ఇంటికి ఉత్తరం వ్రాస్తే ఫొటో మీకు వస్తుంది.

యం. రవికృష్ణ, హనుమాన్‌జంక్షన్

-మంచి స్నేహితుడు అంటే-

-కలకాలం గుర్తుండేవారు.

ఎ. రేణుక, భాను, జ్యోతి, పాలకొండ

కథానాయికలు చక్కగా చీరకట్టుకుని నృత్యాలు చేయడాన్ని కథానాయకులు ఇష్టపడరా? లేక నిర్మాతా... దర్శకులు యిష్టపడరా? ఎందుకు ఎక్కువగా అధునాతన వస్త్రాలు ధరించుతారు? కారణం చెప్పరూ?

ప్రేక్షకుల అభిరుచికి అనుగుణంగానే నిర్మాతా... దర్శకులు చిత్రాల్ని నిర్మిస్తారు. కథనుబట్టి ఒకోసారి, సందర్భాన్నిబట్టి మరోసారి కథానాయిక ఏ వస్త్రాలు ధరిస్తే బాగుంటుందో ఆలోచించి ఆ వస్త్రాల్ని అలంకరిస్తారు. ఇందుకు ఏ ఒక్కరి అయిష్టం అనే ప్రసక్తి లేదు... రాదు.

పంతంగి మురళీధర్, నందికొట్కూర్

మీ పురోభివృద్ధికి... ప్రేక్షకులమైన మేము విమర్శనాత్మక సూచనలు అందిస్తే స్వీకరిస్తారా?

-తప్పకుండా!

## ఉత్తమ ప్రశ్న

జి. సత్తిబాబు, విశాఖపట్నం

నేటి సమాజంలో స్త్రీకి నిజమైన స్వాతంత్ర్యం ఎప్పుడు వస్తుందంటారు?

పూజ్య బాపూజీ అన్నట్లు-

"అర్ధరాత్రి స్త్రీ క్షేమంగా ఇంటికి తిరిగి వచ్చినప్పుడు...."

నిజంగా మనకు అసలైన స్వాతంత్ర్యం వచ్చినట్లే?

యం. సత్యనారాయణరాజు, కర్నూలు

తమ తప్పులు దాచుకుని ఇతరుల తప్పులను వేలెత్తి చూపుతుంది యీ సమాజం. ఎందుకనంటారు?

-సమాజం కనుక.

ఎ. లక్ష్మణరావు, కాట్రపాడు

తల్లిప్రేమలో వున్న ఆనందం దేనిలోనూ లేదంటాను. మరి మీరేమంటారు?

-మీరన్నదాంతో పూర్తిగా ఏకీభవిస్తాను.

జె. శ్రీనివాసరావు, వేములవాడ

మిమ్మల్ని పొగిడే వారికే జవాబులు యిస్తున్నారని నేను అంటే మీరేమంటారు?

శుద్ధ అబద్ధమంటాను. చక్కని ప్రశ్నకు సమాధానం వుంటుంది. ఎప్పుడూ అడిగే మీ మొదటి చిత్రం ఏది? మీరేమేమి చిత్రాల్లో నటిస్తున్నారు? అనే ప్రశ్నలు రొటీన్‌గా అందరూ అడిగేవే కదా!

జి. ఎ. ఆర్. శేఖర్, జె. కె. పూర్

జంతువుని చంపుకుతినే మాంసాహారిని చాలా మంది నీచంగా చూస్తారు. కాని తోటి మనిషిని దోచుకుతినే మనుష్యుల్ని ఎంతో గౌరవిస్తారు. ఎందుకనంటారు?

పెద్ద మనుషులు కాబట్టి తమల్ని ఎక్కడతినేస్తాడోనని భయపడి అలా వంగి వంగి గౌరవించుతారు. సమయం..... సందర్భం దొరికితే ఆ మనిషి ఎంత పెద్దవాడైనా ఎదురు చూడరు. ఏం చెయ్యాలో అది చేసే తీరుతారు.

యన్. రాజా, ఇల్లెందు

నేటి యువతరం సమాజ పురోభివృద్ధికై ముందంజ లేస్తుంటే నేటి సినిమాలు, వాటిలోని అసభ్య సన్నివేశాలు వారిని చెడుదారి పట్టిస్తున్నవని నేనంటాను. నిజమేనంటారా?

ఎంతమాత్రమూ కాదు. యువతను సన్మార్గంలో నడవమని.... చైతన్యవంతులుగా మారాలని ఉద్బోధించే చిత్రాలూ వచ్చాయి... వస్తున్నాయి. వాటిని మర్చిపోకూడదు. □

కూపన్

ఆంధ్రసచిత్ర వారపత్రిక

విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

పంపిన వారి పేరు : ______________________________

పూర్తి చిరునామా : ______________________________




దర్శకత్వం రాజాచంద్ర నిర్మాతలు కోనేరు రవీంద్రనాథ్ పాలపర్తి కోటేశ్వరరావు
శ్రీ విజయలక్ష్మి ఫిలింస్

# మతిమరపు

శ్రీకాకుళపు రామకృష్ణ

రోహిణీకార్తె రంగప్రవేశంతో సూర్యభగవానుడు మరింత విజృంభిస్తూ తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తున్నాడు. సముద్రానికి దగ్గరైనను బందర్లో కూడా ఎండ అధికంగానే వుంది. బస్‌స్టాండ్ కోలాహలంగా వుంది.

పావు గంట నుండి విజయవాడ బస్సుకోసం ఎదురు చూస్తున్నారు పరంధామయ్యగారు. చుట్టూ రకరకాల మనుషులు. హైదరాబాద్‌వాళ్లు కాబోలు కిళ్లీలు నమిలి గోడలమీద వూస్తున్నారు. ప్రక్కనే స్పిట్యూన్ వున్నను. కంపరమెత్తింది పరంధామయ్యగారికి.

అక్కడ్నుంచి కదిలి పుస్తకాల షాపు వైపుకి వెళ్లి పుస్తకాలుచూస్తూ నిల్చున్నారు. ఇంతలో విజయవాడ బస్ రానే వచ్చింది. బెల్లం చుట్టూ ఈగల్లా పడ్డారు జనం బస్సుమీద. దిగేవాళ్లని దిగనివ్వకుండా తోసుకుంటూ ఎక్కుతున్నారు సాహసవీరులు. అంతమందిని ఛేదించుకుని బస్‌లోకి ఎలా వెళ్లాలా అని ఆలోచిస్తూ చూస్తున్నారు పరంధామయ్యగారు. ఇంతలో బస్‌లోంచి 'మాస్టారూ', అన్న పిలుపు విన్పించింది. పరంధామయ్యగారి శిష్యుడు శంకరం కనబడ్డాడు.

విజయవాడ నుండి వస్తున్నాడు కాబోలు. బస్ విండోలో నుండి బాగ్ తీసుకొని ఒక సీటులో పెట్టాడు శంకరం. పరంధామయ్యగారికి బస్‌లో సీటు రిజర్వ్ అయిపోయింది. శంకరం బస్ దిగివచ్చి పరంధామయ్యగారితో చెప్పి వెళ్లిపోయాడు. రష్ తగ్గాక తన సీటులోకి వెళ్లి కూర్చున్నారు పరంధామయ్యగారు. ప్రక్కనే విండో సీటులో ఎవరో కుర్రాడు ఏదో సినిమా పత్రిక కాబోలు చదువుతూ కూర్చున్నాడు.

పరంధామయ్యగారు ఎలిమెంటరీ స్కూలు హెడ్‌మాస్టరుగా పనిచేసి నాలుగేళ్ల క్రితం రిటైర్డ్ అయ్యారు. ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. తన సంపాదనలో ఇద్దరి కూతుళ్లని అత్తవారిళ్లకు పంపాడు. మూడో కూతురు తనూజ పెళ్లి-చేయడానికి తగిన ఆర్థిక వసతిలేదు. కొద్దో, గొప్పో వున్న, అది పెళ్లి ఖర్చులకి సరిపోతుంది కాని, కట్నం ఇవ్వడానికి సరిపోదు. కొడుకు శివప్రసాద్ బ్యాంక్‌లు ఉద్యోగం చేస్తూ, తనతో పాటే పనిచేస్తున్న కామేశ్వరిని పెళ్లి చేసుకుని దూరంగా వెళ్లిపోయాడు. ఇప్పుడు కొడుకు కూడా తన చెల్లెలి పెళ్లి విషయం పట్టించుకోడు. తనూజ పెళ్లి ఎలా చెయ్యాలా అన్న సమస్యతో వున్న పరంధామయ్య-గారికి కంకిపాడు నుండి చిన్ననాటి మిత్రుడు రంగారావు రాసిన వుత్తరం కొంత రిలీఫ్ నిచ్చింది. ఆయన దగ్గరకే బయల్దేరారు పరంధామయ్యగారు.

బస్ బయల్దేరడంతో కిటికీలో నుండి గాలి వస్తుంది. జేబులో నుండి రంగారావు వ్రాసిన వుత్తరం తీసి చదువుకున్నాడు పరంధామయ్య-గారు

ప్రియ పరంధామం,

ఉభయ కుశలోపరి, ఈ మధ్య మన మధ్య రాకపోకలు లేకపోగా, కనీసం ఉత్తరాల రాకపోకలు కూడా సాగట్లేదు. వయసు మీద పడుతున్నా వయసులోని జ్ఞాపకాలు పూరట కలిగిస్తున్నాయి. చిరంజీవి శివప్రసాదు వెళ్లిపోయాడటగా? మనమేం చేయగలంరా, పిల్లల్ని కనగలం కాని, వాళ్ల రాతలెక్కడ కనగలం? రెక్కలొచ్చేవరకేరా పక్షి గూటిలో వుండేది రెక్కలొచ్చేక తన దారి తను చూసుకుంటుంది. అది పక్షుల్లోనే కాదురా మనుషుల్లోను అంతే అని మన శివప్రసాదులాంటి వాళ్లు రుజువు చేస్తున్నారు. అంతే.

సరే ఆ విషయాలు వదిలేయ్, మా దూరపు బంధువుల కుర్రాడు ప్రసాద్ అని ఆర్టీసిలో కండక్టరుగా పనేస్తున్నాడు. ఈ మధ్య అతను ఏదో పెళ్లిలో మన అమ్మాయి తనూజను చూశాడట. అమ్మాయి అతనికి నచ్చిందట. ఈ విషయం నీతో ప్రస్తావించమని అతను నా దగ్గరకొచ్చి అడిగాడు. అతను కట్న కానుకలేవి ఆశించటంలేదు. కుర్రాడు బుద్ధిమంతుడు, పైగా గవర్నమెంటు వుద్యోగం. ఆలోచించు. మననుండి అతనుగాని, అతని తరపువారుగాని పైసా కూడా ఆశించట్లేదు. పిల్ల బాగుంది చాలు అంటున్నారు. మరి రెండు, మూడు రోజుల్లో నువ్వు ఇక్కడికి వస్తే, కుర్రాడిని చూద్దాం. నీకు నచ్చితే శుభస్య శీఘ్రం. శీఘ్రమే కళ్యాణ ప్రాప్తిరస్తు (నీక్కాదురోయ్) అమ్మాయికి. వుంటామరి.

నీ రంగారావు.

"టికెట్ సార్, టికెట్, టికెట్ .." కండక్టర్ టిక్కెట్లు అడుగుతూ అభిమన్యుడిలా జనాల్ని తప్పించుకుని వస్తున్నాడు. పరంధామయ్యగారి దగ్గరకు వచ్చాడు. చదువుతున్న వుత్తరం జేబులో పెట్టుకుని ఇరవై రూపాయల నోటు తీసి కండక్టర్‌కిచ్చారు కంకిపాడు ఒక టిక్కెట్టు ఇవ్వమంటూ.

"చిల్లర లేదా సార్?"

లేదన్నట్టుగా తలవూపారు పరంధామయ్యగారు.

"సరే, టిక్కెట్టు వెనుక మీకు రావల్సిన పద్నాలుగు రూపాయలు రాస్తున్నా, దిగేటప్పుడు తీసుకోండి. చిల్లర పెద్ద ప్రాబ్లం అయిపోయింది సార్" అని టిక్కెట్టు చేతిలో పెట్టి ముందుకు వెళ్లిపోయాడు కండక్టర్.

టిక్కెట్టు ఓసారి చూసుకుని జేబులో పెట్టుకున్నారు పరంధామయ్యగారు.

"రంగారావు మాటమీద కొండంత ఆశతో వెళ్తున్నాడు తను. రంగారావు పుణ్యమా అని తనూజ పెళ్లి కుదిర్తే తన భారం వదలిపోతుంది. సామాన్యంగా ఏ తండ్రికిపిల్లలు భారం కారు. కాని ఆర్థికంగా వెనుకబడి వున్నప్పుడు మాత్రం ఎదిగిన ఆడపిల్లల పెళ్లిళ్లు తండ్రులకు భారంగానే వుంటాయి. ఎదిగొచ్చిన కొడుకు అండగా వుంటాడనుకుంటే వాడు తన దారి తను చూసుకున్నాడు. రంగారావు చెప్పింది నిజం. పక్షులు రెక్కలొచ్చే వరకేగూటిలో వుండేది.

ఇలా ఏవో ఆలోచనల్లో వుండగా కంకిపాడు వచ్చింది. గబగబా బ్యాగ్ పుచ్చుకుని దిగేశారు పరంధామయ్యగారు. దుమ్ము రేపుకుంటూ వెళ్లిపోయింది బస్. ప్రక్కనే వున్న కిళ్లీ షాపులో సోడా తాగుదామని జేబులో చెయ్యి పెడితే రెండు రూపాయల కాగితం వచ్చింది. మిగిలిన వాటి కోసం వెదకగా టిక్కెట్టు చేతికొచ్చింది. అప్పుడు గుర్తొచ్చింది కండక్టరు నుంచి పద్నాలుగు రూపాయలు రావల్సి వుందని. తను అడగకుండా పరధ్యానంగా దిగేశాడు. తన మతిమరుపుకు తిట్టుకుంటూ రెండు కాగితం యిచ్చి సోడా త్రాగారు. బస్ టికెట్ ను జాగ్రత్తగా జేబులో పెట్టుకుని పది నిమిషాల్లో రంగారావు యింటికి చేరుకున్నారు.

బస్ కంకిపాడు దాటుతుండగా చెకింగ్ స్క్వాడ్ బస్ ఆపు చేసింది. కండక్టర్ అప్పుడేయస్సార్ పూర్తిచేశాడు. ఒక ఆఫీసర్ టిక్కెట్స్ లెక్కేసి, బ్యాగ్‌లో క్యాష్ కూడా లెక్కేశాడు. ఇరవై రెండు రూపాయలు ఎక్కువ వున్నాయి.

"ఏమిటి, క్యాష్ ఎక్కువగా వుంది?"

"అది పాసింజర్స్‌కివ్వాల్సింది సార్. చిల్లర్లేక దిగేటప్పుడు తీస్కుంటారు. వాళ్ల టిక్కెట్ల వెనుక కూడా రాశాను" వినయంగా చెప్పాడు కండక్టర్.

"ఐసి!" అని పాసింజర్ వైపు తిరిగి "ఎవరికైనా చిల్లర రావాలా?" అని అడిగాడు.

"నాకు రావాలండి. ఎనిమిది రూపాయలు. ఇదిగో టికెట్ వెనుక రాశాడు. విజయవాడలో దిగుతాను నేను" అని ఒకతను చెప్పాడు.

"ఇంకా ఎవరికైనా రావాలా?" మళ్లీ అడిగాడు ఆఫీసర్.

ఎవ్వరూ మాట్లాడలేదు. కొద్దిసేపు చూసి.



"మరి ఈ పద్నాలుగు రూపాయల మాటేమిటి? టిక్కెట్టివ్వకుండా జేబులో వేసుకుంటున్నావా?" తీవ్ర స్వరంతో అడిగారు.

పద్నాలుగు రూపాయలు ఎవరికివ్వాలబ్బా అని పాసింజర్స్ వైపు చూశాడు కండక్టర్. అప్పుడు గుర్తొచ్చింది. బందర్లో ఎక్కిన పెద్దాయనకి ఇవ్వాలని. ఆయన కోసం ఆశగా బస్‌లో చూశాడు. కాని, ఆయన లేడు. కంకిపాడు దిగిపోయాడు. ఈ విషయమే చెప్పాడు వాళ్ళకి. కాని వాళ్ళు నమ్మలేదు.

"యువార్ సస్పెండెడ్ ఫ్రంది సర్వీసెస్. డిపోకెళ్ళాకసస్పెన్షన్ ఆర్డర్ తీసుకో" అని బస్సు వెనకే జీపులో ఫాలో అయ్యారు చెక్కింగ్‌స్క్వాడ్‌మెంబర్స్.

బస్సు విజయవాడ వైపు వెళ్తుంది. కండక్టర్ ఎంత చెప్పినా ప్రయోజనం లేకపోయింది. పాసింజర్స్ సానుభూతిగా కండక్టర్ వంక చూస్తున్నారు.

"ఒరేయ్, పరంధామం క్లాసులో మనిద్దరం చేసిన అల్లరి ఎవరైనా చెయ్యగలరా? అడిగారు రంగారావు చిన్ననాటి విషయాలు మననం చేసుకుంటూ. ఇంతలో టీ తీసుకువచ్చింది అన్నపూర్ణమ్మగారు. రంగారావుగారి భార్య. టీ త్రాగుతూ చిన్ననాటి విషయాలు ముచ్చటించుకుంటున్నారిద్దరూ-

"ఐదు గంటలకి వెళ్దామోయ్, పెళ్ళికొడుకుని చూడటానికి" చెప్పాడు రంగారావు.

"అలాగేలేరా, నీ యిష్టం" జవాబిచ్చారు పరంధామయ్యగారు.

సాయంత్రం ఐదు గంటలయింది. ఎండ తీవ్రత చాలా వరకు తగ్గిపోయింది. చల్లటి గాలి కొద్ది కొద్దిగా వీస్తుంది. ఇద్దరూ బయల్దేరుతున్నారు పెళ్ళికొడుకుని చూడడానికి. ఇంతలో రంగారావుగారు భార్యను "ఏమేవ్ గృహలక్ష్మి కాస్త ఎదురురా. మీ అన్నయ్య కూతురికి సంబంధం కోసం వెళ్తున్నాం" అని కేకేశారు.

" "అదేవిటీ, అమ్మాయి పేరు అన్నపూర్ణ కదూ?" సందేహం వెలిబుచ్చారు.

"అదంతేలేరా. ఈ యింటికి ఆవిడే కదా గృహలక్ష్మి".

"ఓరి భడవా" నవ్వుకున్నారు పరంధామయ్య.

అన్నపూర్ణమ్మగారు ఎదురు వచ్చింది. వాళ్ళిద్దరూ బయల్దేరి పెళ్ళికొడుకు ప్రసాదు యింటికి చేరుకున్నారు.

ప్రసాదు తల్లి సాదరంగా ఆహ్వానించింది ఇద్దర్నీ. రంగారావు పరంధామయ్యగార్ని పరిచయం చేశారు. "ప్రసాదు ఇంకా రాలేదేమ్మా?" అడిగారు రంగారావుగారు.

"విజయవాడలో డ్యూటీ దిగి రావాలి కదండీ. కొంచెం ఆలస్యమవుతుంది. అయినా ఈసరికే రావల్సినవాడు" చెప్పింది ప్రసాదు తల్లి.

కొడుకు గుణగణాలు చెప్తూంది ఆవిడ. ఓ అరగంట కూర్చున్నారు ప్రసాదు కోసం. లోకాభి రామాయణం మాట్లాడుతుండగా ఎవరో కుర్రాడు వచ్చి "పిన్నీ, మన ప్రసాదుని ఉద్యోగంలోంచి తీసేసారట. బాగ్‌లో డబ్బులు, పద్నాలుగు రూపాయలు ఎక్కువ వున్నాయట" అని చెప్పాడు.

దిగాలుగా కూర్చుంది ప్రసాదు తల్లి.

"నా బిడ్డ అటువంటివాడు కాదు రంగారావుగారూ. ఎందుకు జరిగిందో యిది. కొంచెం వెళ్ళి కనుక్కోండి" అంటూ రంగారావుని బ్రతిమాలింది ఆవిడ.

అప్పుడు గుర్తొచ్చింది పరంధామయ్యగారికి -తను మర్చిపోయింది కూడా పద్నాలుగు రూపాయలేనని. ఒకవేళ అతనేనేమో!

"ఏమ్మా, అబ్బాయి ఈ రోజు డ్యూటీకి ఏ వూరు వెళ్ళాడు?" అడిగారు పరంధామయ్యగారు.

"బందరండి" చెప్పిందావిడ.

"రైట్, తను ఇందాక మర్చిపోయి దిగింది ప్రసాద్ బస్‌లో నుంచన్నమాట.

"పదరా రంగా, ఈ ఉద్యోగం ఎక్కడికీ పోదు. ఆ పద్నాల్గు నేనే మరిచిపోయి వచ్చా. టిక్కెట్టు కూడా భద్రంగా వుంది. వెనుక అతను రాశాడు కూడా". చెప్పాడు. ఇద్దరు బస్‌స్టాండుకి బయల్దేరారు.

మరో గంటలో విజయవాడ బస్ డిపో మానేజర్ దగ్గరున్నారు రంగారావు, పరంధామయ్యగారు. జరిగినదంతా చెప్పి టిక్కెట్టు చూపించారు పరంధామయ్యగారు. సరే, ఓ గంటలో సస్పెన్షన్ ఆర్డర్స్ కాన్సిల్ చేస్తాం. మిగిలిన ఆఫీసర్స్‌తో కూడా మాట్లాడాలి." చెప్పాడు డిపో మానేజర్.

ప్రసాద్ కోసం వెదుకుతున్నారిద్దరూ. ప్రసాద్ తనకు తెల్సిన ఆఫీసర్ల చుట్టూ తిరుగుతున్నాడు.

ఒక గంటలో సస్పెన్షన్ ఆర్డర్స్ విత్‌డ్రా చేసుకున్నారు ఆఫీసర్లు. ప్రసాదుకి డిపో మానేజర్ జరిగింది చెప్పాడు. తన వుద్యోగాన్ని నిలబెట్టిందెవరా అని బయటకు వచ్చి చూశాడు. బయట రంగారావుగారు, ప్రక్కన ఇంకొకాయన కనపడ్డారు. రంగారావు ప్రక్కనున్నది బందర్లో ఎక్కి కంకిపాడులో చిల్లర మర్చిపోయి దిగేసిన పెద్దాయన. గుర్తొచ్చింది ప్రసాద్‌కి. ప్రసాదు వచ్చి రంగారావుగార్ని పలకరించాడు. రంగారావుగారు పరంధామయ్యగారిని పరిచయం చేశారు "మీ కాబోయే మామగారు నాయనా!" అంటూ. ముగ్గురూ, కాఫీ త్రాగారు బస్‌స్టాండులోని హోటల్లో. పరంధామయ్యగారు అక్కడే బందరు బస్సు ఎక్కారు.

నెల తిరగ్గానే పరంధామయ్యగారు పడకుర్చీలో కూర్చుని శుభలేఖల మీద అడ్రస్‌లు వ్రాస్తున్నారు బంధుమిత్ర సపరివారులందరికీ. □






ఎన్. వి. ఎన్. విజయనగరం

★ మీరు ఆడవారికే మద్దతు నిస్తున్నారు. మగవారు అంటే ద్వేషమా?

● లేదే?! మీ కలా అనిపిస్తోందా?

★ జీవితం అంటే మీ దృష్టిలో?

● ఏరోజు కారోజు బ్రతకడం-

★ బాధను పోగొట్టేది?

● తాగుడు కాదు! చదవడం.

ఆర్. నారాయణ పేట

★ కన్న తల్లి, పుట్టిన వూరు స్వర్గంతో సమాన మంటారు ఎందుకని?

● అలా అనిపిస్తుందని! అంతే.

కె. బి. ఎన్. ఎమ్. ఖర్గపూరు

★ వారఫలాలు దినఫలాలు వగైరాపై మీ అభిప్రాయం?

● చదువుతాను సరదాగా! కాని నమ్మను. ఒక్కొక్కప్పుడు ఆవారం దీవారానికీ – యీ వారం దావారానికీ మరిచి పోయి వేసే ప్రమాదం లేకపోలేదు!! పీటర్ విడాక్ ఏరోజు ఏం చేయాలో చెప్తూ ఏ రంగు కట్టుకోవాలో కూడా చెప్తుంటాడు. సగం రంగుల పేర్లు దొరకవు .. ఇవన్నీ సరదాగా చదివినా తప్పులేదు. పట్టుకుని పాకులాడకూడదు. వీటిని సీరియస్‌గా తీసుకోడం ప్రారంభిస్తే – మనస్సు బలహీనమై పోతుంది. మనకి తెలియకుండానే మనం పిరికి వారిమై పోతాం.

ఎస్. వి. సంగం జాగర్లమూడి

★ నిజంగా ప్రేమలో ఓడి పోయిన వారే ప్రేమ అనే పదానికి అర్థం చెప్పకలరంటాను. ఈజ్ ఇట్ ట్రూ?

● ఇఫ్ యు సెసో!! విషం తిన్నవాడు బ్రతికి బయట పడితే విషం రుచి చెప్ప కల్గినట్టు!!

★ మన వ్యక్తిత్వాన్ని కాపాడు కోవాలను కున్నప్పుడు ఇతరుల బెదిరింపులు అడ్డువస్తే మన ప్రవర్తన ఎలా వుండాలి?

● డిప్లొమేటిక్‌గా వుండాలి. చెప్పీ చెప్పనట్టు – మీ బెదిరింపులు నాకేం యిబ్బంది కావని చెప్పాలి.

డి. వి. ఆర్. మద్రాసు

★ అభ్యుదయం, ప్రోగ్రెస్ క్రాంతిపథం అంట్టూంటారు ఇదంతాదేనికి?

● మనిషి ముందుకు నడవాలి. లేక పోతే వెనక పడి పోతూనే వుంటాడన్న సత్యం చెప్పడానికి.

టి. ఎస్. పి. గుంటూరు

★ మీరు అవివాహితులా? పేరు ముందు శ్రీమతి అని ఎందుకు వేయించు కోరు? లేక వివాహం అయినా శ్రీమతి అన్న పదాన్ని పేరు ముందు చేర్చుకో లేక పోతున్నారా?

● అంటే? రెండో ఎడ్రసనా మీ ఊహ!!అదేం లేదు. పఠితలకి నా రచనతో సంబంధం గాని నా స్టాటస్‌తో ఏం సంబంధం?! మిస్సయితే నేం? మిసెస్ అయితేనేం? రచన మారదుకదా!!

★ సమతాభావన అనేది యిక సాగేనా?

● సాగదు

ఏ. ఎ. ఆర్. హైదరాబాదు

★ ప్రేమించు కున్న ప్రేమికులకి కులాలు అంతస్తులు అడ్డువస్తే ఏం చేయాలి!

● అధిగమించ కల్గాలి. అది – ఆర్థికంగా స్వంత కాళ్ళ మీద నిలబడే వారికే సాధ్యం లేదా త్యాగం చెయ్యాలి– ప్రేమని – ప్రాణాలని కాదు

వై. ఆర్. కె. ఎమ్మిగనూరు

★ దుష్ట శిక్షణ శిష్ట రక్షణ ఎప్పుడు?

● ఎప్పటి కప్పుడు జరుగుతూనే వుందే!!

కె. కె. లక్ష్మిదేవి పల్లి

★ మనిషికి ముఖ్యం ప్రేమా? డబ్బా? అందమా?

● డబ్బుంటే – అష్టావక్రుడేనా . అందంగా కన్పిస్తాడు

కె. వి. ఆర్. సికింద్రాబాదు

★ మీ యిరుగు పొరుగు సంబంధాలెలా వుంటాయి?

● అంటే ఇరుగు పొరుగులతో నా ప్రవర్తన అనా? నాలో ఓ దుర్గుణాన్ని సరిచేసుకుంటా పక్కింటావిడవి పది సవరించడానికి బదులు!

ఎస్. ఎన్. ఆర్. నేలకొండపల్లి

★ కె ఆర్ గారూ భర్తృహరి రాసిన వైరాగ్య శతకంలో స్త్రీ అంటే అసహ్యం కల్గేలాగా రాశాడు కాని అతను పెండ్లి చేసుకొని హాయిగానే జీవించాడంటారు

● రెండూ రైటే నయ్యా! అనుభవించ వలసినప్పుడు అనుభవించి– స్త్రీ పొందు నరకానికి దారి అని నీతులు బోధించడం మన ప్రాచీనులకి అలవాటే!!

ఓ. జె. డి. పామూరు

★ నాతి చరామి అనగా నేమి? నేటి సమాజంలో స్త్రీలు హద్దులు మీరి వ్యభిచరిస్తున్నారు

● డేవిడ్‌సార్! యీ స్త్రీని వదలనని మాటిచ్చిన పురుషుడేం చేస్తున్నాడు యీనాడు?– ఆడదాన్ని అమ్ముకుంటున్నాడు, డబ్బుచ్చుకుని తెచ్చి బానిసగా కట్టి పడేస్తున్నాడు, డబ్బు సంపాదించే మిషనుగా చూస్తున్నాడు, సంతానం కనే యంత్రంగానేచూస్తున్నాడు గాని సాటి మనిషిగా ఆడదాన్ని చూడడం లేదు నూటికీ కోటికీ ఓ మనిషి, ఆడదాన్ని గౌరవిస్తే అతగాడిని ఆడిపోసు కుంటారు– చవట పెళ్ళాం మాట వింటాడని! కట్టు కున్నవాడు యివ్వని గౌరవం ఎవరేనా యివ్వడాన్ని చూస్తేనే స్త్రీ వ్యభిచారి అయిపోతూంది మీ దృష్టిలో– వ్యభిచారం అంటే ఏమిటి మీ దృష్టిలో?

ఎమ్. వి. కె. విశాఖపట్నం

★ నాకన్నీ ఆలోచనలే, అనుమానాలే, ఏం చెయ్యను?

● బ్రతికి పోయారు! ఆలోచన లేని వాడికి అనుమానాలే రావు!

★ కళ్ళలోకి చూసి చెప్పు అంటారు దేనికో?

● కళ్ళు నిజం చెప్తాయి– నోరు ఏం మాట్లాడినా? కళ్ళు – వాటికి భాష అవసరం లేదు – అన్ని భాషలూ మాట్లాడ కలవు చూపుకి పరిచయాలు అనవసరం– వాటి అంచనా అవి కట్టేస్తాయి– ఎదుటి వారిని అందుకే – చూసి చెప్పు అనడం – కళ్ళలోకి చూసి మాట్లాడని మనిషి కాళ్ళ కింద గోతులు తవ్వ కలడు ☐



ఒక సాంకేతిక అద్భుతం.........



## ఫ్యాంటసీ కలర్ టివి. యొక్క ప్రత్యేకత ఏమిటి?

మేలైన ప్రదర్శనకు దోహదం చేసే గ్రహణ శక్తి, మరియు లోకాతీతమైన రంగులు మీకు సమర్పించడం కోసం కేవలం ప్రతి ఫ్యాంటసీ టివి. సెట్టుతో చూపెట్టబడే అత్యధికమైన శ్రద్ధ.

ప్రపంచానికి పున్నత శ్రేణులైన ఫిలిప్సు వారి సరిక్రొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని, పరికరాలను పరిపాందించుకొని తయారైనది ఫ్యాంటసీ కలర్ టి.వి.

ఫ్యాంటసీ కలర్ టి.వి. తో (ఫిక్చర్ ట్యూబ్‌తో సహా) ఒక సంవత్సరపు వారంటీ ఇవ్వబడుతుంది. ఒక వేళ అవసరమొస్తే ఒక్క ఫోన్ చేస్తే చాలు. తక్షణం, సమగ్రమైన, విశ్వసనీయమైన సేవ హాజరు.

వెంటనే మీకు సమీపంలో ఉండే డీలరు వద్దకు వెళ్ళి ఫ్యాంటసీ ప్రదర్శన పరికించండి. ఫ్యాంటసీ గుణగణాలు తప్పక మీ నిర్ణయానికి దోహదం చేస్తాయి.

అందుకే మీరు కలర్ టి.వి. లో కోరుకొనే లక్షణాలన్నీ "ఫ్యాంటసీ" సంతరించుకొంది.




# FANTASY

COLOUR TV

MAA(S) H VE 86

Marketed by: Vijai Electronics Pvt. Ltd., 13, Progressive Towers, 6-2-913 & 914, Khairthabad, Hyderabad-500 004.

సీరియల్



# సంకెళ్లెవరికి?

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

సాయంత్రం నాలుగున్నరకల్లా ఆరు బయట ప్రదేశంలో పదిహేను మంది యువతీ యువకులు పలకలు బలపాలు పుచ్చుకుని అక్షరాలు దిద్దసాగారు. ఒక వైపు రూప, మరో వైపు సారంగపాణి వాళ్ళకు సాయం చేస్తూ వున్నారు. మనసులో బిడియపడుతూ ఇళ్ళల్లో వుండిపోయిన యువతీ యువకులు కూడా నెమ్మదిగా ఒక్కొక్కరే వచ్చి కూర్చున్నారు. అర గంటలో గూడెంలోని యువతీ యువకులంతా వచ్చి చేరారు అక్షరాభ్యాసానికి ఒక్క మణి తప్ప!

మణి మనసు మండుతున్న నిప్పుల కొలిమిలా వున్నది. రాణిని అలా అందరూ గౌరవంగా చూడడం ఆమెలో విపరీతమైన కసిని రగుల్కొలిపింది. "ఎలాగయినా యీ రాణి పీడ విరగడైతే చాలు! వెయ్యి దేముళ్ళకు కొబ్బరి కాయలు కొడతాను" అని మనసులో అనుకుంది.

జరుగుతన్న విషయాలన్నీ నిర్లిప్తంగా చూస్తున్నాడు చింటూ! రాణి, సారంగపాణి అలా సన్నిహితంగా మసులుకుంటుంటే అతనికి ఏమిటో గా వున్నది. కాని అంతలోనే రాణి తనను మధుర తీసుకొని వెళ్ళి వైద్యం చేయించుకుని రావడం గుర్తుకొచ్చి మనసు ఆమె అంటే కృతజ్ఞతతో నిండిపోయేది!

* * * * *

పది రోజులలోనే అక్షరాలు నేర్చుకున్నారంతా! చురుకైన వాళ్ళు కావాలనుకుంటే ఏ విషయమైనా అడ్డు ఏముంటుంది! మొదటి తరగతి పుస్తకాలు తెప్పించి అందరకూ ఇప్పించింది రూప.

జనపనారతో నులక పేని సొసైటీకి యిస్తే కిలోకి అయిదు రూపాయలు ఇస్తారని చెప్పాడు సారంగపాణి. అతనిని పంపి నులక తయారు చేయటానికి కావలసిన రాట్నాలు, నార తెప్పించింది రూప.

నడి వయసు వాళ్ళు, వృద్ధులూ చెట్ల కింద కూర్చుని నులక పేనటం మొదలెట్టారు! కష్టపడి పని చేస్తే రోజుకు మనిషికి అయిదు రూపాయల వరకూ గిట్టుబాటవుతుంది!

దాని కోసమే ఆత్రంగా ఎగబడ్డారంతా! ఇలా కాయ కష్టం చేయడం కొత్త వారికి! కొత్త వొక వింత అని అందరకూ యిలా శరీర శ్రమ చేయాలని వుత్సాహం పుట్టుకొచ్చింది.

వాళ్ళు ఒక్కోళ్ళు దొంగతనాలూ, దోపిడీలు చేసి వేల రూపాయలు కళ్ళ జూచేవాళ్ళు. ఇప్పుడు కష్టపడి చెమటోడ్చి సాయంత్రానికి నాలుగు అయిదు రూపాయలు కళ్ళ జూచి మహా సంతోష పడిపోతున్నారు.

* * * * *

చెంగల్పట్‌లో డి.ఐ.జి. నాయర్ నార్కొర్కాట్ యస్. పి. శాస్త్రి, చెంగల్పట్ యస్. పి. తంగవేలు సమావేశమైనారు.

రెండు జిల్లాల్లోనూ శాంతి భద్రతల పరిస్థితి సమీక్షించటానికి సమావేశమైనారు వారు. ఉధృతంగా సాగిన దొంగతనాలు, డెకాయిటీలు టైగర్ మరణంతోనూ, జాకాల్ గాంగ్‌లో అయిదుగురు దొంగతనం చేయబోయి కాల్చివేయబడడంతో కొంత వరకూ చప్పబడ్డాయి.

లాకప్‌లోంచి పారిపోతుంటే టైగర్‌ను కాల్చి చంపారన్న వార్త పేపర్లన్నిటా వేసి పది రోజులే అయింది. కాని ఇంకా చింటూ దొరక లేదు! జాకాల్ తప్పించుకు తిరుగుతున్నాడు!

తంగవేలు మనసులో రూప గురించిన దిగులు వుంది. ఎంత కాలం ఆమె విషయం గోప్యంగా వుంచాలో తెలియటం లేదతనికి! చింటూ రూపను బంధించి తీసుకుని వెళ్లాడని అతనికి పూర్తి నమ్మకం! డి.ఐ.జి. నాయర్ పర్మిషన్‌తో పెద్ద బలగంతో వెళ్ళి అతని స్థావరం చుట్టు ముట్టాలని అతని మనసులో వున్నది. ఎంత త్వరగా రూపను విడిపించితే అంత మంచిదని తోస్తున్నది అతనికి. అందుకే "సార్! చింటూగాడు తాత దగ్గరకు చేరాడని వర్తమానం వచ్చింది! మొన్నీ మధ్య చెట్టియార్ ఇంట్లో డెకాయిటీలో కూడా వాడి చేయి వుందని తెలిసింది. పెద్ద ఫోర్సుతో వెళ్ళి రెయిడ్ చేద్దాం సార్!"

"అవున్సార్!" అన్నాడు శాస్త్రి తలాడిస్తూ!

"కాని మనకున్న బలగంతో రెయిడ్ చేయిస్తే వాళ్ళను బంధించడం సాధ్యమా? ఇది వరకు ఎన్ని మార్లు మనం వాళ్ళ పల్లెల మీద రెయిడ్ చేసాం? ఫలితం ఏమైనా వున్నదా?" అన్నాడు డి.ఐ.జి. నాయర్!

"సార్! మీరు ఐ.జి.గారికి ఫోన్ చేసి అదనపు బలాల్ని రప్పించండి సార్! అప్పుడు చింటూ, జాకాల్, ఇంకా మనకు దొరకకుండా తప్పించుకొని తిరుగుతున్న వాళ్ళంతా చిక్కుతారు" అన్నాడు తంగవేలు.

"దట్ యీజ్ ఎ గుడ్ అయిడియా?" అంటూ ఫోన్ తీసి ఐ.జి.కి లైట్నింగ్ కాల్ చేసాడు నాయర్.

ఫోన్‌లో మాట్లాడటం అయాక "ఐ.జి. వొప్పుకున్నారు. త్వరలోనే కావలసినంత ఫోర్సు పంపుతామన్నారు" అన్నాడు.

సమావేశం అయిపోయింది. వెళ్ళిపోవటానికి లేచి నిలబడి "సార్! ఒక మాట మీతో చెప్పాలని కొద్ది రోజులుగా అనుకుంటున్నాను! అదే! ట్రైనీ ఎ.యస్.పి. రూప సంగతి! ఆమె కొద్ది రోజులుగా డ్యూటీకి రావటం లేదు" అన్నాడు తంగవేలు తల వంచుకుని.

"అలాగా! పోలీస్ వుద్యోగం చేయలేక ఇంటికి వెళ్ళి వుంటుంది" అన్నాడు శాస్త్రి.

"మరి చెప్పలేదేం ఇన్నాళ్ళూ" అన్నాడు నాయర్.

**జరిగిన కథ-13:** రంగ, రూప, సారంగపాణి, అయ్యప్పలను కూడా తీసుకువెళ్లి చెట్టి ఇంట్లో నగలు, డబ్బు దొంగలించుకుని వస్తాడు చింటూ. చెట్టి ఇంట్లో అల్సేషన్ కుక్క చేసిన గాయాలవల్ల చింటూకి ప్రమాదకరమైన శీత జ్వరం వచ్చింది. చింటూ పరిస్థితి చూసిన రూపకు మనసులో భయం ఎక్కువయింది. చింటూని మధురకి తీసికెళ్లినర్సింగ్‌హోమ్‌లో ట్రీట్‌మెంట్ ఇప్పించింది రూప. చింటూ కొంచెం కోలుకోసాగాడు. చింటూకి పూర్తిగా నయమయింది. చింటూ, రూప సుబ్రమణ్యం తాత వాళ్ల ఊరు వచ్చేసారు. జాకాల్ కూడా సుబ్రమణ్యం తాత దగ్గర ఆశ్రయం పొందాడు. రూప మాటలతో గూడెంలోని ప్రజలలో కొంత పరివర్తన రాసాగింది.

"చింటూ ముఠా వాళ్ళు ఆమెను బంధించి వుంటారని ఆ మూకీ వచ్చింది. ఈ విషయం బయటకు పొక్కితే డిపార్ట్‌మెంట్ ప్రెస్టేజీ పోతుందని భయపడ్డాను"

"ఈజీట్! అలా అయితే అదనపు బలం రాగానే చింటూ వున్న గూడెం మీద రెయిడ్ చేద్దాం" అన్నాడు నాయర్.

* * * * *

యువతీ యువకులందరూ చదువుకోటానికి ముందుకు వచ్చినా చింటూ మాత్రం రావటం లేదు. ఆ విషయం రూపకు ఆవేదన కలిగించింది.

"చింటూ! నువ్వు కూడా చదువుకోరాదూ?" అని అడిగితే-

"ఎందుకు? అందరకూ చదువు చెబుతున్నావుగా! ఇక నేను వొక్కడినీ నేర్చుకోకపోతేనేం" అన్నాడు కోపంగా.

ఇక అప్పుడు మాట్లాడినా వుపయోగం లేదని అవతలకు వెళ్ళిపోయింది రూప.

రూప అవతలకు వెళ్ళగానే మణి వచ్చింది. "రాణీ! రాణీ! అంటూ నువ్వు వెంటబడుతున్నావుగాని దానికి నువ్వు అక్కర్లేదు! దానికి కో అంటే కోటిమంది! ఆ సారంగపాణికి ఏం మత్తు జల్లిందో దాని చుట్టూ కుక్క తిరిగినట్లు తిరుగుతున్నాడు" అంది మణి.

"ఛ! అవతలకు వెళ్ళు! వెధవ సొద" అని విసుక్కున్నాడు.

"నా మీద విసురుకుంటావేం! అవతల అది వాడితో కులుకుతుందంటే నీకెందుకంత యిది?" అన్నది మణి అవతలకు వెళ్ళిపోతూ!

వాకిలి బయట నుల్చుని "ఎక్కడా చోటు లేనట్లు కొండమీద జేరతారు అదీ, సారంగపాణీ! ఛీ! సిగ్గూ ఎగ్గూ లేదు! ఎక్కడ నుండి వచ్చిందో పాపిష్టిది" అని అంది మణి.

చింటూ మనసు నిబ్బరంగా వుంచుకోలేక పోయాడు.

ఇంట్లోంచి బయటకు వచ్చి వూరి బయటకు తాటితోపువైపుగా నడవసాగాడు.

"చింటూ!" కేక విని ఆగాడు. ఎదురుగా ఆరుముగం!

"ఏమిట్రా యిలా వచ్చావు?" అన్నాడు చింటూ.

"ఏం చెప్పను తమ్ముడూ! పొగరు మోతు పిట్ట రాణి నాకు అలవిగాలేదని మీ యింటి దగ్గర వదిలి వెళ్ళాను. అప్పట్నుంచీ పట్టుకున్నాయి తిప్పలు. కానిముత్తు గాడు పట్టుకొని లాకప్‌లో పెట్టి వుతికి పారేసాడు.

చివరకు ఎలా అయితేనేం రెండు రోజులనాడు పాయిఖానాకు వెళ్ళి వస్తానని చెప్పి పారిపోయి వచ్చాను.

కుక్కను తరిమినట్లు తరిమారు నన్ను! ఎలాగో వాళ్ళ కళ్ళు గప్పి ఇలా వచ్చాను.



## సంకెళ్లెవరికి?

ఆ మర్చిపోయాను! పోలీసులు టైగర్‌ను కాల్చి చంపారు! పారిపోతుంటే కాల్చామని పైకి చెబుతున్నారు!

టైగర్ కుడి భుజం రామనాథం ఏడుస్తూ చెప్పాడు ఆ సంగతి

టైగర్ సంగతేమోగాని మీ రాణి వలనే నాకీ తిప్పలన్నీ వచ్చాయి అన్నాను అతనితో

రాణి ఎవరూ?" అన్నాడతను!

టైగర్ ఇలాకాలో మనిషి!" అన్నాను

టైగర్ దగ్గర అలాంటి వాళ్ళు ఎవరూ లేరే" అన్నాడు అమ్మ దీంతస్సదియ్యా! ఎంత టోకరా వేసింది దీని సంగతి ఏమిటో ఆరా తీయాలి అని ఇలా నీ దగ్గరకు వచ్చాను

చింటూ అతని మాటలు పూర్తిగా వింటున్నట్లు లేదు అతని కళ్ళు పక్కన వున్న చిన్న కొండపైకి కేంద్రీకృతమై వున్నాయి

కొండ మీద సమతల ప్రదేశంలో ఒక యువతీ యువకుడు నుల్చునివున్నారు వాళ్ళిద్దరూ చాలా దగ్గరగా నుల్చుని వున్నట్లు అనిపించింది చింటూకు

'తమ్ముడూ! రాణిని పోలీసులు పంపించారని నాకనుమానం ఆరుముగం మాటలు చెవిని పడగానే కొండ మీదకు పరిగెత్తాడు చింటూ!

రాణి, సారంగపాణి కొండ మీద కలుసుకుంటూ వుంటారని చెప్పింది మణి! నిజం ఏమిటో తేలిపోవాలి!

రాణిని పోలీసులు పంపి వుంటారని ఆరుముగం అన్నాడు! నిజమేనేమో? లేకపోతే దొంగతనాలు దోపిడీలు మానేసి చదువుకోమని ఎందుకు చెబుతున్నది అది, సారంగపాణి కల్సి గూడెంలో జనం అందర్నీ మార్చేస్తున్నారు!

అందర్నీ పోలీసులకప్పజెప్పి పోలీసులిచ్చే బహుమానం , వాళ్ళిద్దరే పుచ్చుకోవచ్చని ప్లాన్ కాబోలు!

గూడెం ప్రజలెంత పిచ్చివాళ్ళు! గొర్రెలు కసాయిని నమ్మినట్లు వాళ్ళు రాణి మాటలు నమ్మారు!

చింటూ మనసు అనుమానంతో, ద్వేషంతో నిండిపోసాగింది!

కొండ మీదకు వేగంగా పరిగెత్తుకుంటూ ఎక్కాడు గాబోలు రొప్పు రాసాగింది కండ్ల ముందు ఏదో నీటి పొర ఆవేశం వల్ల కాబోలు కమ్మింది!

రాణి, సారంగపాణి దగ్గర దగ్గరగా కూర్చొని ఏమిటో కబుర్లు చెప్పుకుంటున్నారు

వాళ్ళు చింటూ రాక చూడనేలేదు ప్రేమ పైత్యంలో మునిగి వున్న వారికి నేను కనబడతానా?" అనుకుంటూ వారి ముందుకు వెళ్ళి నుల్చున్నాడు చింటూ

'ఓ! చింటూనా! రా!' అంది రాణి

"నీ సంగతే చెప్పుకుంటున్నాం అన్నాడు సారంగపాణి! వాళ్ళ మాటలు వినిపించుకోనట్లు రాణి వంక చూస్తూ-

'ఎవరు నువ్వు? అని గద్దిస్తూ అడిగాడు చింటూ

"ఏమిటి అలా అడుగుతావు? కనపడ్డంలా! మనిషిని! అంది రాణి నవ్వుతూ నువ్వు పైకి కనిపించే మనిషివి కావు! నీ పేరేమిటి? ఇక్కడకెందుకొచ్చావు?"

ఏమిటి చింటూ ఆ మాటలు! రాణి నీ ప్రాణాలు కాపాడిందన్న సంగతి మర్చిపోయావా?' కోపంగా అన్నాడు సారంగపాణి

'బతికించిందిలే! పోలీసులకప్పజెప్పి బహుమానం పొందుదామన్న దురాశతో!

చింటూ ఏమిటి నువ్వనేది! పోలీసులకప్పజెప్పదయితే ప్రాణాలొడ్డి అష్టకష్టాలు పడి నిన్ను మధుర తీసుకు వెళ్ళి బతికించుకోవాల్సిన ఖర్మమేం వొచ్చింది? స్పృహలో లేని నిన్ను పోలీసు స్టేషన్‌కు తీసుకొని వెళ్ళి అప్పజెప్పేదిగాదా?

"ఒరేయి సారంగం! నేను దాన్ని ప్రశ్నలు అడుగుతుంటే మధ్య నువ్వు సమాధానం చెబుతావేరా? రుచి మరగిన కుక్క తెగ నాకుతుందన్నట్లు దాన్ని వెనకేసుకు వస్తున్నావ్

"ఏమిటిరా కూసావ్! నన్నెన్నయినా అను పడుతా కాని రాణినేమీ అనకు! అన్నావో నీకు మాట దక్కదు"

అంటాను! మరీ అంటాను! మీ యిద్దరి మధ్యా ఏమీ లేకపోతే ఎందుకు అలా వుక్రోషపడిపోతావ్!'

రేయ్ మాటలు జాగ్రత్తగా రానియ్" అంటూ చింటూ చొక్కా పుచ్చుకున్నాడు సారంగపాణి

సారంగపాణి మెడ మీద పిడికిలితో బలంగా గుద్ది అతను కింద పడిపోగానే బొడ్లోంచి కత్తి తీసి పొడవటానికి చెయ్యి పైకెత్తాడు చింటూ

"ఆగు చింటూ! ఏమిటి నువ్వు చేస్తున్నది అంటూ రాణి వచ్చి అతని చేతిని పట్టుకుంది

ఒక్క క్షణం ఆగి "రంకు మొగుడంటే ఎంత యిదే నీకు అన్నాడు వెటకారంగా చేయి గుంజుకుంటూ

సారంగపాణి చింటూ పట్టు తప్పించుకుని లేచి నిలబడి చింటూ దవడలు రెండూ వాయించసాగాడు చింటూ చేతిలోని కత్తి వెళ్ళి అవతల పడిపోయింది

సారంగపాణి ఆవేశంగా చింటూను ఎడాపెడా తంతూనే వున్నాడు చింటూ కింద పడి దొర్లుతూ కత్తి చేతిలో దొరక పుచ్చుకుని ఒక్క వుదటున లేచి సారంగపాణిని పొడవటానికి వెళ్ళాడు

చింటూ' అంటూ అడ్డం వెళ్ళిన రూప ఎడమ భుజంలో కత్తి దిగబడి రక్తం చిమ్మసాగింది

రూపకు కత్తి దెబ్బ తగిలి కింద పడిపోవటం చూసి చింటూ చల్లబడిపోయి కొండ మీద నుండి కిందకు దిగి వెళ్ళిపోయాడు!

సారంగపాణి రూపను భుజం మీద వేసుకుని కొండ కిందకు తీసుకు వచ్చాడు

రూపను మంచం మీద పడుకోబెట్టారు పంచె చించి గాయం మీద కట్టు కట్టాడు సారంగపాణి రక్త ప్రవాహం ఆగలేదు గూడెంలో చిన్నా, పెద్దా తేడా లేకుండా అందరూ వచ్చి రూప చుట్టూ గుమి గూడారు

చింటూ ఈ పని చేసాడని వినగానే అందరూ ఒకే మాటగా అతన్ని తిట్టసాగారు

రక్తస్రావం అధికమయిన కొద్దీ రూప ముఖం కళ తప్పిపోసాగింది కొద్దిసేపట్లోనే రూప స్పృహ కోల్పోయింది

ఆడవాళ్ళు కొందరు సన్నగా ఏడ్పు మొదలెట్టారు టవున్‌లోని ఆస్పత్రికి తీసుకు వెళదాం అన్నాడు సారంగపాణి గొంతు పెగల్చుకుని

అవును వెళ్దాం! అని అరిచారందరూ రూప పడి వున్న మంచం మోస్తూ గూడెం ప్రజలు యావన్మందీ బయలుదేరి వెళ్ళారు ఆస్పత్రికి సెలైన్ పెట్టాక స్పృహ వచ్చింది

కొండ మీద నుండి కాలు జారి పడితే భుజానికి రాయి గుచ్చుకున్నది అని చెప్పింది రూప ఆస్పత్రిలో డాక్టరుగారికి

రక్తం బాగా పోయింది! ఎవరైనా రక్తం ఇస్తే బాగుంటుంది" అన్నారు డాక్టరు బయటకు వచ్చి

'నేనిస్తా అంటే నేనిస్తా' నని ముందుకు వచ్చారు వొకర్ని తోసుకునొకరు

రక్తం డొనేట్ చేయటానికి అంత మంది పోటీ పడి రావటం ఎప్పుడూ చూడని డాక్టర్ ఆశ్చర్యపడిపోయాడు కాని పరీక్ష చేసి చూస్తే వారిలో ఎవరి రక్తమూ బి నెగిటివ్ కాదు!

ఎలాగ? మీలో ఎవరి రక్తమూ యీమెకు సరిపడదు అని డాక్టర్ అంటుంటే వాళ్ళ ముఖాలు వెలా తెలా పోయాయి

'డాక్టరుగారూ! బహుశ నా రక్తం పనికి వస్తుంది' అంటూ తల దించుకుని వచ్చి నుల్చున్న చింటూని చూడగానే గూడెం ప్రజలందరకూ కళ్ళు చెమర్చాయి! అప్పటి వరకూ వారందరకూ చింటూ అంటే విపరీతమైన కోపం ఏర్పడి వున్నది ఇప్పుడతను అపరాధం చేసినవాడిలా అలా తల దించుకుని నిలబడటంతో వారికి అతని మీద కల్గిన కోపం చాల వరకూ పోయింది!

చింటూ వంట్లోంచి తీసిన రక్తం రూపకు ఎక్కించాడు డాక్టర్ గాయాన్ని శుభ్రపరచి కుట్లు వేసాడు అదృష్టవంతురాలు! కొంచెం వుంటే పెద్ద రక్తనాళం తెగేది వెంటనే బి నెగిటివ్ రక్తం దొరికి ట్రాన్స్ఫ్యూషన్ యివ్వడంతో గండం గడిచి బయట పడింది అన్నాడాయన (ఇంకా ఉంది)

# సూర్యుడికొక సోదరుడున్నాడా?

గ్రహ గమనం ఆధారంగా మానవులు తమ జాతకాలు రాయించుకొంటారు. వివిధ గ్రహాల లేదా ఉపగ్రహాల లేదా తదితర ఖగోళ దేహాల ప్రభావం మానవుల మీద ఉందని ఆస్ట్రాలజీ బావిస్తుంది. అయితే ఇందులో ఎంత నిజం ఉంది ?

ఇటీవల కాలంలో శాస్త్రజ్ఞుల దృష్టికి కొన్ని విశేషాలు కనబడసాగాయి విశ్వదేహాలు (సూర్యుడు,చంద్రుడు నవగ్రహాలు కాక తోక చుక్కలు, సూదూరంలోని తారలు, ఉల్కలు మొదలయినవి) ప్రభావం జీవజాతుల మొత్తం మీద ఉందని క్రమంగా అవగాహన అవుతోంది. మొత్తానికి జీవజాతుల జాతకాలని గత కోట్లాది సంవత్సరాల నుంచి ఇవి నిర్ణయిస్తున్నాయా అనిపిస్తోంది.

గత 600 మిలియన్ సంవత్సరాలనుంచి ఈ భూమిమీద అనేక జీవరాసులు మనగల్గాయి, మనగల్గుతున్నాయి. వీటిలో కొన్ని "గట్టిపిండాల వంటివి ఉన్నాయి. బొద్దింకలు, లేటిమేరియా చేపలు, పెరిపేటస్ అనే చిత్రమైన ఆర్త్రోపడజీవి లాంటివి కొన్నికోట్లాది సంవత్సరాలు డార్విన్ సిద్ధాంతాన్ని వ్యతిరేకిస్తున్నట్లుగా ఏ విధమైన మార్పులేకుండా జీవిస్తున్నాయి. మరి కొన్నిజాతులు లేదా సమూహాలుకు ఆ అదృష్టం లేదు. కొన్నికోట్ల సంవత్సరాలు మంచి ప్రభతోనే వెలుగొందుతాయి' వాటి కాలం తీరాక సమూలం నాశనం అయిపోతాయి. అంటే శాస్త్రరీత్యా విలుప్తం అయిపోతాయి.

డయనోసార్‌ల విషయం ప్రత్యేకంగా గమనించదగింది. సుమారు 20 కోట్ల సంవత్సరాల వెనక ఆరంభమయి. 6,7 కోట్ల సంవత్సరాల వెనక వరకు అంటే 13 కోట్ల సంవత్సరాలు భూమిని అజేయంగా పరిపాలించాయి. కొన్ని డైనోసార్‌లు అత్యంత భయంకరాకారాలు కలిగినవి. 25-30 మీటర్ల పొడవుండే ఇవి ఈనాటి ఏనుగులను సునాయాసంగా చంపగలిగేవి. ఒక డజను పెద్దపులుల శక్తి సామార్ధ్యాలు ఒకే జంతువులోఉంటే? అలాటి ఈ జీవరాసులు ఏ కారణం చేతనో అకస్మాత్‌గా విలుప్తమయ్యాయి.

అనుకోని విధంగా దీనికి ఖగోళ శాస్త్రజ్ఞులు సమాధానం చెపుతున్నారు. ఇందంతా సూర్యుని జంట తార ప్రభావం అంటారు. ఇంతకీ ఆ ప్రభావం ఎలా ఉంటుంది?

26 మిలియన్ సంవత్సరాల కొకసారి తోక చుక్కలేంటి, ఉల్కలేంటి లేదా కొన్నికిలోమీటర్ల నిడివిగల అంతరిక్ష శకలాలు అనండి భూమి మీద వర్షిస్తున్నాయి అంటున్నారు. ఇదేకాని సంభవించిన పక్షంలో భూమి ధూళితో కప్పబడి అంధకారం అలముకొంటుంది. వాతావరణంలో కార్బన్‌డయాక్సైడ్ ఎక్కువై ఉష్ణోగ్రత పెరిగి పోతుంది. ఒక విధంగా ఈ నాటి గ్రీన్‌హౌస్ ప్రభావం కనబడుతుంది. జీవరాసులకు బ్రతుకు దుర్భరమై పోతుంది.

శాస్త్రజ్ఞులకు కుతూహల కరంగా ఉండి, తికమక కల్గించే విషయం ఒకటి బయటపడింది. చికాగో విశ్వవిద్యాలయంలో ఇద్దరు శాస్త్రజ్ఞులు దీనిని గుర్తించారు. 247 మిలియన్ సంవత్సరాల వెనక, 220 మిలియన్ సం. వెనక, 65. మి. సం. వెనక మొత్తం భూమిమీద జీవరాశి— ఆయా కాలాలనాటి వాటిలో 95 శాతం సమూలం తుడిచి పెట్టుకొని పోయాయి. ఇదిలా ఉండగా మరోక ఆరు సందర్భాలలో కూడా ఇదే విధంగా జరిగింది. అయితే కొద్ది తక్కువ భయంకరంగా. ఈ సందర్భాలలో 20 నుంచి 50 శాతం వరకు ఆయా నాటి జీవరాసులు ప్రళయానికి బలిఅయి పోయాయి. ఇవి 194, 163, 144, 91, 38, 11 మిలియన్ సంవత్సరాల వెనక జరిగాయి. (పట్టిక చూడండి)

మొత్తం తొమ్మిది ప్రళయాలు కలిపిచూస్తే ఒక ఖచ్చితమైన చక్రక్రమం కనబడింది. ఇది చాలా ఆసక్తి కలిగించే విషయంగా పరిణమించింది. 25–30 మిలియన్ సంవత్సరాలే ఈ విరామం ఎందుకు ఉంటోంది? ఒకసారి ఇది 19 మిలియన్ సంవత్సరాలు అయినా చాలా సందర్భాలలో 26,27 లేదా దానికి రెట్టింపు కాలం 53 మిలియన్ సంవత్సరాలుగా ఉంటోంది. దీనికి కారణం ఎవరుచెప్మా? ఏ శక్తుల ప్రోద్బలం వల్ల ఇది జరుగుతోంది?

సూర్యుడికొక సోదరుడున్నాడనే సిద్ధాంతం ఆరంభమయింది. అయితే ఈ సోదరుడు ప్రస్తుతానికి సుదూరంగా ఉన్నాడు. ఎంతదూరం అంటే 3 ' ట్రిల్లియన్ కి.మీ. ఇంకోలా చెప్పాలంటే ఇది ఒకటికాదు, వందకాదు, 30 వేల కోట్ల కి. మీ.. దూరం. ఇంతకీ అతను కనబడలేదు. కాని పేరు మాత్రం సార్థకంగా ఉండే విధంగా నెమెసిస్ అన్నారు, నెమెసిస్ గ్రీకు దేవతపేరు. శిక్ష విధించే శివుడులాంటి వాడు. భూమి మీద జీవరాసులకు ప్రళయకారుడుగా పరిణమిల్లాడు. సూర్యుని కరుణవల్ల బతుకులు సాగుతూఉంటే ఈ నెమెసిస్ ఆగ్రహానికి నాశన కార్యక్రమం జరుగు తోంది. ఇంతకీ అతను తన ప్రతాపాన్ని

## సూర్యకుటుంబం



ఎలా చూపిస్తాడు. విలయతాండవం ఎలా సంభవిస్తోంది!

సూర్యుని చుట్టే పరిభ్రమిస్తున్న నవ గ్రహాలలో అతి బాహ్యంగా ఉన్న యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోల పరిభ్రమణాన్ని ఈ సూర్యుడే కాక మరొక నక్షత్రంకూడా తన అదుపులో ఉంచుకొంటోందని అనుమానం వచ్చింది. సూర్యుడు కూడా ఒకనక్షత్రమే కదా సామాన్యంగా నక్షత్రాలలో కొన్ని జంట తారలున్నాయి. ఇవి రెండూ ఒకే కేంద్రం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంటాయి. ఇలాగా సూర్యుని జత తారఉందేమోనని రష్యన్ అమెరికన్ శాస్త్రజ్ఞులు అన్వేషణ ప్రారంభించారు. సూర్యునికన్నా చిన్నదిగా సుమారు అయిదో వంతు ఉంటుందని భావిస్తున్నారు. వేలకొద్ది తక్కువస్థాయిలో శక్తిని ఉత్పత్తి చేస్తోంది. పరారుణ (ఇన్ ఫ్రారెడ్) వికిరణ కావడం వల్ల అది మన శక్తివంతమైన టెలిస్కోప్‌లకు కూడా అందడం లేదు. అలాగని దాని ఉనికిని కొట్టివేయలేము కూడా.

ఇక నెమెసిస్ సూర్యుడికి దశమ గ్రహం లాంటిది· అయితే అన్ని గ్రహాల మాదిరిగా సుమారు వర్తులాకారంలోకాక తన ప్రయాణాన్ని సుదీర్ఘ వృత్తీయ పద్ధతిలో జరుపుకుంటుంది ఈ ప్రయాణం ఒక చుట్టుకు 26. 27 మిలియన్ సంవత్సరాల కాలం పడుతుంది పోనీ ఇదేదో సజావుగా జరిగే వ్యవహారమా అంటే కాదు. కందిరీగల పుట్టని రేపినట్లు ఈ తోకచుక్కలలో తన ఆకర్షణ శక్తివల్ల కలతలు రేపుతాడు కనీసం వందైనా ఒక్కసారి లేచి ప్రయాణించి సూర్యకుటుంబ ప్రవేశంచేస్తాయి కొన్నైనా మన భూమిని తాకుతాయి అత్యంత వేగంతో ఢీకొని, భూమి మీద విపరీతమైన కలవరం ప్రళయ రూపంలో సంభవింపచేస్తాయి ఈలాంటి సంఘటన ఉదాహరణకు 65మిలియన్ సంవత్సరాల వెనక జరిగింది. ఒక బ్రహ్మాండమైన తోకచుక్క భూమిని తాకినందువల్ల అతి దట్టంగా ధూళిరేగి ఈ గోళాన్ని ఆవరించింది ఈ పరిస్థితులు కనీసం 5,6 సంవత్సరాలు ఉంటాయి· సూర్యరశ్మికి ఆటంకం ఏర్పడి మొక్కలు, తద్వారా జంతువులు మరణించిపోయాయి

అయితే దీనికి ఆధారాలు ఏమిటి ? 1908లో సైబీరియాలో ఒక తోకచుక్క తాకిడికి అరణ్యాలు తుడిచిపెట్టుకొని పోయాయి. వాతావరణంలో అత్యధికంగా దుమ్ము ధూళి వ్యాపించింది. కిరణ జన్య సంయోగక్రియ స్తంభించి పోయింది.

దానిద్వారా విషపూరిత లోహాలు కూడా వర్షించినట్లు చెబుతారు.

చంద్రుడిమీద ఉల్కలు లేదా తోకచుక్కల ధాటికి ఏర్పడిన క్రేటర్‌లు అనే గోతులను పటాలలో చూసే ఉంటారు భూమిమీద కూడా అలాంటి క్రేటర్ ఏర్పాటు జరుగుతూనే ఉంది. కాని భూమిమీద అనేక శక్తులవల్ల వాటి స్వరూపం చెడిపోతుంది. చంద్రుడిమీద ఆ శక్తులు లేవు కాబట్టి అవి శాశ్వతంగా ఉండిపోయాయి

1980లో ఇటలీలో ఒక ఖనిజరాయి లభ్యమయింది. ఇది సముద్ర అడుగున 65 మిలియన్ సంవత్సరాల నాటి భూమిపొరలలో దొరికింది· దీనిలో ఇరిడియమ్ అనే మూలకము చాలా అధికంగా ఉంది. మళ్ళీ ఆపై పొరల్లో ఇది కనబడలేదు. అదే రీతిలో పసిఫిక్, అట్లాంటిక్ మహా సముద్రాలలో కూడా అదే కాలానికి చెందిన భూమిపొరల్లో ఇదిలభ్యమైంది. ఈ మూలకము మన గోళం మీద అరుదు... అయితే భూమికాక ఇతర విశ్వదేహాలలోఎక్కువగా కనబడుతుంది. 65 మిలియన్ సంవత్సరాల వెనక ఒక బ్రహ్మాండమైన తోకచుక్క నేలను తాకిందనడానికి ఇది నిదర్శన.

పై చెప్పిన లెక్కలే రైటైతే మనం రాబోయే ప్రమాదం గురించి ఇప్పుడే అంత బెంగ పడనక్కరలేదు. ఎందువల్లనఅంటే గత ప్రళయం మిలియన్ సం. వెనక జరిగింది కాబట్టి మరొక 15 మి.సం. వరకూ బాధలేదు. కాని వేలాది చిన్నచిన్న ఆస్టరాయిడ్‌లు అనే శకలాలు, ఉల్కలు తోకచుక్కలు ఊరుకొంటాయా ? ఎప్పటికీ ఇవి ప్రమాదకరమే

అందువల్ల అప్పుడే 'నాసా' సంస్థ అమెరికాలో కోట్లాది రూపాయల ఖర్చుతో చర్యలు తీసి కొంటోంది. అలా అంతరిక్షంలోకి బలమైన టెలిస్కోప్‌లతో చూస్తూ ఉంటే భూమిని ఢీకొనడానికి వచ్చే అంతరిక్ష దేహాలను ముందే గమనించగల్గుతారు. హైడ్రోజెన్ బాంబులను తగిలించిన బలమైన అంతరిక్ష శకటాలను ఉంచుతారు. తగిన సమయంలో భూమిమీద స్విచ్ నొక్కి- దానిని విస్ఫోటనం చేస్తారు. ఆ విధంగా ఆ రాబోయే అవాంతరాన్ని పక్కకి తప్పించివేస్తారుట

మానవుడు పెంపొందించు కొంటున్న శక్తిసామర్థ్యాలు ఎలా వినియోగ పడతాయో చూద్దాం!

**-జిమ్మి కోనేటిరావు**

**పట్టిక**

| | గత సంవత్సరాలు మిలియన్‌లలో | ప్రళయాలు సంభవించిన కాలం మిలియన్. సం. | విరామ కాలం మిలియన్ సం. |
|---|---|---|---|
| 0 | | | |
| 25 | ~~0~~ | 11 | 27 |
| 50 | ~~25~~ | 38 | 27 |
| 75 | ~~50~~ | 65 | 26 |
| 100 | ~~75~~ | 91 | |
| 125 | ~~100~~ | | 53 |
| 150 | ~~125~~ | | |
| 175 | ~~150~~ | 144<br>163 | 19 |
| 200 | ~~175~~ | | 31 |
| 225 | ~~200~~ | 194 | 26 |
| 250 | ~~225~~ | 220 | 27 |
| 275 | ~~250~~ | 247 | |
| 300 | ~~275~~ | | |
| | 300<br>↓<br>600 మి.సం. | సమాచారం లభ్యం కాలేదు. | |

# బూచాళ్ళాయి!

సి.వి. సర్వేశ్వరశర్మ
సి. యస్. సోమయాజులు

'అమ్మా! అన్నం పెట్టండి తల్లీ' అరుస్తున్నాడు చిక్కగా అలుముకున్న చీకటిలోంచి దూరం నుండి దూసుకు వస్తున్న అరుపు

'వచ్చేశాడు బూచాడు!' అమ్మమ్మ అమ్మతో అంటోంది తను వినాలని

ఏం చేస్తాడు అమ్మమ్మా! బూచాడు?" తను అడిగింది

'అల్లరి చేసిన వాళ్ళను తన సంచిలో వేసుకెళ్ళిపోతాడు పగలు అన్నం తినడానికి పేచీ పెడితే రాత్రికి వాడు తెలుసుకుని వస్తాడు' అమ్మమ్మ చెబుతోంది

పెద్ద కళ్ళు చేసుకుని తను వింటోంది

అమ్మ తన పనిలో ఉంది

అమ్మమ్మను తను కౌగలించుకుని ఉండిపోయింది

అమ్మమ్మ వాళ్ళింటికి వెళ్ళిపోయింది

అన్నం తినడానికి మారాం చేస్తే అమ్మ బూచాడి గురించి జ్ఞాపకం చేసేద

అమ్మా నాన్నతో సినిమాకు వెడితే

బూచాడు ఎదురయితే నాన్నగారు తన్నేస్తారు

అమ్మ చెప్పేది తను వినేది

రోజులు గడిచే కొద్దీ ధైర్యంగా బయట తిరిగి రావాలని ఉండేది.

అవసరాన్ని బట్టి అమ్మ మాట్లాడేది కాదు

ధైర్యంగా వెళ్ళి వీధి దీపాల కాంతిలో చక్కగా తిరిగి రాగలిగేది

అప్పుడు కూడా 'అమ్మా! అన్నం ' కేక వినబడితే గుండె గతుక్కుమనేది తనకు

పదేళ్ళ వయసు వచ్చేసరికి తల్లి నిచ్చెన మీద ఎటో వెళ్ళిపోయింది.

నాన్న కళ్ళల్లో నీళ్ళు తనకు బాగా గుర్తుకు వస్తాయి తర్వాత తెల్సింది అమ్మ ఇంక తిరిగి రాదని. తన కోసం నాన్న మళ్ళీ కొత్త అమ్మను తీసుకు రాలేదు

అమ్మమ్మ కొన్నాళ్ళుంది. అకస్మాత్తుగా ఆవిడ అమ్మ వెళ్ళిన చోటుకే వెళ్ళిపోయింది

అమ్మమ్మ పెంపకంలో తను నేర్చుకున్నది

మగాళ్ళు చాలా మంది బూచాళ్ళే

ఒక్కడే యువరాజు

అతడే పెళ్ళికొడుకు

తను చదువుకుంది అమ్మమ్మ మాటలు అప్పుడప్పుడు జ్ఞాపకం వస్తే తనకు భలే నవ్వు వస్తుంది

తనకేసి ఎంతో తృప్తిగా చూసుకుని సంతోషించే నాన్నంటే తనకు చాలా ఇష్టం

నాన్న రైల్వేలో ఇప్పుడు సీనియర్ ఎకౌంట్సు ఆఫీసరు దేనికి లోటు లేదు అమ్మలేని లోటు తప్ప ఎమ్ ఎ పాసయిన తనకి మంచి సంబంధం చూసి యువరాజును తీసుకు వచ్చారు నాన్న

యువరాజు ఇంజనీరు హైదరాబాద్‌లో ఉద్యోగం చిన్ననాటి నుండి పెరిగిన విశాఖను, పెంచిన నాన్నను వదలి యువరాజుతో వెళ్ళాలంటే మనసులో ఏదో తెలియని శూన్యం

యువరాజు తనను యువరాణిగా చూసుకున్నాడు

తెల్లచీర మల్లెపువ్వు మూడునెల్లు విరబూసి విహరించాయి

నాన్న వచ్చారు సరదా పడింది యువరాజు వెళ్ళమన్నాడు విశాఖ వచ్చింది త్వరగా తిరిగి రావాలని చెవులో రహస్యంగా యువరాజు చెప్పాడు

అతని రహస్యం చెవులో 'చెప్పినా గుండెల్లో గ్రుచ్చుకున్నాయి ఆ మాటలు

పది రోజులు విశాఖలో గడిపింది తను హైదరాబాద్ యువరాజు దగ్గరకు వెళ్ళిపోవాలి కొత్త పెళ్ళికూతురు కోరింది.

నాన్న ఏం మాట్లాడలేదు ఏదో బాధ పడుతున్నట్టు కన్పిస్తున్నాడు. ఎదురుగా కూర్చుని ఏమిటన్నట్టు చూసింది తను

మెల్లిగా నాన్న చెప్పాడు అర్జంటుగా మర్నాడు క్యాంపుకు వెళ్ళాలని.

గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కిస్తే తను హైదరాబాద్ వెళ్ళగలనని తండ్రిని ఒప్పించింది. అల్లుడు యువరాజుకి టెలిగ్రాం ఇస్తే స్టేషన్‌కు వస్తారని చెప్పింది.

'రిజర్వేషన్ దొరకదు ఎలా?'

'ఏదోలా ప్రయత్నించాలి తప్పదు' తను ఒత్తిడి చేసింది ఎమ్ ఎ చదివిన అమ్మాయి ఆ మాత్రం ప్రయాణం చేయలేదా?

తను వేసిన ప్రశ్నకు తండ్రి మారుమాటాడకుండా ప్రయాణానికి అంగీకరించాడు

ఫస్ట్‌క్లాసులో ప్రయాణం తనకు ఇష్టం లేదంది. తన కోరికను కాదన లేని నాన్న టికెట్ కొని స్పాట్ రిజర్వేషన్. ఏదో టికట్ కాన్సిలయితే సంపాదించాడు,

నాన్న పెద్ద ఆఫీసరు, మంచివారు కావడం వల్ల పరపతి నుపయోగించి క్రింద బెర్తు తనకు వచ్చేటట్టు చూశారు

నాన్నకు తను ఇలా ఒంటరిగా వెళ్ళడం ఇష్టం లేదు చాలా జాగ్రత్తలు చెప్పారు యువరాజు దగ్గరకు వెళ్ళే సంబరంలో నాన్న చెప్పే జాగ్రత్తలన్నీ అజాగ్రత్తగానే వింది తను

రైలు బయలుదేరింది వేగం అందుకుంది చప్పుడు తమాషాగా వినిపిస్తోంది ఊళ్ళు వెనక్కి వెళ్ళిపోతున్నాయి

వెలుగు కూడా క్రమంగా తగ్గిపోతోంది

రైలు పెట్టిలో లైట్లు వేశారు

పాత విషయాలన్ని గుర్తుకు వచ్చిన అరుణకు ఎందుకో ఒక్కసారి భయం ఆవరించినట్లయింది

చీకటి పడుతోంది ఎదురు బెర్తు ఖాళీ

తన ప్రపంచంలో తనుంది ప్రక్క సీట్లో మామ్మగారు ఉన్నారు అరుణ ఆమె వైపు చూసింది

మామ్మగారు కాస్త కలివిడి స్వభావం గలవారులా ఉన్నారు మాట కలిపారు పేరు ఊరు మంచి చెడ్డలు వాయించేశారు కాలక్షేపంగా ఉంటుందని తనూ సరదా పడింది

మామ్మగారితో నిడదవోలు వరకూ కాలక్షేపం ఉంటుంది రాజమండ్రీ వచ్చింది ఎదురు సీటులో ఆరడుగుల మనిషి బెడ్డింగు పరుస్తున్నాడు తను చూసింది కాని మామ్మగారి కబుర్ల హడావడిలో ఉండిపోయింది

రైలు కదలింది మాటల సందడిలో నిడదవోలు వచ్చేసింది ఎన్నో జాగ్రత్తలు చెబుతూ మామ్మగారు రైలు దిగింది

బెర్తు మీద పడుకుంది ఏమి చెయ్యాలో తోచటం లేదు మొదటిసారి యువరాజుతో హైదరాబాద్ వెళ్ళినపుడు ఎన్నో మధురమైన మాటలతో హృదయాలు పరస్పరం కలుపుకుంటూ అదొకరకమైన హాయితో నిండిన ప్రయాణం

ఇప్పుడు ఈ ప్రయాణం ఆ హాయి వస్తుందని చేస్తోంది ఏదో పుస్తకం చదువుతున్నట్టు నటిస్తోంది కళ్ళయితే పుస్తకం వైపు ఉన్నాయి ఆలోచనలు ఎప్పుడో హైదరాబాద్ వెళ్ళిపోయాయి

ఉన్నట్టుండి ఎదుటి బెర్తు వైపు చూసింది ఆరడుగుల మనిషి నల్లటి గెడ్డం మెలి తిరిగిన కండలు పెద్ద పెద్ద కండ చీమల్లాంటి కళ్ళు తనకేసి చూస్తున్నాయి

గుండె ఆగినంత పనయింది

తన శరీరాన్ని ఎక్సురే కళ్ళతో చూస్తున్నాడు

వాడి ముఖం చూస్తే ఎంతటి పనినైనా ఆలోచించ కుండా చేసేస్తాడని అనిపించింది

రెప్ప వాల్చకుండా తన వైపు చూస్తున్నాడు

అరవాలనిపించింది

రైలు చప్పుడులో ఎవరకు వినిపిస్తుంది

బయట చాలా చీకటి, రైలు కూత నక్కకూతలా వినిపిస్తోంది తనకు.

ఏక్షణాన తనను అతడు ఏం చేస్తాడో?

చదువుతున్న వీక్లీ కొంచెం ప్రక్కకు తప్పించి చూసింది

తాళం చెవుల రింగులో బహుశా చాకు అయి ఉంటుంది కన్పించింది. తల క్రింద బెడ్డింగ్ చొరుగులో మెరుస్తూ ఉన్నట్లు ఏదో గుర్తించింది.

అదేమిటో ? ఈ రాత్రి వీడి వల్ల గండం ఉందేమో? భయం భయంగా ఉంది.

కాలు దగ్గరకు ముడుచుకుందా మనుకుంటోంది. కాళ్ళు స్వాధీనంలో ఉన్నట్లు లేవు.

మధ్యమధ్యలో రైలు పెట్టె ఉయ్యాలా ఊగినట్లు ఊగుతోంది.

బెడ్డింగు చొరుగు లోంచి సీసా బయటకు లాగాడు. మూత తిప్పాడు. తను స్పష్టంగా చూస్తోంది. సినిమాల్లో చూసింది. తనకు గుర్తు అది విస్కీ సీసా. విస్కీ త్రాగుతున్నాడు.

తనకు దిక్కెవరు. ప్రక్క వారెవరితోను పరిచయం లేదు. నాన్నను ఒప్పించింది. ఎమ్. ఎ. ఎందుకొచ్చిన చదువు. తను ఆడపిల్ల అబల. మారాం పెట్టింది.

అందుకే అమ్మమ్మ ఏనాడో చెప్పింది.

బూచబ్బాయిగా బూచాడు వచ్చేశాడు.

తనకీ శాస్తి జరగాలి. అనుభవించాలి. తనని తను నిందించుకుంటోంది.

బూచబ్బాయి త్రాగాడు చాలా గట్టిగా దగ్గాడు నవనాడులు కృంగిపోతున్నాయి.

రైలుకు ప్రాణం లేదు భయంలేదు అందుకే చీకట్లో ఎందరో ప్రాణులను తనతో నిర్భయంగా తీసుకెళ్ళి పోతోంది యువరాజుకు తనింక ఉండదు తన బ్రతుకు అయిపోయింది.

కళ్ళు మూతలు పడుతున్నాయి. భయం తరిమేస్తోంది.

ఉన్నట్టుండి రైలు వేగం తగ్గిపోయింది. ఎదుటి బెర్తు మీద బూచబ్బాయి కదలిక వేగం పెరిగిపోయింది. రైలు ఆగింది. బూచబ్బాయి మళ్ళీ సీసా తీసి త్రాగాడుతూలాడు. తను మళ్ళీ ప్రాణాలు కోల్పోయా యన్నంత భయంలోకి దొర్లింది. రైలు కదిలింది.

పక్క ముఖం మీద పడిపోయింది. ముఖం మీద చెమటలు పడుతున్నట్లనిపిస్తోంది. జళ్ళంతా తిమ్మిరిగా స్పృహ కోల్పోయినట్లనిపిస్తోంది.

ఎవరి నిద్రలో వారున్నారు. ఈ శాపం తనకే ఆపద ఎలా వస్తుందో ఊహించ లేక పోతోంది.

బూచబ్బాయి చాకు మీద చెయ్యివేశాడు.

ప్రాణాలు పోయినట్లనిపించింది. కాని నిష్కారణంగా ఈ బూచబ్బాయి చేతిలో పడిందితను.

నిర్భయంగా ఉండాలి. గుండె దిటవు చేసుకుంది. స్పష్టంగా తనకేసే చూస్తున్నాడు. మధ్యలో వెకిలి నవ్వు నవ్వుతున్నాడు.

తన పెట్టె మీద వాడి చూపు ఉంది. వెధవ పెట్టె పోతే పోయింది. తనను ఏమి చేయకుండా వదిలేస్తే బాగుండును.

బూచబ్బాయి దగ్గాడు.

దగ్గుతున్నది బూచబ్బాయి అయినా తనకు ప్రాణాలు పోతున్నంత పనవుతోంది.

చెప్పలేదు భరించలేదు ఈ బాధ తను ఎలా?

గడియారంలో ముళ్ళు వాటి వేగంతో తిరుగుతున్నాయి. రైలు ఎప్పటిలాగే వెళ్ళి పోతోంది.

విజయవాడ స్టేషన్ దాటిన గుర్తుంది.

భయం ముసుగులో తెలీకుండా సుఖమెరుగని నిద్ర ముంచేసింది.

రైలు ఆగింది. ప్రయాణీకుల కదలికకు మెలుకవ వచ్చింది.

అలలు అలలుగా గుర్తుకు వస్తోంది. తను హైదరాబాద్ వెడుతున్నట్లు జ్ఞాపకం వచ్చింది. రైలు కదలింది.

స్టేషను కాదు. సిగ్నల్ ఇవ్వక అవుటర్‌లో ఆగింది. స్టేషన్ వచ్చింది. వరంగల్. తనకు తెలీకుండా రెండు మూడు గంటలు నిద్రపట్టింది.

ఏమీ ప్రమాదం జరిగనట్లు లేదు.

బూచబ్బాయి బెర్తు మించి లేచి నుంచున్నాడు. బెడ్డింగ్ చొరుగులోంచి సీసా తీశాడు.

పబ్లిక్‌గా తాగుతాడన్నమాట. వీడిని అదుపు చేసే వారు ఎవరూ లేరన్నమాట మళ్ళీ అరుణకు భయం వేసింది.

బూచబ్బాయి గబగబా అడుగులు వేసుకుంటూ ఫ్లాట్‌ఫారమ్ మీద దిగాడు.

కిటికి తలుపు పైకెత్తింది. ప్లాట్‌ఫారమ్ మీద విద్యుద్దీపాల కాంతి పగటి వెలుతురులా ఉంది.

బూచబ్బాయి నీళ్ల పంపు దగ్గరకు వెళ్ళాడు. సీసాలో నీళ్ళు పడుతున్నాడు.

అరుణలో భయం ఎగిరిపోయింది. ఎంత భ్రమ



# అధిక్షేపం చేసిన ఉపకృతి




అధిక్షేపం చెడ్డ గుణమే. మనం ఎవరినీ అదిక్షేపించి, వారి మనస్సుకు నొప్పి కలిగించకూడదు. ఒకరు మనల్ని అధిక్షేపిస్తే మన మనస్సుకు నొప్పి కల్గినట్లే పైవారికీ బాధ కలుగుతుందని గ్రహించాలి. అయినా కొన్ని సందర్భాలలో బాధ పడడం కూడా మేలు కలిగిస్తుంది. ఆ నొప్పి వల్ల పట్టుదల కల్గి ఘన కార్యాలు సాధించవచ్చు. పెద్దిభట్టు సంపన్న విద్వాంసుని బిడ్డడు. ఎంతో ముద్దుగా పెరిగాడు. తెలివితేటలు, తోడి బాలురతో ఆటల మూలంగా రాణించలేదు. చదువు అబ్బలేదు. పదహారేళ్లకే పెళ్ళి కూడా అయింది. భార్య పన్నెండేళ్లది. అయినా ఆమె తండ్రి చిన్నప్పట్నించీ విద్య బోధించి, సంస్కృతంలో చక్కని జ్ఞానం కలిగేటట్లు చేశాడు. తొలి పండుగకు పెద్దిభట్టు అత్తవారింటికి వెళ్లాడు. అక్కడున్న మూడు రోజుల్లోనూ, అతడు చదువు రానివాడని అత్తవారింట్లో అందరూ గ్రహించారు. భార్య అతణ్ణి చూచి "పాలాశకుసుమం" అని నవ్వి వెళ్ళిపోయింది.

ఊరికి తిరిగి వచ్చాక మిత్రులు, అత్తవారింటి విశేషాలు అడిగారు. తన్ను తన భార్య "పాలాశకుసుమం" అని ప్రశంసించి సంతోషించినట్లు చెప్పగా, తెలివైన మిత్రుడొకడు నవ్వి "పాలాశ కుసుమం అంటే మోదుగు పువ్వు. పువ్వు బాగా ఉన్నా వాసన ఉండదు. ఆ నిర్గంధ కుసుమం లాగే నువ్వు విగ్రహం బాగా ఉన్నా విద్య శూన్యమని అధిక్షేపించింది. నీవేమో పొగిడిందని అనుకుంటున్నావు" అన్నాడు.

తన భార్యయే తన్ను అధిక్షేపించినందుకు పెద్దిభట్టుకు కోపంతో పాటు పౌరుషం కలిగి, ఎవ్వరికీ చెప్పకుండా కాశీకి వెళ్ళిపోయినాడు చదువు కోసం. అతని కోసం కన్నవారూ, అత్తవారూ కూడా చాలా చోట్ల వెతికి వెతికి నిరాశ చేసుకున్నారు. పెద్దిభట్టు పదేళ్ళు కాశీలో విద్య నేర్చి గట్టి పండితుడైనాడు. తర్వాత స్వదేశానికి వస్తూ, మొదట అత్తవారింటికి వెళ్ళి భార్యకు సమాధానం చెప్పాలని సంకల్పించుకొని, పోలిక తెలియకుండా గడ్డాలు, మీసాలు పెంచుకొని ఒక రాత్రి అత్తవారి ఊరు చేరి, చీకట్లో అత్తవారి యిల్లు చేరి "పర దేశిని. ఈ రాత్రి భోజనం పెడతారా?" అని అత్తగారిని అడిగాడు. ఆమె జ్వరంతో బాధపడుతున్నా "అలాగే" అని కుమార్తెకు వంట పని అప్పగించింది. కూతురు కూర, చారు చేసిందిగాని చారులో ఉప్పు తక్కువ అయింది. వడ్డన చేస్తున్నప్పుడు అత్తగారు దగ్గర కూర్చుని "బాబూ! అమ్మాయి ఎలాగో వంట చేసింది. సర్దుకోండి. చారు బాగుందా!" అని అడిగింది. పెద్దిభట్టు "చారు చారుతరం భాతి, హింగూ జీర సమన్వితమ్, కించిల్లవణ లోపేన పాలాశ కుసుమం యథా" అన్నాడు! ఇంగువ, జీలకర్ర వేసిన చారు చక్కగానే ఉంది. కాని, ఉప్పు తక్కువయినందు వల్ల మోదుగు పువ్వులా ఉంది" అన్నాడు. అప్పుడు, అతని భార్య, తన భర్తయే అని అతన్ని గుర్తించి నిర్ఘాంతపోయింది. ఇన్నాళ్లకు అతడు- మహా విద్వాంసుడై వచ్చినందుకు అంతా సంతోషించారు- అతని భార్య తలవంచుకున్నది.

-బులుసు వేంకట రమణయ్య

---

పడింద తను అన్పించింది.

బూచబ్బాయి తన బెర్తు దగ్గరకు వచ్చాడు.

తన బెర్తు పై బెర్తులో పడుకున్న పిల్లాణ్ణి లేపాడు. వాడు బద్ధకంగా లేచాడు. బూచబ్బాయి బెర్తు మీద కూర్చుని బెడ్డింగులో సామాన్లు సర్దుకుంటున్నాడు.

బూచబ్బాయి తనకేసి చూస్తున్నాడు.

'మంచినీళ్ళు కావాలా?' బూచబ్బాయి అడుగుతున్నాడు.

'వీడి కెంత ధైర్యం' అన్పించింది అరుణకు.

'అక్కర్లేదు' పై బెర్తు మీదున్న కుర్రాడు

## బూచబ్బాయి!

అంటున్నాడు.

అరుణ తెల్లబోయింది.

'రాత్రి ఆవకాయ వేసుకుని అన్నం తిన్నాను. ఎంత దాహం వేసిందో సీసాతో మళ్ళీ నీళ్ళు పట్టాను' బూచబ్బాయి కుర్రాడితో చెబుతున్నాడు.

ఈ సారి అరుణకు మతిపోయింది. బూచబ్బాయికి మెల్ల కన్నుందన్న మాట.

చచ్చిపోయిన అమ్మమ్మ మీద అరుణకు చెప్పలేనంత కోపం వచ్చింది.

పసితనంలో తన మనసులో బూచాడు గురించి లేనిపోని భయాలు కల్పించింది. అవి ముద్రగా నిలచి పోయాయి. ఈ ప్రయాణంలో మానసికంగా భయంతో తానెంత నలిగిపోయింది.

తనకు పిల్లలు పుడితే భయం గురించి చెప్పినా ఈ సమాజంలో ధైర్యంగా బ్రతికే ధైర్యం కూడా వాళ్ళకి నేర్పాలని నిర్ణయించుకుంది.

రైలు కూత కోడి కూతలా కూసింది. చీకటి తొలగి వెలుతురు వచ్చే ప్రయత్నం చేస్తోంది ప్రకృతి తెల్లారుతూ. యువరాజు సన్నిధిని జేరాలని అరుణ ఉవ్విళ్ళూరుతోంది. □

# సమృద్ధ పరిమళము
# సరియైన ధరతో




**ప్రేమ్ - తాజాతనము నందించు సబ్బు.**

"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



జయలక్ష్మీ
గుంటూరు వారి
తయారీ

Imageads-2107 Tel

సీరియల్: **నిశ్శబ్ద సంగీతం**

బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

రాత్రి పదిగంటలైనా అన్నయ్య భోజనానికి రాక పోవడంతో మేడ మీదకి వెళ్ళింది రమ రేణు ఫోటోకి ఎదురుగా నిలబడి చూస్తున్న అన్నయ్యను చూసింది అన్నయ్య పుట్టిన రోజు నాడు రేణు భర్తను అభినందించడానికి పూలచెండుతో వస్తున్న ఫోటో అది తానే తీసింది దాన్ని ఎన్‌లార్జి చేయించి గదిలో పెట్టాడు రమ రాకను గమనించలేదు రఘు అన్నయ్య వెనుక కొన్ని క్షణాలు మౌనంగా నిలబడి,

అన్నయ్యా!' పిల్చింది

వెనక్కి తిరిగి చెల్లెల్ని చూసాడు

'రా! భోజనం చేద్దాం! అంది

'మీరు తినలేదా? అడిగాడు పేలవంగా

ఉహూ అంది

సోఫాలో కూర్చుని 'ఇలా వచ్చి కూర్చో రమా' పిల్చాడు అన్నయ్య పక్కనే కూర్చొంది రమ

'మీ ఒదిన తిరిగి వస్తుందంటావా? చిన్నపిల్లవానిలా అన్నయ్య అలా అడుగుతూంటే దుఃఖం ముంచుకొచ్చింది రమకి జవాబు చెప్పలేకపోయింది

సరిగ్గా ఏడాది క్రితం ఏం జరిగిందో తెల్సా? అన్నాడు ఏదో చెప్పబోయేవానిలా

చెప్పమన్నట్టు చూసింది రమ చెప్పడం మొదలు పెట్టాడు రఘు

మా యూనిట్‌లో జానకిరామం అని ఒక సూపర్వైజరున్నాడు నాకు బెస్ట్ ఫ్రండ్! అతని భార్యని ఎవరో దుర్మార్గులు ఎత్తుకొని పోయారు! ఆమెను పాడు చేసి నెల రోజుల తర్వాత వదిలారు!

అదరిపడింది రమ అయ్యో! అంది

ఆమె భర్త దగ్గరికి తిరిగొచ్చింది!

ఏం చేసాడతను?' ఉత్సుకతో రక్కున ప్రశ్నించింది రమ

అతనేం చేసి వుంటే నువ్ మెచ్చుకొంటావ్? అడిగాడు ఆమె కళ్ళలోకి చూస్తూ

రమ చెప్పడం మొదలు పెట్టింది

'శారీరకంగా స్త్రీ బలహీనురాలు! బలవంతుడైన పురుషుని తుచ్ఛ వాంఛకి బలైంది శీలాన్ని కోల్పోయింది తన అర్ధాంగిని ఎట్టి పరిస్థితుల్లోనూ విడువనని 'నాతిచరామి' అంటూ అగ్నిసాక్షిగా ప్రమాణం చేసి చేపట్టిన పత్నిని పరిత్యజించడం వాగ్దానభంగమే అవుతుంది అది ఉచితం కాదు కూడా! ఆ పరిస్థితిలో ఆ అబల ఎంత సంక్షోభాన్ని అనుభవించిందో! శీలం కోల్పోయిన మగువ మరుక్షణంలోనే ఆత్మాహుతి చేసుకొంటుంది అలా చేయక తిరిగి భర్త ఆశ్రయాన్ని ఆశించిందంటే అందుకు ప్రదాన కారణం ఆమెకు భర్తా పిల్లల మీదున్న మమకార ప్రేమానురాగాలు! భర్త నిరాకరిస్తే దాసిగానైనా వారి గుమ్మంలో పడి వుండి తాను కన్నవారినీ, తాను నమ్ముకొన్న వారినీ కళ్ళారా చూస్తూ శేష జీవితాన్ని గడపడానికి తిరిగి వచ్చి వుంటుంది! ప్రాణ త్యాగానికి ప్రదాన ప్రతిబంధకాలు మమతానురాగాలే అన్నయ్యా! అటువంటి స్త్రీని తిరిగి పరిగ్రహించిన సంస్కారవంతుడైన ఆ భర్త భగవంతునితో సమానం! ఆ ఆదర్శమూర్తిలో భగవంతుని దర్శిస్తుందా పుణ్యవతి అతను తీసుకొన్న నిర్ణయం వారి మధ్య నున్న ప్రేమానురాగాలను ప్రతిబింబింప చేస్తుంది భార్య మీద నున్న మమకారం ఆ మచ్చను మటు మాయం చేస్తుంది! మరి నీ స్నేహితుడేం చేసాడు?' అడిగింది ఆత్రుతగా

'అర్ధాంగి మీద నున్న అనురాగం వల్లనో, లేక పాణి గ్రహణ సమయంలో తాను చేసి ప్రమాణం జ్ఞప్తికి వచ్చో, ఆమెను చేరదీసాడు!'

తేలిగ్గా ఊపిరి వదిలింది రమ

చేతగాని వాడని సంఘం అంటే? అడిగాడు రఘు

సంఘం ఏవిటన్నయ్యా! దాని కెన్నో నాలుకలున్నాయ్! ఎటు బడితే అటు మాట్లాడుతుంది నాలుగు రోజులు పోతే మామూలే! అయినా యిది వ్యక్తిగత వ్యవహారం! సంఘాన్ని సంప్రదించాల్సిన అవసరం లేదు! ఎవరి నిర్ణయం వారిది సంస్కార వంతులెప్పుడూ సరైన నిర్ణయాన్నే తీసుకొంటారు ఆ నిర్ణయం ఉదాత్తమైందీ వున్నతమైందీ కాబట్టి అంతా ఆమోదించి హర్షించాలి!అటువంటి వుత్తమోత్తమునికి స్త్రీ లోకం అభివాదం చేస్తుంది వేనోళ్ళ కీర్తిస్తుంది నివాళులర్పిస్తుంది చెప్పన్నయ్యా! మీ స్నేహితుడేం చేసాడు?నిర్దయగా నిరాకరించాడా? అభిమానించి అర్ధాంగిగా [illegible]? ఆమెకు నూతన జీవితాన్ని ప్రసాదించాడా?

అనుమానంగా మరో సారడిగింది

నీవాశించిన విధంగానే ఆమెను అర్ధాంగిగా స్వీకరించాడు!' చెప్పాడు

'చాలా సంతోషమన్నయ్యా! ఆ అమృత మూర్తిని ఓ సారి దర్శించి మహిళా లోకం తరఫున కృతజ్ఞతలు తెలుపుకోవాలనుంది!" సంబర పడింది రమ కానీ అన్నయ్య నయనాలు అశ్రుపూరితాలు కావడంతో కంగారు పడింది

"ఏమన్నయ్యా? ఏమైంది? అలా వున్నావేం? అడిగింది

తనకొచ్చిన వుత్తరం విషయం, టెలిగ్రాం సంగతీ, తాను చేసిన ప్రయత్నాలూ అంతా వివరించాడు రఘు

రమకి నోట మాట రాలేదు కన్నీరు నింపుకొంది

ఏనాడో ఆలుమగల్ని వేరు చేసి ఆనందించి వుంటా! ఇప్పుడు నాకీ శిక్ష విధించాడు భగవంతుడు!'

**జరిగిన కథ-11:** రేణుని తనొక బ్రోతల్ హవుస్‌లో కలియడం తటస్థపడిందని, ఆమెను విడిపించే ప్రయత్నంలో రఘుకి సహాయపడగలనని తులసీరాం అనే అతను రాసిన ఉత్తరం అందుకుని విషయం తల్లికి కూడా చెప్పకుండా కంపెనీ పనిమీద బొంబాయి వెళ్తున్నానని చెప్పి బయలుదేరాడు రఘు కానీ రేణుక ఉన్న జైపూర్ ట్రూప్ ఆ ఊరు వదలి వెళ్ళిపోయిందని తెలుసుకున్న రఘు షాక్ తిన్నాడు రఘుకి ధైర్యం చెప్పి అనునయించాడు తులసీరాం. రఘు తిరిగి హైదరాబాద్‌చేరాడు రమ గర్భవతయింది తనకి రఘుని వివాహం చేసుకునే ఉద్దేశ్యం లేదని ఉష రఘుతో చెపుతుంది రేణుకాదేవిని కలిసానంటూ హనుమాన్ ప్రసాద్ అనే అతను లక్నో నుంచి పంపిన టెలిగ్రామ్ చదువుకుని లక్నో వెళ్ళిన రఘుకి ఎప్పటిలా నిరాశే ఎదురైంది వ్యధిత హృదయంతో హైదరాబాద్ చేరుకున్నాడు రఘు

బాధ పడ్డాడు రఘు అతని కను కొలకుల నుండి నీటి బిందువులు జలజలా రాలాయ్ రమ హృదయం ద్రవించింది

'అన్నయ్యా!' అంది

అతను మాటాడలేదు

'ఎవరికీ ద్రోహం చేయని మనస్తత్వం నీది! ఆ భగవంతుడు నీకన్యాయం చేయడన్నయ్యా! రేణు తప్పకుండా తిరిగి వస్తుంది! ధైర్యం చెప్పింది ఓదార్చింది

చెల్లి వైపు ఆశగా చూసాడు రఘు

ఈ విషయం ఎవరికీ చెప్ప కన్నయ్యా! అమ్మకి కూడా!' అంది

* * * * * * * * *

కలకత్తా డైమండ్ హౌస్‌లో రేణుకి తెలుగు వనిత సుజాత తటస్థ పడింది ఆమెతో తన గోడుని విన్నవించుకొంది కనికరించి ఆ విషగుండం నుంచి తప్పించుకొనే మార్గం చూపమంది ఆమె అభ్యర్థనని ఈజీగా తీసుకొంది సుజాత

మొదట్లో కొంత కాలం అలాగే వుంటుంది! ఈ జీవితానికి అలవాటు పడ్డాక వెనుకటి జీవితం వెగటుగా తోస్తుంది నాకూ మొదట్లో అలాగే వుండేది! అంది

కాదు సుజాతా! నా జీవితం వేరు! నీ జీవితం వేరు! నీకు పెళ్ళి కాలేదు! భర్త అనురాగం ఎలా వుంటుందో నీకు పూర్తిగా తెలీదు! దాంపత్య జీవితాన్ని చవిచూడలేదు! కడుపు తీపి అసలే తెలీదు! నన్నెలాగైనా ఈ సుడిగుండం నుంచి తప్పించు చెల్లీ! నేనేం కావాలన్నా యిస్తా!

ప్రాధేయ పడింది.

ఆమె మాటలకి పకాల్న నవ్వింది సుజాత

నీ దగ్గరేవుందని యిస్తావ్?

ఆమె మాటలకి విల విల్లాడింది రేణు

'అలా వేళాకోళంగా మాట్లాడకు చెల్లీ! కన్న కొడుకుని చూడాలని మాతృ హృదయం ఎంతగా పరితపిస్తుందో నీకు తెలీదు! నా బాబుని చూడాలి! స్త్రీకి అతి పవిత్రమైనదీ ఎన్నడూ విడనాడ కూడనిదీ అయిన ఈ మంగళ సూత్రాల్ని నీకు ప్రతి ఫలంగా సమర్పించు కొంటా! తీసుకో!'

మొలలో భద్రంగా దాచిన మంగళ సూత్రాల్ని బయటకు తీసి అందించింది ఆమె మొహంలోకి ఆశ్చర్యంగా చూసింది సుజాత కన్నీరు జలపాతంలా వురకలు వేస్తూ చెక్కిళ్ళ మీద నుండి ప్రవహిస్తోంది సుజాత మనసు చలించింది

"దాంపత్య జీవితంలోని మాధుర్యం నేనింత వరకూ చవి చూడలేదన్న మాట అక్షరాల నిజం! నాకు పిల్లలు లేక పోయినా మాతృ హృదయం నాకు తెల్సు! తన పిల్లలను చూడ్డానికి మాతృ మూర్తి ఎంతటి సాహసానికైనా ఒడిగడుతుంది ఎంతటి ప్రమాదాన్నైనా ఎదుర్కొనడాన్కి సిద్ధపడుతుంది నిన్నీ ముఠా నుంచి తప్పించడాన్కి తప్పకుండా ప్రయత్నిస్తా!" అనునయించి భరోసా యిచ్చింది

'జీవితాంతం నీకు ఋణపడి వుంటా చెల్లీ! నీ పేరు తలచుకొని ప్రతి రోజూ దీపం వెలిగించుకొంటా! పూజా మందిరం లో నీ ఫోటో వుంచుకొంటా!'

ఆమె పాదాల మీద పడింది రేణు

'లే రేణూ! ఎవరైనా చూస్తే కొంప మునుగుతుంది అనుమానం వస్తుంది' తొందర చేయడంతో చివాల్న లేచింది రేణు.

నా ప్రయత్నం నేను చేస్తా! ఆ తర్వాత నీ అదృష్టం! మన బాస్ అనుక్షణం మన మీద నిఘా వుంచుతాడు ఆ విషయం నీకూ తెల్సు! దొరికి పోతే కష్టం! ఎంతటి దుర్మార్గానికైనా ఒడిగడ్తాడు! అయినా నీకోసం సాహసిస్తా! కానీ నాకో అనుమానం! అంది సుజాత

అడుగు చెల్లీ! సంశయించకు!

'నువ్ పతిత వయ్యావ్! నీ భర్త నిన్ను స్వీకరిస్తాడని నమ్ముతున్నావా?'

నాకా నమ్మకం వుంది! మా అనురాగం అలాంటిది!

ధైర్యంగా చెప్పింది రేణు

చిన్నగా నవ్వి అంది సుజాత-

"ఒక విషయం చెబుతా విను! మనం శీలం చెడిన వాళ్ళమనీ పతితలమనీ తెల్సి కూడా మన -ందుకోసం ఎంతో మంది రశికులు వస్తారు! అనుభవించి పోతారు! మళ్ళీ వస్తారు! మన పొందు కోసం తహతహలాడుతున్నారు కదా అని వివాహం చేసుకోమని వారిని అడిగితే మొహం పక్కకి తిప్పు కొంటారు మనం రహదారి పడవల్లాంటి వాళ్ళం! పావలా డబ్బు లిచ్చి అవతలి గట్టుకి పోతారే తప్ప పడవ విషయాన్ని ఎవరూ పట్టించుకోరు! నీ భర్త నిన్ను చేరదీస్తాడని నాకు నమ్మకం లేదు! చీదరించుకొని అవతలకి పొమ్మనొచ్చు! ఈ పాటికి నిన్ను మర్చిపోయి మళ్ళీ పెళ్ళి చేసుకొని వుండొచ్చు! నూతన వధువుతో ఆయన హాయిగా కులుకుతూంటే చూసి నువ్ సహించగలవా? ఆ ఆవేదనను అనుభవించ గలవా? నరక యాతన పడగలవా? అటువంటి దుర్భర జీవితాన్ని గడపలేక ఆత్మహత్య చేసుకొంటావో లేక ఈ విలాస జీవితాన్ని గడుపుతావో ఆలోచించు!

ఒక్క నిమిషం తడబడింది రేణు.



# నిశ్శబ్ద సంగీతం

లేదు సుజాతా! నా భర్త అటు వంటి వారు కాదు! నాకా నమ్మకం వుంది 'నాకు దాంపత్య సుఖం అవసరం లేదు! దాని మీద ఏనాడో విరక్తి కలిగింది వారు నన్ను స్వీకరించడానికి నిరాకరిస్తే ఆ యింట్లో దాసిగా పడి వుంటా! వారినీ నా కొడుకునీ కళ్ళారా చూస్తూ కాలం గడుపుతా! ఆత్మహత్య చేసుకొనే ప్రసక్తి లేదు!"

అంది దృఢంగా

ఆమెకు భర్త మీదగల అచంచల విశ్వాసానికి ఆశ్చెరు వొందింది సుజాత.

మర్నాడు మాట్నీకి కొంత మంది బయలు దేరారు వారిలో సుజాతా రేణూ కూడా వున్నారు వారికి ఎస్కార్ట్‌గా ఇద్దరు రౌడీలు! ఆట మరో అరగంటలో ముగుస్తుందనగా సుజాత లేచి నిలబడింది

"లావెట్రీకి వెళ్దాం సాయం వస్తావా?" హిందీలో తన వాళ్ళ కందరకీ విన్పించేలా రేణూని అడిగింది 'రేణు కూడా లేచింది ఇద్దరూ బయట కొచ్చారు లావెట్రీకి వెళ్తున్నారను కొన్నారు తక్కిన వాళ్ళు తమ నెవరూ గమనించలేదనీ, ఫాలో అవటం లేదని నిర్ధారించు కొన్నారు సినిమా నుంచి బయట పడి టాక్సీలో హౌరా స్టేషను చేరుకొంది రేణు టాక్సీకి డబ్బు చెల్లించి ప్లాట్ ఫారం మీదకి పరుగెత్తింది

అప్పుడే కదలబోతూన్న ట్రైనెక్కింది ఆ ట్రైన్ ఎక్కడకి వెళ్తుందో తనకవసరం లేదు! ఆ నగరం నుంచి దూరంగా పారిపోవాలన్నదే ఆమె ప్రయత్నం

* * * * * * * * * * *

డాక్టర్ ఏ మై ఇన్సేన్?' దూకుడుగా డాక్టరు గారి గదిలో ప్రవేశించి అడిగిందా యువతి

ఏదో పేషంట్ పై కార్డియాలజిస్ట్ యిచ్చిన రిపోర్టును పరిశీలిస్తూన్న డాక్టర్ రామారావు తలెత్తి ఆమెను ప్రసన్నంగా చూసారు కాదన్నట్టు అడ్డంగా తలూపారు

'ఎవరన్నారమ్మా?' అడిగారు అతి శాంతంగా

మరి ఆ పిచ్చి వాళ్ళంతా అలా అంటున్నారు!'

'తప్పమ్మా! పిచ్చి వాళ్ళనకూడదు! పేషంట్లు అనాలి!'

మరి నేను కూడా పేషంటునే కదా! అంటే పిచ్చిదాన్నే కదా?'

ఈ డాక్టరు దగ్గర కొచ్చిన పేషంట్లందరూ పిచ్చి వాళ్ళే కానక్కర్లేదమ్మా!'

'మరి మీరు పిచ్చి డాక్టరే కదా?'

ఆమె మాటలకి చిన్నగా నవ్వు కొన్నారు డాక్టరుగారు

చూడమ్మా! నేను సైక్రాటిస్టునే! కాదనను! అందులో స్పెషలైజ్ చేసానన్నమాట! అంత మాత్రాన నా దగ్గరకి మామూలు పేషంట్లు రారనీ, రాకూడదనీ అనుకో కూడదమ్మా!" వివరించారు అతి శాంతంగా




ఏవిటో అంతా పిచ్చి మాలోకంలా వుంది!"

అమాయకంగా అనేసి వెళ్ళిందామె పక్క ద్వారంలోంచి

వారి మాటలు వింటూ గుమ్మంలో నిలబడ్డ శ్రీపతిగారి హృదయం ఆర్ద్రమైంది

'గుడీవినింగ్ డాక్టర్!' విష్ చేస్తూ ప్రవేశించారు

రండి! రండి!' ఆహ్వానిస్తూ ఎదురుగా వున్న కుర్చీ చూపారు డాక్టరుగారు

ఏమంటుంది మా దేవి?' కుర్చీలో కూర్చుంటూ అడిగారు శ్రీపతిగారు

'ఇప్పుడే వెళ్ళింది!' చెప్పారు

అవును! మీ మాటలన్నీ గుమ్మంలో నిలబడి వింటున్నా!"

"షి ఈజ్ టూ స్మార్ట్ అండ్ సెన్సిటివ్! ఆమె భర్త ఏం చేస్తున్నారు?" అడిగారు డాక్టరు రామారావ్

నిట్టూర్చారు శ్రీపతిగారు

నన్ను క్షమించాలి డాక్టర్! మీతో మొదట చెప్పినట్టుగా ఆమె నా మేన కోడలు కాదు! ఎవరో తెలీదు! అంటూ వివరంగా చెప్పనారంభించారు.

* * * * * * *

ఆ రోజు సాయంత్రం హౌరాలో ఎక్స్‌ప్రెస్ బయలు దేరింది కంపార్ట్ మెంట్సన్నీ ప్రయాణీకులతో కిటకిటలాడుతోంది ఎక్కడా ఆగకుండా స్టేషన్లని వెనక్కి నెట్టుకుంటూ పోతోంది ట్రైన్ రాత్రి కావడం మూలాన అవకాశం వున్న వారంతా నిద్రకుపక్రమించారు ఆ కంపార్టు మెంట్ నిశ్శబ్దంగా వుంది ఒక్క ట్రైన్ చప్పుడు తప్ప

నన్నొదులు! నీకు దణ్ణం పెడతా! నన్ను పోనీ!' తెలుగులో ఓ అబల ఆర్తనాదం విన్పించింది అందరకీ అంతా అటు చూసారు అయితే ఆ భాష అర్థంగాక తెల్ల మొహం వేసారు ఆమె భయపడుతుందనీ, బ్రతిమాలు కొంటోందనీ ఆమె అభినయాన్ని చూసి అర్థం చేసుకొన్నారు ఆ కంపార్టు మెంటులో వున్న శ్రీపతిగారు చివాల్న లేచారు కంపార్టు మెంటులో కాలు కదప డానికి వీలు లేనంత జనం వారిని తప్పించుకొని అతి కష్టం మీద ఆమె దగ్గరకు వెళ్ళారు అప్పటికే ఆ యువతి స్పృహ తప్పి పడింది అంతా జాలిగా చూస్తున్నారు.

ఏమైంది? అక్కడున్న వార్ని హిందీలో అడిగారు

గళ్ళలుంగీ, చారల బనీనూ, కోర మీసాలూ, గుండూ, అచ్చం గూండాలా వున్న ఆ ఆసామి లావెట్రీ నుంచి బయటకు వచ్చాడుట లావెట్రీ తలుపు పక్కనే నిలబడి వున్న ఆయువతి కేకలు వేస్తూ పడిపోయిందిట! జరిగింది చెప్పారు ఎదురుగా నిలబడి ఆమెను జాలిగా చూస్తూన్న ఆ ఆసామిని చూసారు శ్రీపతిగారు అజాను బాహుడు! బలిష్ఠమైన శరీరం! భయంకరంగానే వున్నాడు మరొక స్త్రీ సహాయంతో ఆమెను తన సీటు దగ్గరకి తీసుకెళ్ళారు శ్రీపతిగారు సతీమణి రాజేశ్వరితో కలసి ఆమెకు సపర్యలు చేయనారంబించారు ఆ యువతికి యిరవై సంవత్సరాలుంటాయ్ పసిడిచాయ సన్నగా నాజూగ్గా వుంది అందమైన మొహం! చెవులకి రింగులు తప్ప ఏ ఆభరణాలూ లేవు సంస్కార వంతురాలిలా, ఉన్నత కుటుంబానికి చెందిన దానిలా వుంది కొద్ది సేపటికి తెప్పరిల్లిందామె కనులు విప్పి అందరి వైపూ భయంగా చూసింది

"పాలు తాగమ్మా! ఫ్లాస్కులోని పాలు కప్పులో పోసి అందించింది రాజేశ్వరి ఆమె పాలు అందుకోలేదు భార్యను అనుమానంగానూ, భయంగానూ చూస్తుంటే అనునయించారు శ్రీపతిగారు

తీసుకోమ్మా! పరవాలేదు! ప్రాణం తెప్పరిల్లుతుంది!'

ఆ దంపతులను గుచ్చి గుచ్చి చూస్తూ

'మీకు తెలుగొచ్చా? అడిగిందామె

శ్రీపతిగారు చిరునవ్వు నవ్వి-

మేం తెలుగు వాళ్ళమే! మాది కాకినాడ!" చెప్పారు

'ముందు పాలుతాగమ్మా! పాల కప్పుని మరోసారి అందించబోయింది రాజేశ్వరి

పాలను అందుకొని కప్పులోకి పరీక్షగా చూసి,

"మంచి పాలేనా?" అనుమానంగా అడిగింది

ఆమె అనుమానాన్ని నివృత్తి చేయడానికి ఆ కప్పుని తిరిగి తీసుకొంది

రాజేశ్వరి మరో కప్పులో ఆ పాలని కొంచెం పోసుకొని తాగింది. మిగిలిన పాలను ఆమె కందించింది.

'నేను తాగానుగా! నువ్ కూడా తాగు! మంచివే!"

ఆమె ఆ పాలను అందుకొని తాగింది.

"పడుకొంటావా?" అడిగింది రాజేశ్వరి.

అడ్డంగా తలూపిందామె

"వాళ్ళొస్తే, తిరిగి నన్ను వాళ్ళకప్పగిస్తారా?"

భయంగా అడిగింది

"ఎవ్వరూ రారు! వచ్చినా అప్పగించం! మాతోనే వుందువుగాని! భయంలేదు!" బుజ్జగించింధి రాజేశ్వరి

"ఏవూరెళ్తావమ్మా?" నెమ్మదిగా, సౌమ్యంగా అడిగారు శ్రీపతిగారు

"వాళ్ళకి అందనంత దూరంగా పోతాను! ఈ రైలు ఎక్కడికెళ్తే అక్కడకి పోతా! వాళ్ళొస్తే నన్నప్పగించకండి! ప్లీజ్!"

బ్రతిమాలింది. చేతులు జోడించి కన్నీరు పెట్టుకొంది

"ఏడవకమ్మా! ఎవరొచ్చినా పంపం! మాతోనే వుందువు గాని! సరా! ఊరడించింది రాజేశ్వరి

కొంత స్థిమిత పడిందామె

"మీకు పిల్లలున్నారా?" – అడిగింది

ఆమె ప్రశ్నకి నవ్వుకొన్నారా వృద్ధ దంపతులు

"వున్నారు!" చెప్పాడు శ్రీపతిగారు.

"ఏం చదువుతున్నారు?"

"చదవడం లేదు! పెద్దవారయ్యారు. పెళ్ళిళ్ళయాయ్!"

చెప్పింది రాజేశ్వరి

"అంటే చిన్న పిల్లలు లేరా?"

"లేరు!"

'అయితే రాను!" రకిమని అంది ఆమె.

అవాక్కయ్యారా దంపతులు. శ్రీపతిగారు ఆలోచనలో పడ్డారు భర్త వైపు చూసింది రాజేశ్వరి.

'అదికాదమ్మా మా కంటే చిన్న పిల్లలు లేరు! కానీ మాయింట్లో మా మనవలూ, మనవరాళ్ళూ వున్నారు నీకు కాలక్షేపం అవుతుంది" అన్నార

ఆశగా చూసి అంగికారంగా తలూపింది

అంతలో టికెట్ ఎగ్జామినర్ వచ్చాడు. టికెట్ చూపమన్నాడు

"టికెట్ తీసుకోలేదండి!" చెప్పింది ఆంగ్లంలో

"ఎక్కడి కెళ్తారు?" అడిగాడు ఆంగ్లంలో నే

ఆలోచిస్తూ వుండి పోయిందామె. ఎంతకీ జవాబు చెప్పక పోవడంతో విసుగెత్తిందాయనకి

"మీకు తెల్సా?' పక్కనున్న శ్రీపతిగార్ని అడిగాడు అతనికి సమాధానం చెప్పకుండా మరో సారి ఆమెను అడిగారు శ్రీపతిగారు

"ఏవూరెళ్ళాలమ్మా?"

"ఏమో! నాకే తెలీదు! అసలీ రైలెక్కడికి వెళ్తుంది?" అడిగింది అయోమయంగా

వారి భాష అర్ధంగాక పోయినా టికట్లెస్ ట్రావెలర్ అని నిర్ధారణ చేసుకొన్నాడు ఎగ్జామినర్

రశీదు పుస్తకమూ పెన్సిలు తీసి,

చెప్పండ్సార్ ఎక్కడకి రాయమంటారు? పెనాల్టీ కూడా కట్టాలి" తొందర చేసాడు

'చూడండి! ఆమె మనసు బాగులేదు! ఖరగ్‌పూర్‌కి రాయండి! పెనాల్టీతో సహా నేపే చేస్తా!" చెప్పారు శ్రీపతిగారు ఇంగ్లీషులో

ఆయన రశీదు రాసి ఆమె కందించాడు. తన మొలలో జాగ్రత్తగా దాచ్ని కాగితం పొట్లాం తీసి అతనికి అందించిందామె. పొట్లాం విప్పాడు ఎగ్జామినర్ మంగళ సూత్రాలు! ఆశ్చర్య పోయారంతా! తిరిగి పొట్లాం కట్టి శ్రీపతిగారి కందించాడు. .. ఆయన యిచ్చిన డబ్బు తీసుకొని వెళ్ళాడు.

(ఇంకా ఉంది)



# బైద్యనాథ్ ఆరోగ్యదీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్యప్రముఖుని సమాధానాలు

**జి. సరోజినమ్మ, నంగవల్లూరు**

ప్ర : నాకు వళ్ళంతా నొప్పులు, నరాలు ఈడ్చినట్లు ఉంటాయి.

జ : బైద్యనాథ్ వాతరీనా టాబిలెట్సు 2. బైద్యనాథ్ మహాయోగరాజ గుగ్గలు 1 మాత్ర రోజు ఉదయం సాయంత్రం వేడి నీటితో సేవించండి. భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట 2 చెంచాలు 2. చెంచాలు నీటితో కలిపి సేవించండి వేడిచేసే వస్తువులు, అజీర్ణ పదార్థాలు నిషేధం.

**వి. ప్రభాకర్, కావలి**

**యస్. ప్రభాకరరావు, విజయవాడ**

ప్ర : నాకు వివాహం అయింది...

జ: బైద్యనాథ్ విటా- ఎక్స్ టాబిలెటులు 2 చొప్పున ఉదయం సాయంత్రం పాలతో వాడండి భోజనం తర్వాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట 2 చెంచాలు మందు సమభాగము నీళ్ళతో రాత్రి పండుకో పోయేటపుడు బైద్యనాథ్ స్వర్ణ మకరధ్వజ 1 మాత్ర పాలతో సేవించాలి, మంచి బలవర్ధక ఆహారము తీసుకోండి.

**యస్. వి. వి. బి. రావు, గుంటూరు**

ప్ర : నీరసముగా ఉంటుంది.

జ : బైద్యనాథ్ విటాఎక్స్ రెండు టాబిలెట్స్ చొప్పున రోజు ఉదయం సాయంత్రం పాలలో వాడాలి, రాత్రి పడుకోబోయేటప్పుడు బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల తీసుకొండి. వివాహము కాకపొతే వెంటనే వివాహము చేసుకోండి.

**యం. చంద్రశేఖర్, తాడిపత్రి**

**కె. మారుతీదేవి, కాకినాడ**

ప్ర: తరచుగా పడిశము బట్టి దగ్గువచ్చును. జ్వరము.

జ: బైద్యనాథ్ శ్వాసకురాసం మాత్రలు 2 చొప్పున ఉదయం, సాయంత్రం బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల 1 చెంచాతో సేవించండి. భోజనం తర్వాత రోజు రెండుపార్లు బైద్యనాథ్ అశ్వగంధారిష్ట బైద్యనాథ్ దశమూలారిష్ట కలిపి 3 చెంచాలు సమభాగము నీటితో కలిపి సేవించండి. తరచుగా మీకు పడని వస్తువులు మానివేయండి.

**టి. శ్రీనివాస్, వనపర్తి**

ప్ర : శరీరం చాలా వేడిగా ఉంటుంది. రెండు నెలల కొకసారి జ్వరం వస్తూంది

జ : బైద్యనాథ్ జీర్ణజ్వరాంతక్ 1 మాత్ర. బైద్యనాథ్ మహాసుదర్శన్ ఘనబటి 1 మాత్ర బైద్యనాథ్ అమృతారిష్టతో ఉదయం సాయంత్రం వాడండి. వేడిచేసే వస్తువులు నిషేధం.

**వి. జె. భాస్కర్, భీమవరం**

ప్ర : మలబద్ధకము, నరముల బలహీనత.

జ : రాత్రి పడుకోబోయేటప్పుడు బైద్యనాథ్ త్రిఫలచూర్ణం 2 చెంచాలు గోరువెచ్చని నీరుతో ప్రతిరోజు వాడండి మరియు బైద్యనాథ్ చ్యవన్ ప్రాశ స్పెషల్. బైద్యనాథ్ విటా-ఎక్స్ టాబిలెట్ 1 చొప్పున ఉదయం సాయంత్రం పాలతో సేవించండి. రాత్రిపూట నీరు ఎక్కువగా త్రాగాలి.

**వి. సత్యనారాయణ, కొత్తగూడెం**

ప్ర : నాకు కడుపులో మంట, పులుపు కారం తింటే ఎక్కువ అవుతుంది.

జ : పులుపు. కారం. ఉప్పు బాగా తగ్గించండి. బైద్యనాథ్ లఘుసూత శేఖరరస 2 మాత్రలు, సూతశేఖరరస 1 మాత్ర ఉదయం, సాయంత్రం బైద్యనాథ్ కారిబాద్యారిష్ట 2 చెంచాలు మందు రెండు చెంచాలు నీటితో కలిపి వాడండి. పెరుగు, శనగపప్పు అజీర్ణముచేసే వస్తువులు నిషేధము. మలబద్ధకము లేకుండా చూసుకొండి. పడుకోబోయేటప్పుడు బైద్యనాథ్ త్రిఫల చూర్ణం 2 చెంచాలు 1 గ్లాసు గోరువెచ్చని నీటితో సేవించండి.

**పి. నాగేశం, సరస్వతీపురం. రాజంపేట**

ప్ర : నా కుమారుని వయస్సు 11 సం.లు. చేతులు కాళ్ళు పగిలి పొట్టులాగ రాలిపోవుట. ఆకలిలేదు.

జ : బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్ 1 చిన్న చెమ్చా రోజు రెండుసార్లు సమభాగం నీటితో ఉదయం సాయంత్రం ఇవ్వండి. పైకి ప్రాయడానికి బైద్యనాథ్ తువరకతేల్ (చాల్ ముగ్రా నూనె) ఉపయోగించండి. చిరుతిండి ఎక్కువగా పెట్టవద్దు. బైద్యనాథ్ కుమారి ఆసవ రోజు రెండుపార్లు భోజనం తర్వాత చిన్న మోతాదులో ఇవ్వండి.

**పాలమూరి సి. గుంతకల్లు**

ప్ర : హస్త పాదములకు స్వేదము, పాదముపై పచ్చలు.

జ : బైద్యనాథ్ రక్తశోధకబటి 1 మాత్ర. బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్ 2 చెంచాల మందు సమభాగము నీటితో ఉదయం సాయంత్రం సేవించాలి. మచ్చలపై బైద్యనాథ్ సోమరాజి తైలము వ్రాయాలి. చాల కాలము వాడిన గుణమిచ్చును. వేడిచేసే పదార్థములు, దుంపకూరలు, శనగపప్పు, పిండి, కారము, పులుపు, ఉప్పు తగ్గించాలి. □

---

## కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న :..................................................

..................................................

..................................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

వండే ప్రతి
గిన్నెలోనూ రుచితోపాటూ
మా నాణ్యతకూడా
కలిసి ఉంది.

సేలం స్టీల్‌లో మేము కంటికి కనిపించేదానికన్నా మరెంతో గిన్నెలో ఉందని నమ్మేవాళ్ళం అందుకే మేం ఎంచుకునేవన్నీ—అది సాంకేతిజ్ఞత, అయినా సరే, ముడిపదార్థమైనా సరే—ఉన్నత ప్రమాణాల్లో ఉండాలనికోరి, ప్రయాసపడి, ప్రపంచంలోనే ఉత్కృష్టమైనది ఎంచుకుంటాం అలాగే తయారీలోకూడా అడుగడుగునా ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తాం నిరంతరం అత్యున్నతమైన నాణ్యతగల వస్తువుల ఉత్పత్తే మాధ్యేయం.

అవును మరి! మీలాగే ప్రతి గిన్నెలో ప్రత్యేకత నింపుతామన్నది నిజంకదూ !






స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
భారత ప్రభుత్వ సంస్థ

**సేలం స్టీల్ కర్మాగారం**
సేలం-636 013, తమిళనాడు

## సేలం స్టెయిన్‌లెస్.
## దీనినే కోరుకోండి. ఎందుకంటే దీనికి మించినది దొరకటం అసాధ్యం.

Sista's - SSP 559 86 TE A

# వెలుగు వెనుక చీకటి

అవధానుల జగన్నాధరావు
మల్లంపల్లి గాంధీరామారావు

అనుక్షణం వచ్చిపోయే రైతులతో కళకళ లాడేది – వరదరాజు గారి లోగిలి

గాని ఆ నాడు, ఆ సమయంలో ఎందుకో నిశ్శబ్దంగా ఉంది ప్రతి ఒక్కరి మొహంలోనూ ఆందోళనా, ఆవేదనా కొట్టొచ్చినట్టు కనబడుతున్నాయి

పట్నం డాక్టరు ఆ మారు మూల పల్లెకు రావడానికి కనీసం రెండు గంటలు పడుతుంది– క్షణం ఆలస్యం చేయకుండా కబురు చేయడానికి వెళ్ళిన స్కూటరు మీద వచ్చినా పక్క పల్లెలో నివసించే రంగాచారి గారికైనా అరగంట కావాలి

వెదజల్ల డానికి వేలకి వేలరూపాయలున్నా, ఒక్కగానొక్క కొడుకు ప్రాణాలు కాపాడ్డానికి–

డాక్టర్ని తెప్పించుకోలేని తన నిస్సహాయతకు, తనను తనే తిట్టుకుంటున్నాడు వరదరాజు పదేపదే

అరగంట క్రితం వరకూ హాయిగా ఆడుకుంటున్న బాబు అచేతనంగా పడి ఉన్నాడు మంచం మీద పసుపు పచ్చని బాబు మేని చాయరాను రానూ నీలంగా మారసాగింది

* * * * *

ఆచారి గారిని చూసిన వరదరాజులు గారి కళ్ళు ఆనందంతో మెరిశాయి ఆయన వద్దకు వెంటనే పరుగు తీశాడు

ఆరడుగుల విగ్రహం . ముఖానికి తిరుచూర్ణం, సిల్కువి రంగు పంచె, పైన జరీ ఖండువా అందరూ నిశ్శబ్దంగా చేతులు జోడించారు గౌరవంతో

"నా బాబు ప్రాణాలు కాపాడండి ఆచారిగారూ!" అంటూ బావురు మన్నాడు వరదరాజులు

"ఇంటి పెద్ద లైన మీరే యిలా బెంబేలు పడితే ఎలా? ధైర్యం వహించండి నాశక్తి వంచన లేకుండా ప్రయత్నిస్తాను అటుపై ఆ ఏడుకొండల వాడి దయ అయినా మీరు అంబులెన్సు కోసం పట్నం కబురు చేస్తే మంచిది' అంటూ బాబు పడి ఉన్న మంచం వైపు నడిచారు రంగాచారిగారు వడివడిగా

నడుస్తున్న ఆచారి గారి చంకలో చిన్న చాపచుట్ట, చేతిలో ధర్బ పుల్లలూ . చూసిన వరదరాజులు గారి ఆశ క్షీణించడం మొదలు పెట్టింది చావు బ్రతుకుల మధ్య కొట్టు కుంటున్న కొడుకు ప్రాణాలు కాపాడే సరంజామా చూసి

భగవాన్! పరిస్థితి క్షీణించే లోగా డాక్టర్ వచ్చి నా బాబు నాకు దక్కేలా. దీవించు తండ్రీ! అని కుర్చీలో కూలబడ్డాడు వరదరాజులు

* * * * *

క్షణం వృదా కానీయకుండా తన తతంగాన్ని ప్రారంభించారు ఆచారిగారు

బాబు పడుకున్న మంచం చుట్టూ చేతో విభూతి జల్లారు ఏవేవో మంత్రాలు వల్లిస్తూ

చంకలోని చాపచుట్ట విప్పి దానిలో ఒక పొడి ఉన్న సీసా తీసి నీళ్ళతో కలిపి బాబు చేత తాగించారు

పాము కాటుకు పైన, గుండె వైపు కట్టిన తాడును మరికాస్త బిగించారు

తర్వాత బాబు పక్కనే కూర్చొని మంత్రోచ్ఛారణ మొదలు పెట్టారు సూది పడితే వినబడేటంత నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణంలో కూడా ఆచారి గారి మంత్రోచ్చారణ ఎవరికీ వినిపించడం లేదు ఆయన పెదిమల చిరు కదలికలు తప్ప

ప్రతిసారి, మంత్రం పూర్తయిన వెంటనే కనులు తెరచి ధర్భతో పాము కాటుపై నిలువుగా నిమర సాగారు

గంభీర మైన ఆయన ముఖముపైకాస్త చిరునవ్వు చోటు చేసుకొంది అరగంట గడచిన తర్వాత

ఆ మంత్రోచ్చారణ అలా రెండు గంటలసేపు గడిచింది మంత్రోచ్చారణ ఆపి వరదరాజులు గారూ! ఇంక బాబు " అని ఏదో చెప్ప బోయిన ఆచారి గారు ఆగారు

అప్పుడే, శరవేగంతో వచ్చి ఆగిన అంబులెన్సు వద్దకు పడి వడిగా వెళ్తున్న వరదరాజులు గారిని చూసి

అంబులెన్సు నుండి డా వివేక దిగాడు

ఎప్పుడూ స్తబ్దుగా ఉండే ఆ పల్లె ఆరోజు కళకళ లాడుతోంది

వరదరాజు గారి యింటి ముందున్న విశాల మైన ఆవరణలో ఎత్తుగా కట్టిన వేదిక . దాని ముందటి స్థలమంతా రంగు రంగుల తోరణాలతో వెలిగిపోతోంది ఆ వేదికపై రంగాచారిగారు, వరదరాజులు, డా వివేక, ఇంకో యిద్దరు పుర ప్రముఖులు ఆశీనులయ్యారు

"ప్రఖ్యాత మంత్ర వేత్త శ్రీ రంగాచారి గారికి సన్మానము" అని కర పత్రాలు పంచి పెట్టడం వల్ల అనుకున్న దానికన్నా జనం ఎక్కువ గానే వచ్చారు.

వేదికపై ఆసీనులై ఉన్న రంగాచారిగారికి, ఆరేళ్ళ బాబు పాదాభి వందనం చేశాడు తన కన్నా బరువైన దండను ఇద్దరు నౌకర్లు తీసుకొని రాగా, దానిని వారి సహాయంతో రంగాచారి గారి మెడలో వేశాడు

వెను వెంటనే వరదరాజులు లేచి "సభకు నా నమస్కారములు ఈ నాటి సభ ముఖ్యోద్దేశం.... రంగాచారి గారిని సన్మానించడం. దానికి ముందుగా ఆయనను మీకు పరిచయం చేయడం రివాజు అయినా జగమెరిగిన రంగాచారి గారిని నేను తిరిగి పరిచయం చేయడం అవివేకమే అవుతుంది.

లక్షల కధిపతి నయిన నేను, నిస్సహాయుడనై, పుత్ర భిక్ష అర్థిస్తే, భగవంతునిలా ఆదుకొని నా బిడ్డను కాపాడిన పరంధాముడీయన

ఆయన ఋణం ఎన్ని జన్మలకూ నేను తీర్చ లేనటువంటిదే. మంత్ర మహిమ నశిస్తుందనే కారణంతో, నా నుండి చిల్లి గవ్వ ముట్టని మహా మనీషి ఈ రంగాచారిగారు

భగవంతునికి పుష్పంలా... ఈ మహనీయునికి ఈ శాలువను సమర్పించుకొని నా కృతజ్ఞతను తెలియజేసుకుంటున్నా" అని చెప్పి.. ఎర్రని శాలువను ఆయన భుజాంపై గౌరవంగా కప్పి.... పాదాభి వందనం చేసి తన సీటులో కూర్చొన్నాడు వరదరాజు

సమాధానంగా రంగాచారిగారు లేచి సభకు నమస్కరించి

"నా మంత్రం పాముకాటు వాత బడిన వారిని చావు నుండి తప్పక రక్షిస్తుంది, అన్న మీ నమ్మకాన్ని వమ్ము చేయనందుకు ఆనందిస్తున్నా అన్ని ఆస్తులకన్నా విలువైన ఈ ఆస్తిని నాకిచ్చి, నా తాతగారికి ఈ సభా ముఖంగా అంజలి ఘటిస్తున్నా. ఇంతవరకూ ... తాత గారి కోరిక మేరకు , ఈ మంత్ర మహిమతో బ్రతికి బట్ట కట్టిన ఏ వ్యక్తి నుండీ చిల్లి గవ్వను కూడా అంగీకరించలేదు ఆ సర్వేశ్వరుని కృప వల్ల అటువంటి అవసరమూ రాలేదు ఆ కారణంగానే ఎంతో ఆదరాభి మానాలతో నాకు సమర్పించిన ఈ శాలువను సభా ముఖంగానే ఆలయ పూజారి వెంకటావ ధాని గారికి సమర్పించు కంటున్నందుకు వరదరాజులుగారు నన్ను మన్నిస్తారని ఆశిస్తాను

నా ప్రక్కనే ... జీవకళతో వెలిగి పోతున్న ఈ బాబు చిరునవ్వులు నాకు చాలు అవే నాకు పదివేలు ఈ మంత్ర మహిమ వల్ల బ్రతికి బయట పడ్డ ప్రతి వ్యక్తి నా ఆస్తే. సరియైన వైద్య సదుపాయాల్లేని.. ఈ పల్లె ప్రాంతాలలో ఒక్క వ్యక్తి కూడా పాము కాటు వాతబడి మరణించేలా చేయొద్దని ఆ సర్వేశ్వరుని అర్థిస్తూ. మీ అందరి వద్ద నుండీ శలవు తీసుకుంటున్నా . " అని కూర్చొన్నారు రంగాచారిగారు

పూవుకు తావిలా అబ్బిన ఆయన నిరాడంబరతను గమనించి ప్రజలు చేసిన కరతాళ ధ్వనులు మిన్నంటాయి. ఆ కరతాళ ధ్వనులు

కాస్తంత సద్దు మణిగే లోగా, ముందు వరుసలో కూర్చొన్న ఓ యువకుడు వేదిక పైకి వచ్చాడు మెరుపులా

చొరవగా మైకు ముందుకు వచ్చి విజ్ఞులైన పెద్దలు అనుమతిస్తే . నేనూ నాలుగు ముక్కలు సభాముఖంగా చెప్దామను కుంటున్నా అన్నాడు ఆవేశంగా

ఆ వ్యక్తినీ, అతని నాస్తిక భావాల్నీ తెలిసిన వరదరాజులు ఒద్దని వారించబోయాడు

కను సైగతో అతని ప్రయత్నాన్ని ఆపారు రంగాచారిగారు వెంటనే లేచి మైకు ముందుకు వచ్చి 'బాబూ' ఇది పవిత్రమైన సభాస్థలం ఎవరి మనసుల్నీ నొప్పించకుండా, ఎవరినీ ఏ భావాలతో రెచ్చగొట్టకుండా నీ అభిప్రాయాలు నిష్కర్షగా చెప్పుకోవచ్చు." అని తిరిగి తన కుర్చీలో కూర్చున్నారు రంగాచారిగారు

సోదర సోదరీమణులకూ, వేదికపై ఆశీనులై ఉన్న పెద్దలకూ నా నమస్కారములు నా పేరు నిర్గుణ్ బాబు బ్రతికినందుకు మీ అందరిలా సంతసించిన వారిలో నేనూ ఒకడినే అలాగే ఈ ప్రాంతాలలో దైవ సమానుడుగా గౌరవింపబడుతున్న ఆచారి గారిపై ఎనలేని గౌరవ ప్రపత్తులు గల వాడినికూడా

ఇప్పుడు నేను మీ ముందుకు వచ్చినది నా అభిప్రాయాలు మీ ముందు ఉంచుదామనే సదుద్దేశముతో మాత్రమేనని మనవి చేసు కుంటున్నా

చంద్రలోక ప్రయాణాలు సర్వ సామాన్యమై కుజ లోకయాత్రకు మనిషి సన్నాహాలు చేస్తున్న వైజ్ఞానిక యుగం ఇది ఈ యుగంలో కూడా, పని చేస్తాయని చెప్పడానికి ఏ మాత్రం ఆధారంలేని ఈ మంత్రాన్ని నమ్మడం సమంజసమేనా మీరే చెప్పండి?

విజ్ఞులైన ఆచారిగారు గుండెలపై చేయి వేసుకొని చెప్పగలరా తన మంత్ర మహిమకే బాబు బ్రతికాడని? మనం నిత్యం చూసే రకరకాల పాము జాతుల్లో కేవలం నాలుగైదు రకాలు మాత్రమే ప్రమాదకరమైనవి వీటిని మినహాయించి మిగిలిన రకాల పాము కాటు పడిన మనిషి . ఏ మంత్రమూ మందూ లేకపోయినా బ్రతుకుతాడు విషసర్పం వాతబడిన మనిషికి వెంటనే కావలసింది సరియైన వైద్య సదుపాయంగాని కాలయాపన చేసే ఈ మంత్రాలుకావు మీ లాంటి అమాయకుల్ని విజ్ఞుల్నిగా చేయవలసిన బాధ్యత గల ఈ పెద్దలు ఈ సభల ద్వారా మరింత తప్పుదారి పట్టిస్తున్నారేమో? ఆలోచించండి

ఈ సభాముఖంగా నేను మిమ్మల్ని కోరుకునేదల్లా ఆధారంలేని ఏ విషయాన్నీ గుడ్డిగా నమ్మకండి అంటూ తన ఉపన్యాసాన్ని ఆపి రంగాచారి గారివైపు తిరిగాడు నిర్గుణ్-

నా ఆరోపణలకు మీ సమాధానమేమిటో చెప్పండి అన్నట్టుగా చూశాడు

ఆ మాటలు విన్న వెంటనే వేదికపై ఆసీనులైన పెద్దలందరికీ కోపంవచ్చింది. గాని అంతలోనే తమాయించుకొని కూర్చున్నారు గాని ఆవేశం ఆపుకోలేని ప్రజల్లో ఒక్కసారిగా కలకలం బయలుదేరింది

చితగొట్టండెహె నాయాల్ని' అన్న అరుపులూ, వాటితో బాటు నలుగురైదుగురూ వ్యక్తులూ వేదికపైకి రాసాగారు పరిస్థితి చేయిదాటి పోయేలోగా రంగాచారిగారు రివ్వున లేచి నిర్గుణ్ ముందు నిలిచారు ఆవేశపూరితులైన ప్రజల్ని



నిశ్శబ్దంగా కూర్చోమని ఆదేశించారు. అంతవరకూ తను కూర్చొన్న కుర్చీలో నిర్గుణ్‌ను కూర్చోపెట్టి తిరిగి మైకు వద్దకు వచ్చారు

"ప్రజలారా! నిర్గుణ్ ఇంతవరకూ చెప్పిన విషయాలు ఏ మాత్రం సత్యదూరంకావు. మనిషి వైజ్ఞానికంగా ఎంతో ముందంజ వేసిన కాలమిది గాని ఆ విజ్ఞానంతోనే ప్రపంచాన్ని సర్వనాశనం చేసే మారణాయుధాలు కూడా తయారు చేస్తున్న కాలం కూడా ఇదే

నిర్గుణ్ చెప్పిన విధంగా ఏ విదమైన మందు మాకులు లేకుండా శరీరంలో ప్రవేశించిన విషాన్ని మంత్రాలతో మటుమాయం చేయడం అర్థం కాని విషయమే

గాని మన మేధకు అందని విషయం అసంభవమని భావించడం కూడా సమంజసం కాదేమో!

మనం మూఢనమ్మకమని తోసి పారేస్తున్న ఈ మంత్ర తంత్రాలు మనకంతగా తెలియని విశేషాలేమో?

అది మానవుడు కొండ గుహల్లో చిత్రీకరించిన చిత్రాలని వారు పూజించే దేవుళ్ళుగా మార్చి చేతులు కడిగేసుకున్నారు వంద ఏళ్ళ క్రితం చరిత్రకారులు- వారికా బొమ్మలూ, వాటి సారూప్యాలూ అర్థం కాక ఆ చిత్రాలనే. నేటి మానవుడు చంద్ర మండలంలోకి దిగిన తర్వాత అర్థం మారింది ఆ పిచ్చి బొమ్మలు స్పేస్ సూటు ధరించి చంద్రునిపై కాలు పెట్టిన మనిషిలా ఉండటం మన మేధకు అందని విషయమే అంటే ఆ నాటి మానవుడు చంద్రలోక యాత్రలు విరివిగా చేశాడని మనం అనుకోవాలా? లేక మరో సౌరకుటుంబంలోని వ్యక్తులు ఈ భూలోకం మీదకు ఆనాడు వచ్చారనా? కోట్ల సంవత్సరాల వయస్సున్న ఈ భూమి చరిత్రను మానవుడు ఊహించగలిగింది కేవలం ఐదువేల ఏళ్ళ మాత్రమే వైజ్ఞానికుల్ని ఆలోచనా భరితుల్ని చేసి. కేవలం కంటి చూపుతో ఇనుపచొవ్వల్ని వంచిన ఓ యువతి

# వెలుగు వెనుక చీకటి

ఉదంతం అబద్ధంకాదే

మనకు అర్థం కాని విషయం ఈ విశాల విశ్వంలో వేలకు వేలున్నాయి

న్యూటనంతటి మహా మేధావి . తనకు తెలిసిన విజ్ఞాన్నాన్ని సముద్రపు ఒడ్డున ఉన్న ఇసుక రేణువుతో పోల్చాడట

భూమి సూర్యుని చుట్టూ తిరగడం చూడలేని నేను అలా నమ్మిన వారి నందర్ని మూర్ఖులుగా భావించడంలో అర్థంలేదే?

ఈ మంత్ర తంత్రాల్ని ఇంత తేలిగ్గా కొట్టి పారేయడానికి నీకున్న అర్హతల్ని వివరించ గలవా నిర్గుణ్!

ఇప్పుడు ఇక అసలు విషయాని కొద్దాం పాముకాటు విషయంలో మీకూ, నిర్గుణ్‌కూ తెలియని విషయ మొకటి ఉంది పాము కరిచిన వారిలో నూటికి ఎనభై మందికి పైగా మరణించేది కేవలం భయంవల్ల, కొద్ది క్షణాల్లోనే చనిపోతామనే విపరీతమైన భయంవల్ల! ఆ సమయంలో ఆ వ్యక్తికి అందవలసిన ప్రథమచికిత్స తప్పక బ్రతుకుతాననే ఆశ" బహుశా నా మంత్రం వారిలో ఆ ఆశనే కలిగిస్తున్నదేమో ఏ వైద్యుని కర్తవ్యమైనా రోగిని బ్రతికించడమే నా మంత్రం వారిలో ఆ ఆశను కలిగించి వారికి తిరిగి జీవాన్ని ప్రసాదిస్తే అదినా మంత్ర మహిమ కాదా? ఆ రకంగా వారి ప్రాణాలు కాపాడ్డం మూఢనమ్మకమని ఆధునికులకు అనిపించినా, వారందరూ నన్ను ఓ మూఢునిగా బావించినా నేనా మూఢ నమ్మకాన్ని కొనసాగించడానికి వెనకాడను

ఇంత సంపన్నులైన వరదరాజులు గారింటికి వైద్యుడు రాడానికి రెండు గంటలకు పైగా పట్టింది అటువంటిది రెండు పూటలా తిండికి లేక మలమల మాడే బీదలకా సదుపాయం లభించడానికి ఎంత సమయం పడుతుందో మీరే ఆలోచించండి

నాయనా నిర్గుణ్! నీవూ, నిలాటి మేధావి వర్గమూ నివసించేది పట్టణాలలో అధునిక యుగం అందించిన అన్ని సదుపాయాలనూ అనుభవిస్తున్నది . మీరే కనులు మిరుమిట్లు గొలిపే వెలుగులతో వెలిగిపోయే మీ పట్టణాల నీడల చీకటిలో అణగారి పోతున్న సమిధలు· నాయనా ఈ పల్లెలు!

నాయనా నిర్గుణ్! నీవూ, నీలాంటి ఉత్సాహవంతులైన యువకులూ కనులు తెరిచి ఈ పల్లెల స్థితిగతుల్ని గమనించండి వారికి మంచినీటి సదుపాయంలేదు కనీస వైద్య సహాయం లభించే వైద్యశాలలులేవు విద్యుచ్ఛక్తి సదుపాయం వారికిలేదు వారి పిల్లలను విజ్ఞాన వంతుల్ని చేసే పాఠశాలలులేవు అన్ని విధాలా వెనుకబడి ఉన్న వీరికి కావలసినవి 'అందకారంలో మీరుండ వద్దనే గావు కేకలు కావునాయనా వారు జీవించే పరిసరాల్లో ఉండే చీకటి (ఇగ్నోరెన్స్)ని రూపుమాపే వెలుగు (నాలెడ్జ్) రేకలు మీ యువతరం నడుంకట్టి వీరిని విద్యావంతుల్ని చేయండి!

వీరికి అందుబాటులో ఉండే విధంగా వైద్యశాలలు నిర్మించండి వారికీ మీరనుభవించే విద్యుచ్ఛక్తినీ, మంచినీటినీ కాస్త పంచిపెట్టండి ఇవన్నీ చేసి వారి జీవన సరళిని మార్చండి

నీవూ, నీ విజ్ఞానం అందించే సదుపాయాలు అందుబాటులో ఉంటే అనుభవించటం చేతకాని మూర్ఖులు కారయ్యా ఈ పల్లెవారు పక్కనే చక్కని వైద్య సదుపాయం లభిస్తే ఈ చదువురాని ఆచారి వద్దకు వచ్చే అజ్ఞానులు కారయ్యా ఈ జనం

శ్రీశ్రీ చెప్పినట్లుగా వీరంతా తాడితులు పీడితులు బాదాసర్పద్రష్టలు

చీకటిలో ఉన్న వీరిని అపహాస్యం చేయకుండా వారి జీవితాలలోని చీకటికి పారదోలే ప్రయత్నం చేయండి అంటూ తన కుర్చీవద్దకు నడిచారు

సబలో హర్షద్వానాలు మారుమోగాయి

ఏదో ఆలోచిస్తూ తన ఉపన్యాస సారాంశాన్ని జీర్ణం చేసుకునే ప్రయత్నం చేస్తున్న నిర్గుణ్‌ను అక్కున చేర్చుకున్నారు ఆచారిగారు □

---

సైనిక చర్య అయినా సరే, వాళ్ళని ఎవరూ ఆపలేకపోతున్నారు. ప్రపంచబాంక్‌లో కూడా వాళ్ళు తీవ్ర వైఖరినే ప్రదర్శిస్తున్నారు. చివరికి ఇటలీ వంటి దేశాలకి కూడా భారతదేశం ప్రవేశం కల్పించాల్సిన స్థితి త్వరలోనే రావచ్చు.

మరి రాజీవ్ బృందం రీగన్ బృందాన్ని ఎలా నిరోధించగలదు? కొన్ని విషయాలలో రీగన్‌కి దృఢమైన విశ్వాసంఉన్నది. ప్రైవేటువాణిజ్యం, వ్యక్తి స్వాతంత్ర్యం, తగినంత స్థాయిలో గుట్టు లేనటువంటి సమాజం ఉండటంవంటి వాటిపై ఆయనకి విశ్వాసం ఉన్నది. రాజీవ్ బృందానికి దేనిమీదా విశ్వాసం లేదు. ముఖ్యమైన ఏ సమస్య మీదా వారు స్పష్టమైన వైఖరిని ప్రదర్శించరు. అది తీవ్రవాదం అయినా, ప్రభుత్వ

## న్యూఢిల్లీ లేఖ

(4వ పేజీ తరువాయి)

రంగం అయినా, భిన్న వర్గాలు గల సమాజంలో అల్ప సంఖ్యాకుల స్థానం అయినా సరే. వాళ్ళు ఇవాళ ఒకటి చెప్పి, రేపు ఇంకొకటి చెపుతారు. అత్యవసర పరిస్థితిలో రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం, ఇతర సంస్థలని అణచి వెయ్యటంలో ప్రముఖపాత్ర వహించిన ఒక కాబినెట్ మంత్రి ఉన్నట్లుండి ప్రభుత్వ రంగంపై నిపుణుడై పోయారు. ఆ విషయం గురించి ఆయన విసుగు పుట్టించే సుదీర్ఘ వ్యాసాలు రాస్తున్నారు. ఆయన చెప్పే అంశాలు గతంలో ఎవరూ చెప్పనటువంటివి అన్న ధోరణిలో ఉంటాయి ఆ వ్యాసాలు. మరో మంత్రి ఆయన రాజీనామాని కోరుతున్నారు. అది ఒక అసాధారణమైన విషయం. అస్తవ్యస్తంగా ఉన్న రాజీవ్ బృందం పాలనావ్యవస్థలో కూడా అది అసహజమైనటువంటిదే కానీ జరిగేది ఏమీ ఉండదు. ఆ కాబినెట్ మంత్రి తమ పదవిలోనే ఉంటారు. గతంలో ఆయనపై కత్తిగట్టిన ఆ జూనియర్ మంత్రికూడా అదేవిధంగా ఉంటారు. పరిస్థితులు ఎదురు తిరిగినప్పుడు అమెరికా దుశ్చర్యలపై దృష్టిని మళ్ళింపచేస్తారు ప్రధాన మంత్రి. నెహ్రూ నుంచి శ్రీమతి గాంధి వరకూ అదే చేసారు. వాళ్ళ అమెరికాని పాపాల భైరవుడిగా వాడుకుంటున్నారు. అంతకన్నా 'నాన్నా పులి' అని అరిచే కుర్రవాడికే జ్ఞానం ఎక్కువ ఉంటుందేమో ! □

ప్రాచీన సంస్కృతికి, నవీన ప్రగతికి నడుమ వారధి – హైదరాబాద్

హిందూ–అరబ్బీ వాస్తు శిల్ప కళా నైపుణ్యానికి కలికితురాయి లాంటి చార్‌మినార్ పాతనగరపు ప్రజా సముదాయాన్ని సగర్వంగా అవలోకిస్తూంటుంది హైదరాబాదుకు అనతి దూరంలోనే ప్రఖ్యాతమైన గోల్కొండ కోట ఆ కోట,పరిమాణాలు కట్టడపు రీతులు చూపరులకు ఇప్పటికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి



ఎంతో భావుకత్వంతో, నిర్మించబడ్డ కుతుబ్‌షాహీరాజుల సమాధులు కూడ అటువంటివే కేవలం ఒకే వ్యక్తి అభిరుచితో సమకూర్చబడ్డ కళాత్మక వస్తువులు గల సాలార్‌జంగ్ మ్యూజియం బహుశా



ప్రపంచంలోనే పెద్దది కావచ్చు అనంతాకాశపు రహస్యాలను విప్పి చూపించే బిర్లా వేధశాల హైదరాబాద్ – చుట్టూ ఎన్నో మనోజ్ఞమైన విశ్రాంతి స్థలాలు – ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్, హుస్సేన్ సాగర్ మొదలగు

విశాలమైన మానవ నిర్మిత సరోవరాలు అందరూ మెచ్చే విహారకేంద్రాలు, పడవ షికార్లు, జలక్రీడలు హుస్సేన్ సాగర్ ప్రత్యేక ఆకర్షణ ప్రఖ్యాతి చెందిన మక్కా మసీదు, సుందరమైన చలువరాతి వెంకటేశ్వర దేవాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం, నెహ్రూ జంతు ప్రదర్శనశాల ఇంకా ఎన్నెన్నో అంతులేని విహార యాత్రాస్థలాలు



ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాదుకు రండి – మరపురాని మధురాను భూతిని పొందండి!!

## ప్రాచీనత్వంలోని సౌమ్యత
## సాంప్రదాయకమైన ఆతిథ్యం
## ఈ రెండింటి రమణీయమైన
## సంగమమే – హైదరాబాద్



ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం
మొదటి అంతస్తు, గగన్ విహార్,
యం జి-రోడ్డు, హైదరాబాద్ - 500 001
టెలిఫోన్లు 556493, 42835, 77192,
70087, 233384, 233385



# వ్యక్తిగతం



సియోల్‌లో జరిగిన 10వ ఆసియా క్రీడోత్సవాలలో భారత దేశానికి లభించిన 5 బంగారు పతకాలలో నాలుగింటిని పరుగుపందాలలో పి.టి. ఉష సాధించింది. ఈ క్రీడోత్సవాలలో భారత దేశానికి తొలి బంగారు పతకాన్ని సాధించిన ఘనత కూడా ఈమెకే దక్కింది. అవికాక మరో రజిత పతకాన్ని కూడా సాధించటంతో వ్యక్తిగతంగా ఎక్కువ పతకాలని సాధించిన ఇద్దరిలో ఈమె ఒకరు. ఆసియా క్రీడోత్సవాల్లో పరుగు పందాలలో కొత్త రికార్డు నెలకొల్పిందీమె. మొత్తం ఆరు బంగారు పతకాలని సాధించాలనుకున్న ఈమెకి 4 బంగారు, ఒక వెండి పతకం లభించటం తక్కువ విశేషం ఏమీ కాదు. □



ఇటీవల కరాచీలో దారి మళ్ళింపుకి గురి అయిన పాన్ అమెరికన్ విమానం ఎయిర్ హోస్టెస్ శ్రీమతి నీరజా మిశ్రా (23)కి ఆమె మరణానంతరం ప్రతిష్ఠాకరమైన "అశోక చక్ర" అవార్డుని ప్రభుత్వం ప్రకటించింది. సాయుధులైన దారి మళ్ళింపుదారుల అధీనంలో తమ విమానం ఉన్నటువంటి అతి క్లిష్టమైన ఆ సమయంలో పరిస్థితిని అత్యంత ధైర్య సాహసాలతో ఎదుర్కొని బాధ్యతా నిర్వహణలో ప్రాణాలను అర్పించినందులకు ఆమెకి ఈ అవార్డుని ప్రకటించారు. బాధ్యతా నిర్వహణలో తన ప్రాణాలని కూడా లెక్క చేయకుండా ఆమె ప్రదర్శించిన ధైర్యసాహసాలు పౌర విమాన యాన చరిత్రలోనే ఉత్తమ సంప్రదాయాలుగా పేర్కొనటం జరిగింది... □



కరాచీ విమానాశ్రయంలో ఇటీవల దారి మళ్ళింపుకి గురైన పాన్ అమెరికన్ విమానం కెప్టెన్ విలియం కియస్‌కా ఆవిమానాన్ని, అందులోని ప్రయాణీకులని వారి ఖర్మకి వదలి వేసి తాను తప్పుకున్నాడు. విమానం సాయుధులైన దారి మళ్ళింపు దారుల అధీనంలో ఉన్న ఆ క్లిష్ట సమయంలో తాను కెప్టెన్ అయి ఉండీ కూడా బాధ్యతని 23 ఏళ్ల ఎయిర్ హోస్టెస్ శ్రీమతి నీరజామిశ్రా మీద వదలిపెట్టి వెళ్ళిపోయాడు. తాను ఆ విమానంలోనే ఉండి ఉంటే దారిమళ్ళింపుదారులు చెప్పిన చోటికి తాను విమానాన్ని తీసుకు పోవాల్సి వచ్చేదని అప్పుడు పరిస్థితులు మరోలా ఉండేవని అందుకే తాను విమానాన్ని వదలిపెట్టి వెళ్ళిపోయామనీ అన్నారంట ఆయన ... □

# వారఫలం

## 24-10-1986 శుక్రవారం మొదలు 30-10-1986 గురువారం వరకు

★ **మేషం:** ధనాదాయ మున్నది. అనుకూల మిత్రులు చేరుతారు. నూతనంగా ఏదైన వ్యాపారం ప్రారంభిస్తే అందులో అధికంగా ఆదాయం రావటానికి ఆక్షేపణ లేదు. బంధువులకు సహాయం చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. గమనించండి. స్త్రీలకు: ఉద్యోగమందు అభివృద్ధి.

★ **వృషభం:** అధికాదరణకు అనుకూల వారం. ప్రజారంగంలో ప్రసిద్ధి ఏర్పడుతుంది. రాజకీయంగా మేలున్నది. కళారంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది. సుఖశాంతు లుంటాయి. వ్యాపారాన అనుకూలత ఏర్పడుతుంది. స్త్రీలకు: అధికార మందు వృద్ధి. ఆదాయ మందు మేలుంటుంది.

★ **మిథునం:** అనుకూల వాతావరణం అన్ని రంగాలలో ఏర్పడుతుంది. బాగా ప్రకృతి సంక్షోభానికి దెబ్బ తిన్నవానిని క్రమంగా కూడ దీసికో గలరు. ప్రభుత్వపరంగా రావలసిన డబ్బు ఈ వారం అందుతుంది. కొంత ప్రశాంతత చిక్కుతుంది. కొంతలో కొంత మేలు పొందుతారు. స్త్రీలకు: వారమంతా హడావుడిగా ఉంటుంది. శుభం యింట జరుగవచ్చు.

★ **కర్కాటకం:** నూతన యత్నాలు సానుకూలం అవుతాయి. నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది. వారి ఆదరాభిమానాల వలన కొన్ని పనులు సుముఖంగా నెరవేరుతాయి. కొందరకు విదేశయానానికి కూడ అనుకూలం. గ్రహించండి. అభివృద్ధికరమైన మార్పులు అన్ని రంగాలలో ఉంటాయి. స్త్రీలకు: దూరపు బంధువులు యింటికి రానున్నారు. సమయానికి డబ్బు అందుతుంది.

★ **సింహం:** స్థితిగతులందు యిబ్బందు లుంటాయి. వ్యవహారరీత్యా అనానుకూల వారం. డబ్బు సంతన అయ్యే దినం. శ్రమిస్తే చాలు అంతా అనుకూలమే. గ్రహించండి. పూర్వీకుల ఆస్తి అమ్మవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. సులభంగా అయ్యే పనులు ఎదురు తిరుగుతాయి. స్త్రీలకు: సుఖశాంతులు, ధనాదాయ మున్నది.

★ **కన్య:** కావలసిన వారితో యిబ్బందు లుంటాయి. నూతన వస్తు సేకరణకు అనుకూలం. ప్రధాన విషయములలో పరిష్కారం ఏర్పడుతుంది. గమనించ గలరు. వ్యవహారరీత్యా మేలైన వారం. స్థితి పెరగటం కూడా గమనించ గలరు. ముఖ్య బంధువులు యింటికి రాగలరు. స్త్రీలకు: ముఖ్య రంగాలలో విజయవంతమైన వారం

★ **తుల:** దూరభారాల నుండి మిత్రులో బంధువులో యింటికి వస్తారు. మీరు చేసే వ్యాపారంలో అనుకూలత ఏర్పడుతుంది. కృషి లోపం లేకపోతే, సర్వవిధాల అనుకూలం. పరుల చేతిలో చిక్కిన డబ్బు వసూలగుటకు అనుకూల గ్రహస్థితి ఏర్పడుతుంది. స్త్రీలకు: శుభ కార్యాలో చనకు అనుకూలం.

★ **వృశ్చికం:** నూతన వ్యాపారం చేయాలని కొందరు ఉబలాట పడుతారు. అది ఏమాత్రం సాగిరాదు. రాజకీయంగా అనుకూలత చెప్ప వీలులేని వారం. ఏ ప్రయత్నాలూ కూడా కలసి రావు. గ్రహించండి. "జాయింటు" వ్యాపారమయితే మరీ ఇబ్బందులు రాగలవు. స్త్రీలకు: అధికార మందు వృద్ధి, అభిమానుల ఆదరణ, అంతో యింతో చేతికి ద్రవ్యం అందుతుంది.

★ **ధనుస్సు:** అధికార మందు అభివృద్ధి చేకూరుతుంది. విద్యా పరిశ్రమ సానుకూలం అవుతుంది. కొందరకు దూరదేశాలకు పోగల అవకాశాలుంటాయి. వీలయినంతవరకు ప్రయాణాలు ఆపుకోవటం మంచిది. కళారంగాన సదవకాశాలు లభ్యమవుతాయి. గమనించ గలరు. స్త్రీలకు: శుభ కార్యానుకూలతకు అవకాశం.

★ **మకరం:** దూర బంధువులు యింటికి రాగలరు. విద్యా పరిశ్రమ ఫలిస్తుంది. ముఖ్యులను కలిసికొనే అవకాశ మున్నది. ఆదాయాన్ని మించిన వ్యయం భరించవలసిన వారంగా గమనించ గలరు. ఉద్యోగరీత్యా కొందరకు అనుకూలం. కొందరు హటాత్తుగా యిండ్లు ఖాళీ చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది. స్త్రీలకు: వారమంతా హడావుడి, స్వల్పాదాయం.

★ **కుంభం:** ఎంత యత్నించినా ఏం లాభం. ఎంత కృషి చేసిన ఏం ప్రయోజనం? ఇచ్చిన డబ్బు చేతికందటం కలలోని వార్త. అధికారం వృద్ధి అయ్యే సూచన లుంటాయి. అనుకోకుండా ఏదో వర్తమానం అందుతుంది. గ్రహించుకోండి. స్త్రీలకు: కొందరకు ఆరోగ్య భంగం, కొందరకు ఉద్యోగంలో అనానుకూలత.

★ **మీనం:** ఉత్తమ ఫలదాయక వారం. నూతన మిత్రులు చేరుతారు. కొందరు నూతన చిత్ర నిర్మాణమో, వ్యాపారమో కొందరు యత్నిస్తారు. సఫలం కావచ్చు. కళారంగాన సదవకాశాలు లభ్యమవుతాయి. గాయనీ గాయకులకు, రచయితలకు, పత్రికాధిపతులకు ఈ రాశివారికి అనుకూలం. స్త్రీలకు: నూతన వ్యక్తులతో పరిచయం, ఉద్యోగంలో అభివృద్ధి చేకూరుతుంది, గ్రహించాలి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# హైదరాబాద్ నోట్‌బుక్

## గీతాంజలి :-

విశ్వకవి రవీంద్రుడు ఒకమారు పద్మానదిని (గంగను) దాటి ఏ గ్రామానికో వెళ్ళవలసి వచ్చిందట. పడవ ఎక్కాడు. పడవవాడు పడవ నడిపిస్తూ ఝుమ్మని పాట పాడేస్తున్నాడు. ఇదేదో విన్నపాటగా వుందే అని అనుకున్నాడట రవీంద్రుడు. కొంతసేపటికి జ్ఞాపకం వచ్చింది, అది తానెప్పుడో పద్మానది గట్టుపై వాహ్యాళి వెళ్లుతూ వ్రాసిందని. పడవ వాడిని అడిగాడట ఎవరు వ్రాసింది ఈ పాట ?— అని. నాకు పేరు తెలీదు. కలకత్తా దగ్గర ఏదో ఆశ్రమంలో వుంటాడంట. ఆయన రాశాడంట— అన్నాడట పడవవాడు. తన జీవిత కాలంలోనే కొన్నేళ్ళలోనే అంతగా జనప్రియమైన తన గీతాన్ని చెవులార విని మహానందం పొంది, రవీంద్రుడు నా అనంతరం కూడ నా గీతం అజరామరం అని అనుకొన్నాడట. గానం, గీతం అలాటివి. అవి జనం హృదయంలో త్వరగా చొచ్చుకొనిపోయి, జనం నాలుకపై స్థిరపడిపోతాయి. ఈ గీతం భక్తి యుక్తమైతే మరింత త్వరలో వ్యాపిస్తుంది. మనస్సును మృదుతరంచేసి, అహంకారాన్ని అణచి వేసి బుద్ధిని ఆత్మప్రవణంచేసే భక్తి నిష్క్రియ అని నేను అనుకోను. భక్తి ఏదోరూపంలో మానవుణ్ణి అంటి పెట్టుకునే వుంటుంది-దైవభక్తి, దేశభక్తి, సిద్ధాంతభక్తి ఇత్యాదిగా. ఈ భక్తికి భాష సహకరిస్తే, భక్తి ప్రసక్తిలేని సహృదయులూ ఆస్వాదించే సాహిత్యం ఉద్భవిస్తుంది. అలాటిది సెప్టెంబర్ రెండవవారంలో ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ఆవిష్కరించిన శ్రీ వేటూరి సుందరరామమూర్తి గీతాంజలి క్యాసెట్లు. వీటిలో ఒకటి వేంకటేశ్వర స్తుతికి సంబంధించినది, రెండవది కబీర్ వాణి. మొదటిదానికి శ్రీ కె. వి. మహదేవన్ సంగీతం కూర్చగా, శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీమతులు పి. సుశీల, ఎస్. జానకి గానం చేశారు. రెండవ దానికి శ్రీ చక్రవర్తి సంగీతం కూర్చగా, శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం గానం చేశారు. రెండింటిలోను చెరి పది గీతాలున్నాయి. వేంకటేశ్వర స్తుతి

అఘమను కులమున బుట్టితిని
అహమను మతమును బట్టితిని
ఇహమే స్థిరమని నమ్మితిని
పరమే పరులకు అమ్మితిని

అనే హృదయవేదనతో ప్రారంభమవుతుంది. ఈ గీతాల్లో భక్తుని హృదయాన్ని కుమ్మరించారు శ్రీ సుందరరామమూర్తి.

ఆపదలోగాని నీ పదములు రావు
పాపపు నుడువుల నా నోటికి

అంటారు రచయిత. నిజం. గీతాచార్యుడు తనను తలచుకొనేవారు నలుగురని జాబితా ఇచ్చాడు ఆర్త జిజ్ఞాసురరార్థి కామిచ భరతర్షభ అని. కలౌ వేంకట నాయకః అన్నది ప్రాచీనులు చెప్పిన మాట.

తిరుపతి కొండను తాకకపోతే
తీరవు చేసిన పాపాలు
తిరుమల వాసుని చూడకపోతే
తీరవులే భవతాపాలు

అని శ్రీ సుందరరామమూర్తి దానినే వివరించారు. అందరికీ తెలిసిన విషయంలోనే మరింత అందచందాలు తెచ్చారు కవి ఈ విధంగా :-

నీ వీడు ఆనందనిలయం
నీ తోడు అద్వైత శిఖరం
నీ నీడ నాపాలి దేవాలయం
నీ చూపు సుజ్ఞాన జ్యోతిర్మయం
నీ దివ్యహస్తాల వెలసింది మాముక్తి
సోపాన సూర్యోదయం

మరొక గీతంలో కవి కవి కాలాన్ని అతి సహజంగా గోమాతను కబేళాకు పంపు కాలము, భూమాతకు అణువుల చితి పరచు కాలము అని చిత్రించారు. అణ్వస్త్రాల చితి అత్యద్భుత సాదృశ్యం. వేంకటేశ్వర పాదాన్ని అన్నమయ్య బ్రహ్మ కడిగిన పాదం అంటూ వర్ణిస్తే,

ఎందరు మొక్కిన దీపాదం
బిందున బలితల నొక్కిన పాదం
పొందిక మూడే అడుగులు కొలిచి
మూడులోకముల కొలిచిన పాదం
... ... ... ... ...
దాసపురందర దాస హృదయ
సంగీత నాదమే ఈ పాదం -

అని విశ్వంలోని సత్కార్యమంతా, కళ అంతా వేంకటేశ్వరపాదమయమే అన్నారు కవి.

మనిషిగ పుట్టెను ఒక మట్టి
తన మనసును పెంచినదే మట్టి ?
తానై పుట్టెను ఒకమట్టి
తన పూవై పూచినదే మట్టి !
అటనట నిలిచెను ఒక గగనం
ఘటనా ఘటనల మెరుపులు
మెరిసినదే గగనం ?

అంటూ పంచభూతాత్మకమైన ఈ శరీరం ఆత్మ అనే దీపకళికతో చైతన్యవంతమయిన తీరును పాత తత్త్వాల బాణీలో చక్కగా చెప్పారు కవి. కబీరు వాణి క్యాసెట్‌లోను పది గీతాలు కబీరు హృదయ వ్యాఖ్యానాల వంటివి ఉన్నాయి. వినుమా రామనామ మహిమా, విషవలయమున విహరించు మృగమా— అని ప్రారంభమయ్యే ఈ గీతమాల కబీరు భావాలను జనవేద్యంగా వివరించింది :

నేననే అధికారము
నాదనే మమకారము
కాశిలో వదిలేయరా
గంగలో కలిపేయరా
త్యాగం ఒకటే నీ ధనమూ
ధ్యానం ఒకటే తీర్చెను ఋణమూ

అహంకార మమకారాలను తుడిచివేయగలవి ధ్యాన త్యాగాలు మాత్రమే. త్యాగేనైకే అమృతత్వమానశుః— అని వేదవాక్యం.

దేహమే ఒక గ్రామమూ
గ్రామాధికారే జీవుడూ
ఆలనా పాలనా చూచు
కుంటాడురా రాముడూ

అంటూ దేహానికీ, జీవాత్మ పరమాత్మలకూగల సంబంధాన్ని అతి సరళంగా వివరించారు. ఈ గీతాలు ఆలపించినవారు సుప్రసిద్ధులు. వారి మధుర గంభీర కంఠాలలో ఈ గీతాలు మరింత జనరంజకమౌతాయి. ఆరేసుకో పారేసుకోలాంటి పాటలేకాక, మనసును మథింపజేసే, హృదయాన్ని కదిలించే ఈ గీతాలు రచించిన శ్రీ సుందరరామమూర్తిని అభినందిస్తున్నాను.

## ఉపశ్రుతి :-

ఒక పుస్తకంలో ఒక విషయంకోసం వెదుకుతున్నాను, కాయితాలు తిరగవేస్తున్నాను. నా బాధ చూస్తున్న మిత్రుడు, సహపత్రికా రచయిత శ్రీ రాజేంద్ర ఎందుకు అంతగా తిరగేస్తున్నారు కాయితాలు? విషమసూచిక లేదా ? దానిని చూడండి— అన్నారు. విషమసూచికా ! అదేమిటి ?— అనడిగాను ఆశ్చర్యంతో. అదేనండి విషయసూచిక— అన్నారు రాజేంద్ర నవ్వుతూ. ఒక అక్షరం మార్పుతో ఎంత నవ్వు పుట్టించారండీ ? అన్నాను నేను నవ్వుతూ.

—తిరుమల రామచంద్ర



సెప్టెంబరు 14న గీతాంజలి క్యాసెట్‌ను ఆవిష్కరించిన ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు. సంగీతం సమకూర్చిన శ్రీ చక్రవర్తి, రచించిన శ్రీ వేటూరి సుందరరామమూర్తి గార్లని చిత్రంలో చూడవచ్చు.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,
by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,
Editor: S. Radhakrishna. Phones :- Business : 61247, 61248. Editorial: 75667





# ఆలోచించిచూడండి!
# కొన్ని కొద్ది రోజులకే మోటారు 'నెప్పి' అని పని చేయకుండా ఉండే మిక్సీ మీకు అవసరమా?

ఆలోచించండి. మిక్సీకి గుండెలాంటిది. మోటారు. నాణ్యతలోకాని, తయారీలోకాని, కొంచెము తేడావచ్చినాసరే అది మీకు కష్టముగా తయారవగలదు. మోటారు ఆగకుండా పని చేయుటకు కావలసినవి. విపులమైన మరియు ఆరితేరిన పరిక్షాపరిక్రమములు ఇటువంటి పరీక్షలను నెగ్గివచ్చే మిక్సీలు బహు తక్కువ. అందువలనే అన్ని సమకూర్చబడిన కర్మాగారముతో ప్రతి విడి భాగము తయారుచేసి, పరీక్షించి. అమర్చబడిన మీనుమిక్స్ ఎంతో గట్టిది.

ఆలోచించండి. ఎటువంటి వాతావరణమైనను అవలీలగా ఎదుర్కొను శక్తి మీనుమిక్స్ యొక్క మోటారుకు గలదు.

ఆలోచించండి. ఎంతటి కరెంటు మార్పులైనను, ఈ మోటారు యొక్క పని చేయు శక్తిని తగ్గించలేవు.

ఆలోచించండి. ఒక ½ లీటరు స్టీల్ జాడిని [లోపల అమర్చబడిన బ్లేడ్‌తో సహా] మీరు పైసా ఖర్చు లేకుండా తీసుకెళ్ళవచ్చు ఆదిలోనే మీకు 150 రూపాయలు లాభం.

ఆలోచించండి. రెండు జాడిలలోను పర్మనెంటుగా అమర్చబడిన బ్లేడులు వలన మీకు ఎంతో హాయి. సుఖము....తక్కువ శ్రమ.

ఆలోచించండి. దృఢముగాను, తక్కువ స్థలము ఆక్రమించుకొనే తయారీ వలన మీకు ఎంతో హాయి.

మరింక ఎన్నో విషయాలు గూర్చి ఆలోచించండి—

ISI వారి చేత వేయబడిన 27 కష్టతరమైన నాణ్యతా పరీక్షల ధాటిని తట్టుకున్న మీనుమిక్స్.

ఏ లోసుగులు లేని, ఒక సంవత్సరపు గ్యారంటీలో పాటు వచ్చు మీనుమిక్స్.

ఎప్పుడూ తయారుగా ఉండే సర్వీసింగ్ సెంటర్‌లలోపాటు వచ్చు మీనుమిక్స్.

మొట్టమొదట ISI గుర్తును గెల్చుకున్నది. మీనుమిక్స్ ఉన్నది, నిజము.

18 సంవత్సరముల క్రితము అమ్మిన మీనుమిక్స్ ఇంకా మంచి స్థితిలో ఉన్నది. ఉన్నది, నిజము.

మీనుమిక్స్‌ను మీకు తెచ్చే కంపెనీ, భారతదేశములోనే మొట్టమొదట ఎలక్ట్రానిక్ ఫుడ్ ప్రాసెసర్ తయారుచేయుటకు నైపుణ్యము కల్గినవారు.

మీ ఆలోచనలను రేకెత్తిస్తుందా? కాని చూడండి.

# Meenumix



*Meenumix*

*— for those who think beyond the big names and namesakes.*

Meenu Equipments

P.O. Box No. 6909 Coimbatore 641 044

Regional office/Service Centres Regional office/Service Centres : Bangalore Ph : 72765 ; Cochin Ph : 311596 ; Hyderabad Ph : 67327 ; Madras Ph : 474691

ANDHRA : Authorised Stockists HYDERABAD: Instyle, 3-6-477/2, Himalatnagar(Ph: 61664) VIJAYAWADA : Sunil Engineering Company Opp Tarapet Goods Shed, Pandit Jawaharlal Nehru Road (Phone 77357)

VISAKHAPATNAM Andhra Trunk Works 26-15-39, Main Road (Phone : 63448)



"నాకు ప్రియమైన సహనటుడా?
సింథాల్ !
దీంతో నేను మూడు షిఫ్టులు
పని చేసినాసరే
తాజాగా, అందంగా వున్న
అనుభూతిని పొందుతాను"









ఇప్పుడు
సరికొత్త ప్యాక్‌లో

గోద్రెజ్
ఉత్పాదన

సింథాల్ పరిమళం రోజంతా తాజాదనానికి.

CHAITRA-B-G-403TEL

